| విషయము | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| గృహారంభం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో-బు-గు శు | అశ్వి రో మృ పున ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ శత రే | వృ.మి. కన్య. ధ.కు మీ. (సిం. వృశ్చి) | అష్టమశుద్ధి. కర్తరీమీనమిథున ధనుర్మాసములు నింద్యములు |
| గృహప్రవేశం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో-బు-గు శు | రో మృ ఉత్తరాత్రయం చి అనూ ధ. శత రే.(పుష్య) | వృ.మి. సిం. క. వృ ధ.కుం.మీ. | అష్టమశుద్ధి, కలశ చక్రశుద్ధి (చతుర్థశుద్ధి) |
| నిషేకము | ౨-౩-౫-౧౦ | సో-బు-గు శు (శ) | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయ హ చి స్వా అనూ మూ శ్ర ధ శత రే | శుభయుతిదృష్టములు. | సంధ్యాపర్వప్రదోష వ్రతశ్రాద్ధ దినములు నింద్యములు |
| గర్భాధానము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | ఆ-సో-బు గు-శు | రోమృపునపు ఉత్తరాత్రయ హచి స్వా అనూశ్రధశ ఆర్ద్ర పూర్వాత్రయంవిశా | ,, | సంధ్యాపర్వ వ్రత శ్రాద్ధదినములు నింద్యములు |
| పుంసవన సీమంతములు | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | ఆ-మం-బు గు-శు | మృ పున పు హ అనూ శ్ర ధ శత రే (అశ్వి రో చి స్వా ఉత్తరాత్రయం) | మే.వృష.మి.తు. ధ.కుం.మీ | పుంసవనమునకు ౩ మాసం. సీమంతం ౪,౬,౮మాసములు |
| జాతకర్మ నామకరణములు | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | ఆ-సో-బు గు-శు | అశ్వి రో మృ పున పు హ చి స్వా అనూ ఉత్తరాత్రయం శ్ర ధ శత రే | శుభలగ్నములు ,, | అష్టమశుద్ధి. ,, |
| డోలారోహణము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | ఆ-సో-బు గు-శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి అనూ రే స్వా శ్ర | ,, | ,, |
| నిష్క్రమణం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | సో-బు-గు శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ రే | మే. వృష. కర్కా. తు. ధ. మీ. | ౪ మాసం శుభం ౩ మాసమున్ను శుభము |
| అన్నప్రాశనం | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు శు-ఆ | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ శత రే | మీన. మే. వృశ్చి. మినా | దశమశుద్ధిపూర్వాహ్ణము పురుషులకు సరిమాసలు, స్త్రీలకు బేసి. |
| కర్ణవేధ | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | సో-బు-గు శు-ఆ | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి శ్ర ధ అనూ రే (ఆర్ద్ర) | వృ.మి. క. క. తు.ధ మీ. (మే.మ) | ౬-౭-౮ మాసములు అష్టమశుద్ధి |
| కేశఖండనం | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు శు | అశ్వి మృ పున పు హ చి స్వా శ్ర ధ శత రే (జ్యే) | శుభలగ్నములు | ఉత్తరాయణం పూర్వాహ్ణం విషమవర్షములు అష్టమశుద్ధి |
| అక్షరాభ్యాసము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౨-౧౩ | సో-బు-గు శు | అశ్వి పున పు హ చి స్వా అనూ శ్ర రే (ఆర్ద్ర మృ ధ శ) | మి. కన్యా. ధ. మీ. | అష్టమశుద్ధిఉత్తరాయణం ౫-వ సంవత్సరము |
| విద్యారంభం | ౨-౩-౫-౧౦-౧౧-౧౨ | బు-గు-శు | అశ్విమృఆర్ద్రపున పు ఆశ్రే పూర్వాత్రయం హ చి స్వామూశ్ర(ధశతఅనూ) | మే. మి. క.క.తు.ధ. మ. మీ. | దివాభాగము శుభము |
| ఉపనయనం | ౨-౩-౫-౧౦-౧౧ (౬-౧౨) | బు గు సో శు | అశ్విరోమృపున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ శ రే | శుభలగ్నములు | అష్టమశుద్ధి మీన చైత్రము శుభం |
| వివాహం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౨-౧౩-౧౫ | బు-గు-శు | రో మృ మ ఉత్తరాత్రయం హ స్వా అనూ మూ రే (అశ్వి శ్ర చి ధ) | శుభలగ్నములు | జామిత్రశుద్ధి. మీన చైత్రము నింద్యము |
| నవవధూప్రవేశము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | సో-బు-గు శు | అశ్విరో మృపున పు మ ఉత్తరాత్రయం హ చి స్వా అనూ మూ శ్ర ధ శత రే | ,, | ద్వాదశశుద్ధి విమవర్షమాసములు |
| నవవస్త్రాభరణ ధారణం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | బు-గు-శు | అశ్వి హ చి స్వా వి అనూ ధ రే (నరస్వైక,రో పున పు ఉత్తరాత్రయం) | వృ. మి. క.క. తు.ధ. మీ. | తృతీయశుద్ధి |
| వాపీకూపాదికము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో-బు గు శు | అశ్విరోమృపుష్య మ ఉత్తరాత్రయం హ అనూ మూ శ్ర ధ శ రే (జ్యే) | కర్కా. మ.కుం.మీ. | అగ్ని,దక్షిణ, నిర్వృతి, వాయు, దిక్కులు గృహమధ్యంకూడవు |
| బీజావాపనం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో-బు-గు శు | రోపుష్య మ ఉత్తరాత్రయం హ స్వా అనూ మూ శ్ర శ రే అశ్వి మృ పునధని | వృ. కర్కా. సిం.మ. (తు. మి. కు.) | అష్టమశుద్ధి. ౩-౬లలో శుభులు కూడదు |
| వృక్షలతాదిస్థాపనం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో. బు.గు శు | అశ్విరోమృ పుష్య మ ఉత్తరాత్రయం హ చి వి అనూ మూ శ్ర శత రే | శుభలగ్నములు. | చతుర్థమునకు శుభదృష్టి వలయును |
| దేవతా ప్రతిష్ఠ | ౨-౩-౫-౭-౮-౧౦-౧౧-౧౨-౧౩ | ఆ-సో-బు గు-శు | అశ్విరో మృ పున పు ఉత్తరాత్రయహ చి స్వా అనూ శ్ర ధ శ రే (దేవనక్షత్ర) | వృష. వృ. సిం. మి. కన్యా. ధ. కుం.మీ. | సౌమ్యదేవతలకు ఉత్తరాయణం ఉగ్రదేవతలకు దక్షిణాయనం |
| యాత్ర | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | బు గు-శు | అశ్వి మృ పున పు హ అనూ ధ శ్ర రే (రో ఉత్తరాత్రయం మూ శ) | మే. వృష. క.తు.ధ. మ.మీ. | పంచమశుద్ధి శుకునం |
| హలకర్మ | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | ఆ-మం-బు గు-శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా వి అనూ మూ శ్ర ధ శ రే | వృ.మి.కన్యా.వృ.ధ. మీ. | కర్తరికూడదు. |

## రాహు, గుళిక కాలములు

సూర్యోదయము 6 ఘంటలకు అయ్యే దినములకు

| వారములు | రాహుకాలము | | గుళికకాలము | |
|---|---|---|---|---|
| | మొదలు | వరకు | మొదలు | వరకు |
| ఆదివారము | 4-30 | 6 | 3 | 4-3ı |
| సోమవారము | 7-30 | 9 | 1 30 | 3 |
| మంగళవారము | 3 | 4-30 | 12 | 1 30 |
| బుధవారము | 12 | 1-30 | 10-30 | 12 |
| గురువారము | 1-30 | 3 | 9 | 10 30 |
| శుక్రవారము | 10.30 | 12 | 7 30 | 10 |
| శనివారము | 9 | 10.30 | 6 | 7-30 |

## వివాహమునకు ముందు చూడవలసిన పొంతనములు

### ౧ నాడీకూటము

ఏకనాడీనక్షత్రములు:—జ్యేష్ఠ, మూల, ఉ-ఫ, హస్త, ఆర్ద్ర, పున, శత, పూభా, అశ్విని.

మధ్యనాడీనక్షత్రములు—పుష్య, మృగ, చిత్ర, అనూ, భరణి, ధనిష్ఠా, పూఫ, ఉ-భా.

### అంత్యనాడీ నక్షత్రములు

స్వాతి, కృత్తిక, ఆశ్లే, ఉషా, విశా, రోహి, మఘ, శ్రవ, రేవతి- ఇందు వధూవరుల నక్షత్రములు రెండును ఒకేనాడియం దున్నచో అనిష్టము గల్గును. భిన్నవాడీగతనక్షత్రము లైనచో శుభప్రదములు.

### ౨ గణకూటము

దేవగణ నక్షత్రములు:—అనూ, పున, మృగ, శ్రవ, రేవ, స్వాతి, అశ్వి, హస్త, పుష్య.

### రాక్షసగణ నక్షత్రములు

మఘ, ఆశ్లే, ధని, జ్యేష్ఠ, మూల, శత, కృత్తి, చిత్ర, విశాఖ.

### మనుష్యగణ నక్షత్రములు

పూ-ఫ, ఉ-ఫ, పూషా, ఉషా, పూభా, ఉభా, రోహి, భర, ఆర్ద్ర.

### 3 యోనికూటము

అశ్వినీశతతార లశ్వములు, భరణీరేవతులు గజములు, కృత్తికాపుష్యలు మేకలు, రోహిణీ మృగశిరలు సర్పములు, ఆర్ద్రామూలలు శునకములు, పునర్వసూ ఆశ్లేషలు మార్జాలములు, మఘ పుబ్బ లెలుకలు, ఉత్తరఉత్తరాభాద్రలు గోవులు, హస్తస్వాతు లెనుబోతులు, చిత్రావిశాఖలు పెద్దపులులు, అనూజ్యేష్ఠలు లేళ్ళు, పూషాశ్రవణములు కోతులు, ధనిష్ఠాపూర్వాభాద్రలు సింహములు, ఉషాభిజిత్తులు ముంగిసలు. ఇట్లు యోచించివిరోధజంతునక్షత్రములు లేని స్త్రీపురుషులకు వివాహము చేయవలయును. విరోధజంతువులు: కుక్కలు లేళ్లు, పాములు ముంగిసలు, సింహగజములు, గుర్రము లెనుబోతులు. గోవ్యాఘ్రములు, పిల్లులెలుకలు విరోధిజంతువులు.

ఇందు వధూవరులనక్షత్రములు రెండును ఒకేగణమం దున్నచో అంత్యంతానురక్తులై యుందురు. ఒకటి దేవగణములోనిది, రెండవది మనుష్యగణములోనిది అయినయెడల సామాన్యమైన అనురాగముగల వారగుదురు. ఒకటి రాక్షసగణములోనిదై, రెండవది మనుష్యగణము లోనిదైనను, దేవగణములోనిదైనను అశుభకరము.

## ఉపయుక్తవిషయములు

### 1. రజస్వలవిషయమై దుష్టతిథివారనక్షత్రములు

శుక్లపక్షమందును, కృష్ణపక్షమందును పాడ్యమి, చవితి, నవమి ద్వాదశి, చతుర్దశులును, అమావాస్య, ఆది, మంగళ, శనివారములును, భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్లేష, మఘ, పూఫ, పున, జ్యేష్ఠ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర ఈనక్షత్రములును దుష్టములు. వీటియందు ప్రథమరజస్వలయినచో శాస్త్రోక్తశాంతిజేసి తిరుగ మంచికాలమందు రజస్వలయగువరకు గర్భాధానము సేయింపజనదు. నక్షత్రము దుష్టమయినచో హోమవిధానముగ శాంతి చేయవలయును. నక్షత్రము మంచిదై తక్కినవి చెడుగైనచో సామాన్యశాంతి చేయవలయును. మరియు వ్యతీపాతి, వైధృతి, పరిఘాపూర్వార్ధము, సంక్రాంతి, గ్రహణకాలము, నిద్రాసమయము ఇవియును శుభమయినవి కావు. మరియు ప్రాతఃకాలమున సౌభాగ్యవతి, పూర్వాహ్ణమందు యాత్రలు చేయునది, మధ్యాహ్నమున పుత్రవతియు ధనవతియు, సాయంకాలమున జారిణి, సంధ్యలయందు దుశ్శీలురాలును, అర్ధరాత్రియందు విధవయును, ఉషఃకాలమున సౌభాగ్యరహితయు నగును.

### 2. జననవిషయమై దుష్టతిథివారనక్షత్రాదులు

అశ్విని ౧ పాదము, మఘ ౧ పాదము, రేవతి ౪ పాదము ఇవి శిశుగండము. భరణి 3 పాదము, కృత్తిక 3 పాదము, పుష్య ౨ 3 పాదములు, మఘ 3 పాదము, ఉత్తర ౧ పాదము(కొందరు ఉత్తరాషాఢ యందురు) హస్త 3 పాదము, చిత్ర ౧, ౨ పాదములు, పూర్వాషాఢ 3 పాదము, ఇవి పురుషుడైన పితృగండము, స్త్రీశిశువైనచో మాతృగండము.

రోహిణి ౧, ౨ పాదములు తల్లికిని, మేనమామకును, 3-౪ పాదములు కేవలం మేనమామకును గండములు. ఆశ్లేష ౧పా॥ ధనహాని. 3పా॥ తల్లిగండము. ౪పా॥ తండ్రిగండము. ౧పా॥ దోషముకాదు. మూల ౧పా॥ తండ్రిగండము. ౨పా॥ తల్లిగండము. ౪పా॥ దోషము గాదు. 3పా॥ ధనహాని. అందును మూల ౧ పాదములో మొదటిసగము మిక్కిలి దోషమయినది. జ్యేష్ఠయొక్క నక్షత్రాద్యంతమును ౧౦ విభాగింపవలెను. అందే భాగమైనచో ఆ భాగముయొక్క ఫలమును తెలుసుకొనవలయును. ౧భా॥ మాతామహిగం॥ ౨భా॥ మాతామహగం॥ 3భా॥ మేనమామ గం॥ ౪భా॥ తల్లి గం॥ ౫భా॥ శిశుగం॥ ౬భా॥ గోత్రనాశనం. ౭భా॥ ఉభయకులనాశనం. ౮భా॥ సోదరగం॥ ౯భా॥ శ్వశుర గం॥ ౧౦భా॥ సర్వనాశనమును చేయును. ౧౧భా॥ మిక్కిలి దుష్టమయినది. విశాఖ పురుషుడైన భార్యానుజ గం॥ స్త్రీశిశువైనచో భర్తయొక్క సోదరునకు గండము.

మీన మేషములకును, కర్కాటక సింహములకును, వృశ్చికధనుస్సులకును, సంధి అరఘడియ ప్రబల శిశుగండము.

జన్మవిపత్తులకును, దశమైకాదశులకును, పూర్ణిమాప్రతిపత్తులకును, అమావాస్యాప్రతిపత్తులకును సంధి ౨ గడియలును, బహుళ ౧౪ శిలో నెండవది ఒక సంతుగాక తక్కిన భాగములును దుష్టములైనవి. వ్యతీపాత, వైధృతి, పరిఘ, వ్యజ్ర, వైద్రుతులను మహాపాతలును, సంధ్యాకాలములు, అమావాస్య, తల్లి తండ్రి సోదరుల వీరి నక్షత్రములు నైనను గ్రహణకాలమయిననుగూడ శాంతి చేయవలయును.

పైనజెప్పబడిన నక్షత్రములయందు ఆయా పాదములయందు జననమయినచో మహాదోషము గాన హోమములు, సమారాధనము మొదలగు సంపూర్ణశాంతి చేయవలయును. చెప్పబడిన పాదములుగాక తక్కినపాదములయినను సామాన్యశాంతి చేసికొనుట యుక్తము. నక్షత్రము మంచిదై తక్కిన తిథి మొదలగునవి చెడుగైనను సామాన్యశాంతి చేసుకొనవలయును.

మరియు మృగశిర ౧పా॥ విశాఖ ౪పా॥ అనూరాధ ౩పా॥ ధనిష్ఠ ౨పా॥ శతతార ౧పా॥ ఉత్తరాభాద్ర ౪పా॥ ఇవైనను సామాన్యశాంతి చేసికొనుట యుక్తము.

## అమృతాది యోగములు

| | అశ్వి | భ | కృ | రో | మృ | ఆర్ద్ర | పున | పు | ఆశ్లే | మ | పుబ్బ | ఉత్త | హ | చి | స్వా | విశా | అనూ | జ్యే | మూ | పూషా | ఉషా | శ్ర | ధ | శత | పూభా | ఉభా | రే | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | సి | ప్ర | అసి | సి | సి | సి | సి | సి | సి | మ | సి | అ | అసి | సి | సి | ఉ | మ | మ | అ | సి | అ | అ | మ | సి | సి | అ | అ | |
| సోమ | సి | సి | మ | అ | అసి | సి | సి | అ | సి | ఉ | సి | సి | సి | ప్రఅ | అ | మ | సి | సి | సి | ఉ | మ | అ | సి | సి | మ | సి | సి | |
| మంగళ | అసి | సి | సి | అ | సి | మ | సి | సి | సి | సి | సి | అ | సి | సి | సి | మ | అసి | ఉ | అ | సి | ప్రఅ | అ | సి | మ | మ | అ | సి | |
| బుధ | మ | సి | అ | సి | సి | సి | సి | సి | సి | సి | అ | అ | మ | సి | సి | సి | అసి | సి | మ | అ | అ | సి | ప్రఅసి | అ | సి | ఉ | | |
| గురు | అ | సి | మ | ఉ | మ | మ | అ | అసి | సి | అ | సి | మ | సి | సి | సి | అ | సి | సి | ప్రఅసి | సి | సి | సి | సి | మ | సి | సి | సి | |
| శుక్ర | అ | సి | సి | మ | సి | మ | సి | సి | మ | మ | సి | సి | అ | సి | సి | సి | సి | సి | మ | అ | ప్రఅ | సి | మ | సి | సి | సి | సి | ఉ |
| శని | సి | సి | అ | అ | సి | సి | సి | సి | మ | అ | సి | ఉ | మ | మ | అ | సి | సి | సి | సి | సి | సి | సి | సి | అ | మ | మ | ప్రఅ | |

అ=అమృతయోగము, సి=సిద్ధయోగము, అసి=అమృతసిద్ధయోగము, ఉ=ఉత్పాతయోగము, మ=మరణయోగము, ప్రఅ=ప్రబలారిష్టయోగము.

## శ్రీ సర్వధారి సంవత్సర ఉదయాస్తమయ (స్టాండర్డుటైము) గంటలు, నిమిషములు (1948-1949)

| నెల. తేదీ. | | రాజమండ్రికి | | బెజవాడ | | మదరాసుకు | | | | రాజమండ్రికి | | బెజవాడకు | | మదరాసుకు | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1948 సంవత్సరం | | ఉ. గ. | అ. గ. | ఉ. గ. | అ. గ. | ఉ. గ. | అ. గ. | | | ఉ. గ. | అ. గ. | ఉ. గ. | అ. గ. | ఉ. గ. | అ. గ. |
| ఏప్రెల్ | 10 | 5_53 | 6_16 | 5_58 | 6_21 | 6_ 1 | 6_20 | అక్టోబరు | 11 | 5_56 | 5_46 | | 5_48 | 5_59 | 5_47 |
| ,, | 20 | 5_46 | 6_18 | 5_51 | 6_23 | 5_56 | 6_21 | | 21 | 5_59 | 5_37 | 6_0 | 5_42 | 6_ 1 | 5_44 |
| ,, | 30 | 5_40 | 6_21 | 5_45 | 6_26 | 5_50 | 6_24 | | 31 | 6_ 2 | 5_31 | 6_4 | 5_35 | 6_ 4 | 5_39 |
| మే | 10 | 5_35 | 6_23 | 5_40 | 6_28 | 5_46 | 6_24 | నవంబరు | 10 | 6_ 6 | 5_27 | 6_16 | 5_31 | 6_ 6 | 5_35 |
| ,, | 20 | 5_32 | 6_27 | 5_37 | 6_32 | 5_44 | 6_27 | | 20 | 6_12 | 5_26 | 6_16 | 5_30 | 6_13 | 5_32 |
| ,, | 30 | 5_30 | 6_30 | 5_35 | 6_34 | 5_42 | 6_30 | | 30 | 6_17 | 5_26 | 6_21 | 5_30 | 6_17 | 5_32 |
| జూన్ | 1 | 5_30 | 6_31 | 5_35 | 6_35 | 5_42 | 6_31 | డిసెంబరు | 1 | 6_18 | 5_20 | 6_22 | 5_24 | 6_19 | 5_31 |
| ,, | 11 | 5_30 | 6_35 | 5_35 | 6_39 | 5_42 | 6_34 | | 11 | 6_24 | 5_28 | 6_28 | 5_32 | 6_23 | 5_38 |
| ,, | 21 | 5_32 | 6_37 | 5_37 | 6_41 | 5_45 | 6_36 | | 21 | 6_29 | 5_32 | 6_33 | 5_36 | 6_28 | 5_42 |
| జూలై | 1 | 5_35 | 6_39 | 5_41 | 6_44 | 5_47 | 6_38 | | 31 | 6_34 | 5_38 | 6_38 | 5_42 | 6_33 | 5_48 |
| ,, | 11 | 5_38 | 6_39 | 5_43 | 6_43 | 5_50 | 6_38 | 1949 జనవరి | 1 | 6_34 | 5_39 | 6_38 | 5_43 | 6_33 | 5_49 |
| ,, | 21 | 5_41 | 6_38 | 5_46 | 6_42 | 5_53 | 6_38 | | 11 | 6_37 | 5_44 | 6_41 | 5_48 | 6_36 | 5_54 |
| ,, | 31 | 5_44 | 6_35 | 5_49 | 6_39 | 5_56 | 6_36 | | 21 | 6_38 | 5_52 | 6_42 | 5_46 | 6_37 | 6_11 |
| ఆగష్టు | 10 | 5_47 | 6_30 | 5_52 | 6_34 | 5_59 | 6_31 | | 31 | 6_37 | 5_56 | 6_41 | 6_ 0 | 6_38 | 6_ 6 |
| ,, | 20 | 5_49 | 6_24 | 5_54 | 6_28 | 5_59 | 6_27 | ఫిబ్రవరి | 10 | 6_33 | 6_ 1 | 6_37 | 6_ 5 | 6_35 | 6_10 |
| ,, | 30 | 5_50 | 6_17 | 5_55 | 6_21 | 6_ 0 | 6_20 | | 20 | 6_29 | 6_ 5 | 6_33 | 6_ 9 | 6_31 | 6_12 |
| సెప్టెంబరు | 9 | 5_52 | 6_ 9 | 5_57 | 6_14 | 6_ 0 | 6_15 | మార్చి | 2 | 6_23 | 6_ 9 | 6_27 | 6_13 | 6_27 | 6_14 |
| ,, | 19 | 5_53 | 6_ 1 | 5_58 | 6_ 6 | 5_59 | 6_ 7 | | 12 | 6_15 | 6_ 1 | 6_19 | 6_ 5 | 6_20 | 6_ 8 |
| ,, | 29 | 5_54 | 5_53 | 5_59 | 5_58 | 5_59 | 6_ 0 | | 22 | 6_ 8 | 6_13 | 6_12 | 6_17 | 6_14 | 6_19 |
| అక్టోబరు | 1 | 5_54 | 5_51 | 5_59 | 5_56 | 5_59 | 5_59 | | 30 | 6_ 1 | 6_14 | 6_ 5 | 6_18 | 6_ 8 | 6_19 |




# ప్రస్తావన

సర్వజిత్తు నిష్క్రమించి సర్వధారి ప్రవేశించినది. నూతనసంవత్సరారంభమున భూతభవిష్యత్తులను గురించి తలపోయుట స్వాభావికము. గత సంవత్సరము కన్న రాబోవు సంవత్సరమును ఫలప్రదముగను, సంతోషప్రదముగను చేసికొనగోరుటయే దాని ఉద్దేశము. పూర్వానుభవమును స్ఫురణకు తెచ్చుకొనుట భవిష్యద్వ్యవహారమునకు ప్రయోజనకరముగను, గుణపాఠముగను నుండునని పెద్దలవాక్యము. అయితే ఈగుణపాఠము నేర్చుకొనుట జరుగుచున్నదా అని ప్రశ్నించినచో తృప్తికరమైన సమాధానము లేకపోవచ్చును. అయినను ప్రయత్నము వాంఛనీయము. సంవత్సరాదినాడు ఏరీతిగా ఉండిన సంవత్సరము పొడుగునను అదే విధముగ నుండునని సామాన్యముగా అనుకొందుము. అనగా ప్రయత్నశూన్యముగా అట్లు జరుగునని అర్థము కాదు. నాటి సంకల్పప్రవర్తనల గాఢతనుబట్టి యుండునని అర్థము. నూతన సంవత్సరనిశ్చయములు అనునది అందరును వినుమాట. కార్యసాధనకు నాడు మనస్సును ఉత్తేజపరచుకొనుట అని భావము. ఉద్విగ్నమానసిక స్థితియు, అందు గాఢముగా కార్యశ్రద్ధాదీక్ష హెచ్చుకొను లక్షణములు అపుడపుడు మాత్రమే తటస్థించును గాని పొడుగునను ఉండవు. అదివరకు ఎట్లున్నప్పటికిని పండుగదినము వచ్చునరికి అదివరకు లేని సంతోషమును తెచ్చిపెట్టుకొనగలుగుట నిత్యపరిస్థితిని అధిగమించి ఆనందపరిస్థితిని కలిగించుకొనగలుగుట అంతులేని శక్తి మనస్సునందు ఇమిడియున్నదని వ్యక్తము అవుచున్నది. అట్టి సంతోషపరిస్థితిని కల్పించినపుడు చేసికొనిన నిర్ణయములు, సంకల్పములు ఆచరణకు సులభసాధ్యములవును. అందుకు సంవత్సరాదికన్న ఉత్తమదినము, శుభదినము లేదుకదా?

సర్వజిత్తు ప్రపంచమునకు—ముఖ్యముగ భారతీయులకు సంతోషవిషాదసంఘటనలతో కూడినది. బ్రిటను రాజ్యాధికారమును భారతీయులపర మొనర్చినది. కాని దానితోపాటు భారతదేశమును విభజించిపోయినది. విభజనకన్న చేయగలిగినది, చేసినది మహాపచారము ఇంకొకటి లేదు. బ్రిటిషుపరిపాలనావిధానము భగ్నమైనదనుటకు ఇంతకన్న వేరు నిదర్శనము అనవసరము. ఇది తమ పరిపాలనాశయ (Fulfilment of British Rule in India) సిద్ధి యని వారు అనుకొనుచుండిరేమో తెలియదు. ఏసమస్యను పురస్కరించుకొని దేశవిభజనకు ఒడబడిరో ఆసమస్య నేటికి ఇంకను పరిష్కారము కాలేదు. తాము వచ్చినపుడు భారతదేశము ఏస్థితియందున్నదో అదేస్థితియందు తిరిగి వదలిపోయిరి. దేశమును విభజించుటయేగాక సంస్థానములకు స్వాతంత్ర్యము నిచ్చుటతో వారి సహృదయతను మరింత శంకించవలసిన పరిస్థితి ఏర్పడినది. కనీసము గవర్నరు మే ప్రణాళికకు అంటిపెట్టుకొనియుండినచో అది కొంతవరకు వారి నిష్కల్మషబుద్ధిని ధ్రువపరచియుండెడిది. దేశవిభజన సైనికరక్షణదృష్ట్యా సాధ్యము కాదని, విభజన అల్పసంఖ్యాక సమస్యను పరిష్కరింపజాలదని, ముస్లిములు ప్రత్యేక జాతి కాదని వారు నాడు తెలిపిరి. యూనియననునది సంస్థానములతో చేరి నిర్మింపబడవలెనని చెప్పిరి. కాని చివరకు దానికి విరుద్ధముగ ప్రవర్తించిరి. మే ప్రణాళిక ఉపసంహరింపబడుటకు కారణము కాంగ్రెసు, లీగులు అంగీకారమునకు రాకపోవుట అని వారు వాదించవచ్చును. కాని ఇది రెండుపక్షముల వాదములను సమన్వయపరచి సృష్టించితిమని చెప్పుకొనిరి కదా? అంతేకాక ఇది అంత్యప్రణాళిక యనియు, తమకు తామై ఇక ప్రయత్నించమనియు తెలిపిరి. పంజాబు బెంగాలులలో జిల్లాలను కలుప శక్తిలేక విభజనతప్ప మార్గము లేదని అభిప్రాయపడిరని అనుటకు వీలులేదు. సింధులో నివారింపగలిగినవారు ఈ రెండు రాష్ట్రములందును నివారింపగలిగియుండెడివారు. రాష్ట్రీయస్వాతంత్ర్యమను సాకుమీద కల్పించుకొన తిరస్కరించిరిగాని, ఆదిలోనే ఆ రెండురాష్ట్రముల గవర్నరులు పట్టుపట్టి, మంత్రివర్గములను బరతరఫుచేసి పరిపాలనను తాము వహించియుండినచో పరిస్థితులు అధ్వాన్నస్థితికి వచ్చెడివి కావు. అదియుగాక మే ప్రణాళికను అంగీకరించితిమని లీగు కేంద్రప్రభుత్వములో చేరి అపిమ్మట లేదనినపుడు వేవలుప్రభువు వానిని బర్తరఫుచేసియుండినను కూడ భారతచరిత్ర భిన్నముగ నుండెడిది. అయితే కాంగ్రెసుకూడ అస్సాము

కొరకు వర్గీకరణవిషయమున పట్టుపట్టుట మూలమున పరిస్థితి కొంతవరకు క్లిష్టమగుటకు కారణమైన దన వచ్చును. ప్రథమమున లీగు అంగీకరించినపుడే మే ప్రణాళికను అంగీకరించిన ఎటులుండెడిదో? వేవెలు ప్రభువు అల్లరులు జరుగుచున్న పంజాబురాష్ట్రము నందు బ్రిటిషు అధికారమును ఉపసంహరించిన బాగుండు ననె ననియు, అట్లే బ్రిటిషు ప్రభుత్వమునకు తెలిపె ననియు ప్రధాని అట్లీ తెలియజేసెను. అపుడే ఫిబ్రవరి ప్రకటన వెలువడినది. బ్రిటిషు అధికారము ఉండి ఉద్ధరించినది లేదు. ప్రజలే తమలో తాము ఏదోవిధమున పరిష్కరించుకొని యుండెడివారని వేవెలు ప్రభువు అభిప్రాయపడియుండవచ్చును. ఆయనసూచన అంగీకరింపబడలేదు. ఉండి ఉద్ధరించినది లేనప్పుడు అసలు అధికారము కేంద్రప్రభుత్వమునకు వప్పగించి వైదొలగినచో ఆసూచనను అనుసరించియుండెడిది. కేంద్రప్రభుత్వమున లీగుప్రతినిధులు చేరుటకుముందు అమాత్యప్రణాళికను అంగీకరించితిమని జిన్నాగారు చెప్పి తరువాత కాదనినపుడు వేవెలుప్రభువు ఊరకొనుటతో లీగు వైఖరి మరింత బిరబిగిసిపోయినది. ఎప్పుడైతే వేవెలు ప్రభువు కలకత్తా దురంతములప్పుడు ప్రసక్తిచేసికొనక ఊరకొనెనో అప్పటికే జిన్నాగారు తన ఆట సాగునని గ్రహించెను. అమాత్యత్రయ రాయబారమప్పుడున్నంత గట్టిగా బ్రిటిషుప్రభుత్వ ముండబోదని ఆయనకు ద్యోతకమైనది.

వేవెలుప్రభువును తొలగించి, విభజనకార్యక్రమమును నెరవేర్చవలసినదని మౌంట్‌బాటన్ ప్రభువును బ్రిటిషుప్రభుత్వ మంపినది. అదివరదాక భారతఐక్యత చెడకూడ దనిన బ్రిటను ఇప్పుడు ఆ విశ్వాసమును మార్చుకొనుటకు కారణము గోచరించుటలేదు. కేవలము పంజాబుఅల్లరులు, బెంగాలుఅల్లరులు కారణమనుటకు వీలులేదు. వాస్తవమునకు ఆ అల్లరులు వారి వైఖరివల్లనే పెరిగిపోయినవి. విభజన నిర్ణయమును సమర్థించుకొనుటకు వాటిని పెరుగనిచ్చిరేమో కూడ! అమాత్యప్రణాళికను వారు అమలుచేయలేని స్థితియందున్నారనుటకు వీలులేదు కాబట్టి వారి వైఖరిలో ఆకస్మికపు మార్పునకు అంతర్జాతీయ వ్యవహారములే కారణమని ఊహించవలసియున్నది. మధ్యప్రాచ్యమందలి ముస్లిము దేశములను సుముఖులుగా చేసికొనుటకే ఇది మూలము.

మౌంట్‌బాటనుపథకము దేశమును విభజించినదికాని అసలు దానికి కారణమైన అశాంతిని నిలుపలేకపోయినది. ఉభయపక్షములు అంగీకరించినప్పటికిని హత్యలు, దురంతములు ఆగలేదు. ఆపథకము అమలు జరుగుటకు ముందు, తర్వాతనుకూడ జరిగినవి. ఇప్పుడు కూడ జరుగుచునేయున్నవి. ఉభయ అధినివేశముల నుండి లక్షలాది ప్రజలు స్వగృహములను వదలి వీధులపాలు కావలసివచ్చినది. కని విని ఎరుగని బాధలు పడవలసివచ్చినది. ఎందరో మరణించిరి. ఆత్మీయులకు దూరమైరి. కులమును, మతమును, మానమును కోల్పోయిరి. అందువల్ల మౌంట్‌బాటన్ పథకము భగ్నమైనదనియే అనవచ్చును. ఇంత బాధపడుటకు సిద్ధముగ నుండిన అమాత్యపథకమునే అమలుపరచియుండవచ్చునేమో?

దేశవిభజనయే పెద్ద విషాద మనుకొనిన దాని తరువాత అంతకన్న విషాదకరమైన సంఘటన జరిగినది. అది గాంధీజీహత్య. దేశవిభజన మతద్వేషమును పురస్కరించుకొని జరిగినది. విభజన ఆ ద్వేషమును తీవ్రమొనర్చినదిగాని ఆర్పలేదు. గాంధీజీ దానికి ఆహుతి కావలసివచ్చెను. దీనినిగురించి ఇంతకన్న చెప్పుట అనవసరము.

గాంధీజీ మరణించిన విధము మహోత్కృష్టమైన ఆయనకీర్తిని ప్రజ్వలింపజేసినది. కాని భారతదేశము మాత్రము సిగ్గుతో తలవంచుకొనవలసివచ్చినది; వంచుకొనినది. చంపినవాడు హిందువు అని అనవచ్చును. అటువంటి హిందువు ఉద్భవించుటకు కూడ లీగు ప్రారంభించిన మతద్వేష రాజకీయములే కారణము. హిందువైనను, ముస్లిమైనను అది దేశపరిస్థితికి నిదర్శనము. గాంధీజీ పోయిన తరువాతగాని ఆ మానసికదుస్థితి ఆకళింపుకాలేదు. ఆయన జీవించి భారతదేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించెను. మరణించి దేశవంకటను మతసామరస్యమును ప్రగాఢమొనరించెను మరణించనియెడల నిరశనవ్రతమువల్ల కలకత్తా ఢిల్లీలందు హిందూ ముస్లిము సఖ్యతను స్థాపించినట్లుగానే పాకిస్థానులో కూడ ఆ సఖ్యతను స్థాపించగలిగెడువాడు. ఢిల్లీలో పరిస్థితి తనకు పూర్తిగా నచ్చినట్లు ఏర్పడినతరువాత పాకిస్థానుకు పోయి అక్కడ కృషిచేసెడివాడు. "భారతదేశములో పరిస్థితి చక్కబడినది నీరాజ్యమును చక్క-

బరచు"మని జిన్నాగారిని అడిగెడువాడు. బహుశః జిన్నాగారికికూడ ఆయన నాక సహాయకారిగ నుండెడిది. పాకిస్థానుకు అది ప్రాప్తిలేకపోయినది.

మూడుదశాబ్దములుగా గాంధీజీయే భారతదేశము, భారతదేశమే గాంధీజీగా నున్నవి. శ్రీరామ నామముతరువాత గాంధీజీ నామమంతగా ప్రజా హృదయములలో మరేనామము హత్తుకొనలేదు. ఆయన కేవలము స్వాతంత్ర్యోద్యమమును నడపిన నాయకుడే కాదు; భారతజాతికి జనకుడన్నమాట అక్షరాల సార్థకమైనది. ఆయనహత్యవార్త వినిపుడు దుఃఖించని భారతీయుడు లేడు. భారతీయులకు ఆయన అవతారమూర్తి ఆయెను.

భారతప్రధాని పండిత నెహ్రూ చెప్పినట్లు ౩౦ సంవత్సరముల క్రితమే గాంధీశకము ఆరంభమైనది. గాంధీజీ ఆశయములను అమలుజరపుటకు ప్రయత్నించెదమని భారతప్రభుత్వము ప్రకటించినది. పండిత నెహ్రూ చెప్పినట్లు గాంధీజీసిద్ధాంతములననుసరించిననే తప్ప భారతసమస్యలు పరిష్కారము కాజాలవు.

ఇంతవరకు వచ్చిన కష్టములను భారతప్రభుత్వము సంతృప్తికరముగనే ఎదుర్కొని పరిష్కరించినది. సార్వభౌమత్వము ఎవరికిని సంక్రమింపక అంతరించిపోవు నను బ్రిటిషు ప్రకటన సంస్థానములన్నిటిని స్వతంత్రములను చేసినది. పాకిస్థానుగా పడిపోయిన ప్రదేశము పోగా మిగిలిన దేశముకూడ వివిధ రాజ్యములుగా విడిపోవు ప్రమాదము లేకపోలేదు. కాని సంస్థానశాఖామంత్రి సర్దార్ పటేల్ రాజకీయచాతుర్యము, సంస్థానాధీశుల వాస్తవిక దృక్పథములనుబట్టి అట్టి ప్రమాదము తొలగిపోయినది. హైదరాబాదు తప్ప మిగిలిన సంస్థానములన్నియు భారతయూనియనులో చేరిపోయినవి. బాధ్యతాయుత ప్రభుత్వములను స్థాపించుచున్నవి. నైజాము సమస్య కూడ ఈ మాసాంతమునకు తేలిపోగలదు. తా నింతవరకు అనుసరించిన విధానముయొక్క దుష్ఫలితములను నైజాము గ్రహింపకతప్పదు. బ్రిటిషు ప్రభుత్వమే ప్రజాభిమతమునకు లొంగక తప్పనపుడు ఇక తాను త్రోసిపుచ్చగల ననుకొనుట భ్రమతప్ప వేరు కాదు. భారతయూనియనును కాదని హైదరాబాదు సంస్థానమనునది మనజాలదు. కాశ్మీరుసమస్య ఉభయ అధినివేశముల చేతులను దాటిపోయినది. దాని పరిష్కారము ఐక్యరాజ్యసమితిమీద ఉన్నది. కాని అగ్రరాజ్యములు ఇదమిత్థ నిర్ణయమునకు వచ్చువరకు ఆ సమస్య తేలునని చెప్పుటకు వీలులేదు. ఈ వైఖరికి కారణము భారత వైదేశికవిధానము విస్పష్టముగా లేకపోవుటయే.

అగ్రరాజ్యములలో ఏవర్గపక్షమున చేరమని, యుద్ధము వచ్చిన మనకు ఏ పక్షము వహించిన ఉపయోగమో ఆవైపున చేరెదమని ప్రధాని పండిత నెహ్రూ పదేపదే ఉద్ఘాటించెను. ఇది ఏవర్గమునకును తృప్తినివ్వక ఉభయులకు అసంతృప్తిని కలుగజేయక తప్పదు. అసలు అది ఒక విధానమని అనిపించుకొనజాలదు. బ్రిటను దేశవిభజనను సైనికవ్యూహదృష్ట్యా జరిపినదని పశ్చిమరాజ్యముల విధానమును గమనించిన బోధపడగలదు. పాలస్తీనానుండి దూరప్రాచ్యమువరకు వారనుసరించిన పద్ధతి దానిని ధ్రువపరచుచున్నది. అసలు కాశ్మీరును విభజించవలెనను సూచన అమెరికాది అను అభిప్రాయము లేకపోలేదు. ప్రథమమున పాలస్తీనాను విభజింపమని సూచించిన అమెరికా ఇపుడు ఆ ప్రతిపాదనను ఉపసంహరించుకొనినది. బహుశః పాలస్తీనావిషయము తేలువరకు కాశ్మీరుప్రశ్న కూడ తేలకపోవచ్చును. రెండును సైనికవ్యూహదృష్ట్యా ప్రాముఖ్యము కలవి. కాబట్టి వాటి పరిష్కారముకూడ పరస్పరాశ్రితము కావచ్చును. విస్పష్టవిదేశవిధానము అవసరమని కాశ్మీరు వెల్లడిచేయుచున్నది. కనుక భద్రతామండలికి భారతప్రతినిధి పోటీచేసినపుడే ఈవిషయము వెల్లడి అయినది. అగ్రరాజ్యపు ఎత్తులందు చదరంగపు బంటుగా ఉండదలచలేకని పోటీనుండి విరమించితిమని ఆత్మశ్లాఘ ఒనర్చుకొంటిమి.

కాని భారతదేశమునకు అంతర్జాతీయముగా శత్రులెవరో, మిత్రులెవరో తెలియుటలేదు. అందుకు కూడ నిశ్చితమైన విధాన మవసరము. అంతేకాక జాతీయవిధానము, విదేశవిధానము పరస్పరబద్ధమైనవి గాంధీజీయే యుండిన ఆ రెంటిని ఒక విశిష్టమార్గమున నడిపియుండెడివాడు. ఆయనయెడ ఉన్న భక్తివల్ల ఇపుడు వాపోవుట జరుగుచున్నది. అంతేకాని ఆయన మరణమువల్ల దేశమునకు, ప్రపంచమునకు ఎంత నష్టము సంభవించినది ఆకళింపుకాలేదు. గాంధీజీ మూలమున ఆసియానేకాక యావత్ప్రపంచదృష్టిని భారతదేశము ఆకర్షించినది. అహింసాతత్వమే ప్రపంచ సమస్యల పరిష్కారమునకు మార్గ మని గ్రహించిన

సమయములో ఆయన గతించెను. దానితో అంతర్జాతీయముగ భారతదేశమునకు రావలసిన ప్రముఖస్థానమునకు అడ్డు వచ్చినది. ప్రపంచమునకు ఈనాడు గాంధీజీతో ఎంతైనను అవసర మున్నదని, చరిత్రను పరికించిన ప్రపంచములో నేడు ప్రబలిన పీడను, దరఃస్థను తుదముట్టించగలది గాంధీజీఅహింసయే నని పండిత నెహ్రూ తెలిపెను. అందువల్ల ఆ సిద్ధాంతమును జాతీయ అంతర్జాతీయ ములందు అనుష్ఠించునట్లు చూచు బాధ్యత ప్రత్యేకముగ భారతదేశముపై నున్నది.

ఆర్థికపారిశ్రామికాభివృద్ధికి, దిగుమతులకు ఇతరులపై ఆధారపడవలసియున్నది. ప్రస్తుతము కీలక యంత్రములనుగాని, పెట్టుబడినిగాని ఇవ్వగల్గినది ఒక అమెరికా మాత్రమే కనబడుచున్నది. ప్రజాప్రభుత్వ రాజ్యము లన్నియు అమెరికానుండియే సహాయమును పొందుచున్నవి. యూరపునకు మార్షలుపథకము అను పేరున సహాయముచేసినట్లు ఆసియాకుకూడ నెహ్రూ పథక మను పేరున సహాయము చేయదలచినట్లు సూచింపబడినది. దానినిగురించి సంప్రతింపులు జరిపి పథకమును తయారుచేయుటకు సందేహింప నవసరములేదు. ప్రజాప్రభుత్వ సిద్ధాంతములకు, భారతఆశయములకు ఎక్కువ సామీప్య మున్నదిగాని రష్యా ప్రతిపాదించుచున్న కమ్యూనిస్టు నియంతృత్వమునకు సాన్నిహిత్యము లేదు. దౌర్జన్యపద్ధతులకు దిగకుండగనే సాంఘిక ప్రజాప్రభుత్వమును పార్లమెంటరీవిధానము ద్వారా స్థాపించవచ్చునని బ్రిటను రుజువుచేసినది. భారతరాజ్యాంగపు ముసాయిదా ప్రజాసత్తాక రాజ్య స్థాపనే ఆశయముగా వివరించినది.

బానిసత్వము మూలమునను, యుద్ధపరిస్థితివలనను అణచబడియున్న ఉద్రేకము స్వాతంత్ర్యము లభించగనే ఒక్కపర్యాయము పైకుబికినది. నేడు దేశమున చెలరేగుచున్న అశాంతికి అదే ప్రధాన కారణము. కాని క్రమక్రమముగా స్వాతంత్ర్యముతో వచ్చిన బాధ్యతలను గుర్తించుట జరిగి దేశము స్తిమితము చెందగలదు. అట్టి పరిస్థితిని కలిగించుటకు అన్ని రాజకీయపక్షములును ప్రభుత్వమునకు తోడ్పడవలసియున్నది. సిద్ధాంత ప్రచారము సాకుగా అంతఃకలహములు ప్రేరేపించినచో వచ్చిన స్వాతంత్ర్యప్రయోజనము వ్యర్థముకాగలదు.

ముఖ్యముగా పారిశ్రామికరంగమున శాంతి అనునది అవసరము. అశాంతిని, అరాచకమును పెంపొందించిన తమ రాజకీయప్రయోజనములకు అనుకూలముగ నుండునను వారు తప్ప మరేపక్షమును ఈసమయమున ఉత్పత్తిని తగ్గించుటకు ప్రయత్నింపదు. భారత ప్రభుత్వము పరిశ్రమలలో కార్మికవర్గమునకు భాగస్వామికున్న స్థానమున్నట్లు గుర్తించినది. అందువల్ల ప్రభుత్వమును పెట్టుబడిదారులకు పక్షపాతికముగ నున్నారని నిందించుటకు వీలులేదు. అహింసామార్గమున స్వాతంత్ర్యమును సంపాదించినపుడు దేశ ఆర్థిక సాంఘికనిర్మాణము కూడ అదే పద్ధతిని సాధించవలసియున్నది. అంతేకాక అల్పసంఖ్యాకుల సమస్య ఇంకను ఆందోళనకరముగనే యున్నది. వెనుకటంత ప్రమాదకరముగా లేనప్పటికిని సింధునుండి, తూర్పుబెంగాలునుండి హిందువులు తరలివచ్చుట ఇంకను తగ్గలేదు. కొద్దికాలములో ఉభయ అధినివేశముల సంప్రతింపులవల్ల సాధారణపరిస్థితి ఏర్పడవచ్చును. ప్రస్తుతఉద్రేకము తగ్గిన మీదట ఆత్మపరిశోధన జరిగి ఉభయ అధినివేశ ప్రజలు తాము పరాయివారము కామని గ్రహించి అనేక విషయములందు ఏకమార్గమున నడువవచ్చును. పాకిస్థానుతో రక్షణ ఏర్పాటు చేసికొనుటకు అభ్యంతరము లేదని ప్రధాని నెహ్రూ చెప్పియుండెను.

నూతనరాజ్యాంగమును జూనునాటికి పరిషత్తు ఆమోదించనున్నది. ఇప్పటికికూడ ఆంధ్రరాష్ట్రనిర్మాణము అస్థిరస్థితియందుండుట ఆంధ్రప్రజకు నిరాశాభావమును కలిగించినది. ఈ స్థితికి కారణము వివరముగ ప్రత్యేకవ్యాసములో చర్చింపబడినది. స్థానికరాజకీయములను మరచి ఇప్పుడైనను ఆంధ్రనాయకులు ఏకముఖముగ పనిచేసిన సర్వధారి గడువుకమునుపే ప్రత్యేకాంధ్రరాష్ట్రము సిద్ధింపగలదు. దూరదృష్టితో వ్యవహరించిన ఈ మహారంభమునకే వచ్చియుండెడిది. కాని ప్రాప్తము లేకపోయెను.

సర్వజిత్తు పైన చెప్పినట్లు విషాదసంఘటనలతో కూడియున్నది. సర్వధారి అట్లుగాక సర్వవిధముల మంగళప్రదమవుగాక. గాంధీజీ బోధించిన ఉత్కృష్ట సిద్ధాంతముల ననుసరించి భారతప్రజలు తమ దేశమును నిర్మించుకొని ప్రపంచమునకు మార్గదర్శకులవుదురుగాక.

# మహాత్మా! భారతోద్ధారకా!

శ్రీ గురజాడ రాఘవశర్మ

కదలిన తీర్థమై పాదలు నీపదములఁ బూలఁ బూజింపఁగా బుద్ధిపుట్టు
అమృతమ్ముఁ జిందించు విమలమౌ నీవాక్కు పరగ రాతిగుండె గరఁగఁజేయుఁ
గడుసుమాంత్రికురీతి వడలు నీదృక్కులో లీనమౌ నెంతటివాని మనసు
మోహనమగు నీదు మూర్తిసన్నిధి నెంత శక్తిగలాఁడును స్తబ్ధుఁడగును
ఇట్టి తేజోనిధానమౌ నట్టి నిన్నుఁ – దేరిపాఱఁగఁ జూడఁగలారె యెందు?
నీకతమ్మునఁ బేర్గన నేర్చెఁగాక – కర్చన యొకఁడు, విధిచేష్ట గడవఁగలదె?

పాపభూయిష్ఠప్రపంచమ్మునం దింక మనుటెల్లఁ బాపమ్ము గొనుట యొండె
కాలమ్మునకు నెంత ఘనుఁడైనఁ దాకట్టుపడకతప్పదు ధర్మబద్ధముగను
శ్రమ యెంతబడ్డ నీజాతి గుర్తింపదే విలువ గుర్తింతురా వెనుకజనము
లోకకల్యాణార్థమై కష్టపడు మహాపురుషనిర్యాణ మీకరణినగద
అనుచు జను లాడుకొనఁగల్గె నంతెకాని – నీవు నిక్కముగా చనిపోవలేదు
జగతిలోన విద్యుద్దీప్తిచందమునను వ్యాప్తిజెందితి కీర్తికాయమ్ముతోడ
యుగయుగమ్ముల శ్రీపురుషోత్తముఁడవు.

వసివాడలే దింక స్వాతంత్ర్యవిజయోత్సవారంభనవపుష్పతోరణమ్ము;
ఆరిపోలే దింక నూహూర వెల్గిన స్వాతంత్ర్యమంగళాభంగదీప్తి;
మరపురాలే దింక పురుషార్థపారిజాతక్షితిజాతోత్థత్యాగబుద్ధి;
సమసిపోలే దింక సల్పిన సత్యనిష్ఠాబద్ధమౌ నహింసావ్రతమ్ము;
ఈయలే దింక విడదీసి యెవరివారి – రాజ్యములు పంచి శ్రీరామరాజ్యముగను;
ఔర! ఫలభుక్తి మాకెల్ల నూఱవిడచి – చల్లగా జారినా వనాసక్తియోగి!

ఇతఁడె హరుఁడు నిన్ను హరియింపఁగ, వే, లయకారుఁడై, మహా
ద్ధతిమెయిఁ బ్రచ్ఛ జేసెను, పదంపడి తా నొనరింపఁబోవు దు
ష్కృతికి క్షమించుమన్నటుల గేలు మొగిడ్చి నమస్కరించెఁ; గా
కితరు డొకండు నిన్ను స్పృశియించునె? యింత తెగింపనేర్చునే?

మదనుఁ డొకండు నిన్ను బరిమార్పఁగ వచ్చిన వాఁడు సైచి, నీ
మృదుకృప వానిపైఁ జిలుకరించితి వీ తెగుదారి నేతకున్;
వదిమది నిల్పి, కేల్మొగిచినాఁడవు రామ! హరే! యటంచు, నో
ర్వఁదరముగాని వీని యపరాధము నెమ్మది బెట్ట వింతయున్!

జా గది యేలనయ్య! కడసారి హరిన్ స్మరియింపు మన్నటుల్
జాగును గూర్చి హెచ్చరిక సల్పుచు, సాగిలి మ్రొక్కి, భక్తిచే
మూగిన వందలాదిగ సమూహము వెల్వడి, తాతలంపు గ
ట్టిగఁగ జేసికోఁగలిగె నీతఁడు; నే మనువార మక్కటా!

"నే నొనరించు కార్య మవనిన్ గలదేని యతండె నిల్పు; లే
దా, నను గొంచుబోవును; విధాతృని చెయ్దు మెఱుంగఁజాల; మ
జ్ఞానముగాక మీఱి లెడు కావలికోటలు గట్టిపెట్టినన్
మానునె మిత్తి రాక; నను మన్పఁగ మాపఁగ నేర్చు దైవమే.

ప్రాణము లుండుదాక, హరి రామ హరే రఘురామ యంచిలన్
మానుగ మీ రహర్నిశలు మానక సంస్మరియింపు డొప్పు నా
ప్రాణములందు గల్గు ననురక్తిబలమ్మునఁ జేసి, ప్రార్థనా
స్థానము, రాఘవస్మృతినిధానము కత్తులబోను సేతురే?

కర్తయు, భర్త, యింక లయకర్తయు నా రఘురాము నామసం
కీర్తన చేయుచుంట దనువు కేవలమున్ దృజియింప నెంచితిన్;
కర్తృ తఁబూననేల నెటు కావలెనో కద యీశ్వరేచ్ఛ? సం
హర్తను జిన్నబుచ్చఁ గలనయ్య, తనంతట వచ్చి పిల్వఁగా?

మేన జనించు మృత్యువు, నిమేషము దన్నడబాయకుండు, నె
వ్వానిని లెక్కసేయదు, కృపారహిత మ్మది, యంత్యకాలము
దైనను శ్రీహరిస్మరణ యాగక సేయుట బుద్ధి; యీ పరి
జ్ఞానము గల్గువాఁ డొదుగఁగల్గునె, దుష్కరితకాళికిన్?

నిత్యమె యీ శరీర మది? నిత్యము శాశ్వతమైన యాత్మయే
సత్య మటంచు లో నెఱుఁగఁజాలినవానికి సర్వకాలమున్
మృత్యుభయమ్ము లే; దిఁక భ్రమియించఁగఁ జూతు రిదేల? పూర్వమె
ష్టో త్యజియించి భ్రాంతితనువున్ బదిలం బొనరించితిన్ మదిన్."

అను నీ పల్కిన వేదవాక్యములె సత్యంబాయె; నీ భారతా
వనికిన్ నీవు స్వరాజ్య మీకరణి సంపాదించుటల్ వింతయే!
జని సాఫల్యము నొందగా ధర నహింసాధర్మమున్ నిల్పు నీ
కణుమాత్రంబగుఁ గాదె యియ్యది మహాత్మా! భారతోద్ధారకా!

చరితార్థంబగు నీదు పుట్టువు, అహింసాసత్యధర్మస్థిరా
చరణం జూపితి వద్దుజాడలఁ; బ్రపంచమ్మున్ బ్రవర్తింపఁగాఁ
దరియించున్; భవదీయజన్మ దగు కర్తవ్యమ్ముఁ బాలించిత
య్య! రహస్యం బిదె! నిల్చు నీదు యశ మిం కాచంద్రతారార్కమున్!

అఘము హరించి, అజ్ఞత రయమ్మునఁ బాప నిజాభిధేయమున్
లఘువుగ సంస్మరించు ప్రజలన్ దరికేర్చెడి వేల్పొసంగుతన్
రఘుపతి, రాఘవా! యని నిరంతరమున్ దను బాడికొన్న మా
నఘునన కాత్మశాంతి భువనమ్ముల నింటను నింట వెల్గుచున్!

---

# గాంధీమహాత్ముఁడు

శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్య

మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ అని ఆయన గారి పూర్తిపేరు. దేశాచారమునుబట్టి మొదటి పేరు తనదియు, రెండవది తండ్రిగారిదియు, మూడవది ఇంటిపేరున్ను అయియున్నవి. గాంధీ అనగా చిల్లరకొట్టు వర్తకుడు. బజాజ్ అంటే బట్టల వర్తకుడు. అటువంటి ఘూర్జర దేశస్థుడు చివరకు గాంధీమహాత్ముడై, మరణ విధానముచేతను, జీవితచరిత్రచేతను అమరపురుషుడై అవతారమూర్తులలోనైతేనేమి, చిరంజీవులలోనైతేనేమి పదవ వ్యక్తిగ పరిగణింపబడి, పూర్ణపురుషుని ఆదర్శమునకు అత్యంతసన్నిహితులైరి.

పుట్టుపూర్వోత్తరములతో మనకు సంబంధము లేదు. ఋషులయొక్కయు, నదులయొక్కయు జన్మ లెట్టులున్నను, వారి మహత్త్వమునకు ఎట్టి కళంకము నుండజాలదని మన పూర్వులు చెప్పియున్నారు. జన్మ అగర్భశ్రీమంతునిదైనను, జీవితము దరిద్ర నారాయణుల సేవయందే గడపుట సంభవించినది. లక్షలరూపాయలు చేతులగుండ రాకపోకలు జరుపుచున్నను, తనది అన్న వస్తువు ఒక్కటైనను ఆయనది లేదు. గిన్నె, చెంబు, కర్ర, రాటము, ఘడియారము, కళ్ళద్దములు, చెప్పులు, టోపీ—ఇవి ఆస్తిగ పరిగణింపబడజాలవు. ఇవి అవయవములతోబాటు నేత్రములకు ప్రతినేత్రములు, పాదములకు ప్రతిపాదములు, హస్తములకు ప్రతిహస్తములు, శిరస్సునకు ప్రతిశిరస్సుగనే భావింపబడవలసి యున్నవి. ఒకరి కళ్లజోడు ఇంకొకరికి వినియోగించవు. ఒకరి పాదరక్షలు ఇంకొకరికి పట్టవు. కావున ఇవి ఎవరివి వారికి ప్రత్యవయవములు. ఆస్తి కాజాలవు. మానవశరీరము దహింపుపొందిన పిమ్మట ఇవి ఆశరీరమునకు భౌతికచిహ్నములుగ పరిణమించును.

ప్రపంచములో మహనీయు లనియు, మహాత్ము లనియు, అవతారమూర్తు లనియు, ప్రవక్త లనియు పిలువబడువారి మహత్త్వ పూర్వజన్మసంస్కారఫలితమా, లేక స్వోపార్జితసంపాదనయా అన్న ప్రశ్నకు ఉత్తరము చెప్పగలవారు లేరు. పునర్జన్మసిద్ధాంతమును గూర్చి, ప్రపంచములోని క్లిష్టసమస్యలను తీర్చుటకును, కష్టములను తరించుటకును అనుకూలమైన సమాధానము, సాధనము అని ఎన్నవచ్చును. ఇక్కడ కూడ మాహాత్మ్యముయొక్క పుట్టుకమూలకారణములతో మనకు నిమిత్తము లేదు. కాని మాహాత్మ్యము ఎట్టిదో తెలియగోరుట సహజము. లోకములో రాగద్వేషములు మానవులకు స్వభావసిద్ధములు. 'వీత రాగభయక్రోధః' అనదగినవారే మహాత్ములు; స్థితప్రజ్ఞులు. ఆశ, భయము—ఈ రెంటిని జయింపదగిన వ్యక్తి ప్రకృతిని జయించిన మహాత్ముడు. ఆశయొక్క రూపాంతరమే భయము. ప్రాణముమీద ఆశ లేనివానికి ప్రాణము పోవునను భయ మెక్కడ? ఆస్తిమీద ఆశ లేనివానికి ఆస్తి రాలేదనికాని, రాదనికాని, పోయినదనికాని దుఃఖము-భయము ఎట్లు కలుగగలవు? కావున ఆస్తి ఎట్టిదో, రాగద్వేషములును అట్టివే. కాబట్టి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు పరితుని దశలు—అంతర్దశలుగాని వివిధములగు దుర్గుణములు గావు. ఈ యరిషడ్వర్గములు వర్గములును కావు; షట్ (ఆరున్నూ) కావు. ఇవి ప్రకృతియొక్క రూపములు-రూపాంతరములు. వీని విరోధులు బ్రహ్మచర్యము, అపరిగ్రహము, అస్తేయము. గాంధీమహాత్ముని వివాహము బాల్యమందు జరిగినను, యౌవనమందే, ౩౭ వ ఏట బ్రహ్మచర్యవ్రతమును పూని, ౭౯ వరకు అవిచ్ఛిన్నముగ జరుపుకొనెను. అగర్భ శ్రీమంతుడైనను దారిద్ర్యమును, త్యాగమును పూని, అపరిగ్రహమును

అవలంబించెను. ఏ భోజనమున కా భోజనమే ఏర్పరచుకొని, సాయంత్రమునకు దాచిపెట్టుకొనుట దొంగతనము (స్తేయము)గ నెంచి అస్తేయవ్రతమును పూనెను. ఇట్లు నాలుగు ఆశ్రమములను ఏకకాలమందు జరిపి, వివాహితుడైనను బ్రహ్మచారిగా నుండి, భార్యాభర్తలు ఉభయులు వానప్రస్థులై, చిల్లిగవ్వఅంత స్వంత ఆస్తిని పొందక సర్వసంగపరిత్యాగి అయిన సన్యాసమును పుచ్చుకొని, స్థితప్రజ్ఞుడై, లోకములోని చెడుగులను సంస్కరించి, తన జీవితమును చాలించెను ఇంటిలో బిడ్డ ఎదుగుతూ ఉన్నను, బలుస్తూ ఉన్నను, చిక్కుతూ ఉన్నను తల్లిదండ్రులకును, సన్నిహితులకును తెలియదు. అట్లే దేశమంతయు స్వమతము, స్వసభ్యత, స్వభాష మున్నగునవి కోల్పోయి, ఆంగ్లమానసపుత్రులగుట ౧౯౧౫ లో దక్షిణాఫ్రికానుండి స్వదేశము వచ్చినపిమ్మట గాంధీమహాత్మునికి తట్టినట్లు ఇచ్చటి పెద్దలకు తట్టదయ్యె. దీని కారణము ఏమి యని యోచించి, అంతయు స్వయంకృతాపరాధముగ నెంచుచు, ప్రతిక్రియనుగూర్చి చింతింపగా, అసహాయోగముతప్ప మార్గాంతరము గానిపింపదయ్యెను. ౧౮౫౭ సంవత్సరపు తిరుగుబాటులో బ్రిటిషువారిక్కి జయము చేకూరినపిమ్మట వారు కోటలను పెంచక, సేనను పెంపొందింపక, మందుగుండుసామానులను వృద్ధి చేయక మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరములందు విశ్వవిద్యాలయములను స్థాపించి, ఈ నూతనసర్గములందు తయారయిన విశ్వవిద్యాలయస్నాతకులను సిపాయీలుగ చేసి, తమయొక్క సారస్వతమునే మందుగుండు సామానుగ నుపయోగించి, వీనిద్వారా అదివరకు దేశమును మాత్రమే జయించిన ఆంగ్లులు భారతీయుల హృదయములను, మనస్సును, భావములను స్వాధీనపఱచుకొని, ఆంగ్లసామ్రాజ్యమును చిరస్థాయిగ నుంచు పునాదులను వేసి, అందుపై సర్వాంగశోభితమగు సామ్రాజ్య భవనమును నిర్మించి, వారి చదువు, వారి భాష, వారి సారస్వతము, వారి సేవ, వారి జీతములు, వారి పించన్లు, వారి బిరుదులు మహాభాగ్యముగ నెంచుకొని, దేశములోని వివిధవర్ణములవారును ఒకరితో నొకరు పోటీపడి, పరవిద్యలలో తులతూగుచు, హిందువులకు ప్రతిగ మహమ్మదీయులును, బ్రాహ్మణులకు ప్రతిగ బ్రాహ్మణేతరులును, హిందూమహమ్మదీయులకు ప్రతిగ శిక్కులును, సైదులకు ప్రతిగ కాయస్థులును, కాయస్థులకు ప్రతిగ రాజపుత్ర క్షత్రియులును, క్షత్రియులకు ప్రతిగ జాట్లును, జాట్లకు ప్రతిగ ఘూర్ఖాలును పరస్పరవైషమ్యములను పెంచుకొనుచుండిరి.

గాంధీమహాత్ముని దూరదృష్టి, ఆత్మవిశ్వాసము కలిసి నూతనపంథను కనిపెట్టగలిగెను. ఈమహోద్యమము యొక్క ప్రమేయము క్రమక్రమముగ పెరిగి, జీవితము యొక్క పలుముఖములను ఆవరించుచు, అన్నితరగతులవారికిని కాంగ్రెసుసంఘముపై విశ్వాసము కలుగసాగెను. ధర్మభంగమును గాంచు అస్పృశ్యతానివారణ ఉన్నతజాతులు అనుకొను హిందువులకును ముఖ్యముగ పాలేళ్లచే చాకిరి వ్యవసాయము చేయించుకొనగోరు భూస్వాములకును విషతుల్యమయ్యెను. విద్యార్థులకు పాఠశాలావిసర్జనయు న్యాయవాదులకు వృత్తివిసర్జనయు, శాసనసభ్యులకు ఉద్యోగవిసర్జనయు లోకజ్ఞానవిరుద్ధములుగ గనిపించెను. తాడి, ఈత, కొబ్బరిచెట్ల నరుకుడు కల్లువ్యాపారస్థులకును, తదాశ్రితులకును ఆత్మహత్య అనిపించెను. వర్తకులకు విదేశవ్యాపారబహిష్కారము అర్థరహితముగ తోచెను. అడుగడుగునకు ఎదుర్కొను ఇట్టి అవరోధములను తరించిన గాంధీమహాత్ముని ధైర్యస్థైర్యములు సత్యాహింసలయెడల వారికి గల భక్తిప్రపత్తులు గాక మరి ఎట్లు జనింపగలైను?

గాంధీమహాత్ముని సత్యాగ్రహోద్యమము సోపానక్రమాగతముగ వర్ధిల్లిన విషయము లోకవిదితము. ౧౯౨౦ వ సం.న ఆయనవయస్సు ౫౦ సం. లు అయినప్పుడు మొదటి సత్యాగ్రహయత్నమును అయిష్టముగనే వారు పూనిరి. ఫలితము శూన్యముగ గనిపించెను. పునాదులలో వేసిన ఇటుకలు సున్నము పైకి రాణించునా? ౧౯౩౦ వ సం.న వారి వయస్సు ౬౦ సం. లు అయియున్నపుడు ఉప్పుసత్యాగ్రహము పూని, స్వరాజ్యభవనము యొక్క గోడలను లేవదీసిరి. ౧౯౪౦ వ సం.న ౭౦ ఏండ్ల వయస్సులోనున్నపుడు, యుద్ధసందర్భమున 3వ సత్యాగ్రహమును ప్రారంభించి ౧౯౪౨–౪౫ వరకు జరిగిన పోరాటముద్వారా స్వరాజ్యప్రాప్తికి సాధనములను గల్పించిరి. సత్యాగ్రహమునకు లాభాలాభములు లేవు.

జయాపజయములు లేవు. సుఖదుఃఖములు లేవు. ఎంత వరకు జరిగిన అంతవఱకే జయప్రాప్తి నందును. జయాపజయములు సాపేక్షములుగాని స్వతస్సిద్ధములు గావు. జయమన్నది అపజయపరంపరల పరిపక్వము. అపజయమన్నది జయసౌధముయొక్క సోపానము.

గాంధీమహాత్ముని ఉద్యమము ప్రజాసామాన్యముయొక్క సానుభూతిమీదను, తమ సిద్ధాంతముయొక్క అమోఘత్వముమీదను ఆధారపడియుండెను. ఆంగ్ల రాజ్యము స్టేటుసెక్రెటరీగారి ఉత్తరువులను గ్రామ గ్రామాలకు రెండుగంటలలో జారీచేయగలుగు ఏర్పాటు మీఁద ఆధారపడియున్న సంగతి గమనించి, కాంగ్రెసు నిర్మాణమునుకూడ గ్రామములనుండి మన 'సెక్రెటరీ ఆఫ్ స్టేట్'అగు గాంధీమహాత్మునివరకు కాంగ్రెసు యొక్క సంస్థలద్వారా కట్టుదిట్టముగ చేయుటవలన ఈ మహనీయుడు సృష్టికి ప్రతిసృష్టిగావించి, రవి యస్తమింపని ఆంగ్లరాజ్యమును పరాజితముగ జేయగల్గెను. గాంధీమహాత్మునికంటె ఎక్కువ బుద్ధిమంతులు, మేధావులు, వక్తలు, గ్రంథకర్తలు, యుక్తిపరులు లేకపోలేదు. కాని ఈ గుణపుంజములన్నియు గలిసిన మహారాశియై, సత్యాహింస లనెడి చుక్కానిగలిగిన జీవితయాత్ర యను సముద్రముపై జాతీయత యను ఓడను జయప్రదముగ నడిపించి గమ్యస్థానమును పొందింపగల్గెను. ఓడ రేవు చేరినతరువాత నావికుని కర్తవ్య మేమో ఈయన గుర్తింపగల్గుట సంస్తవనీయమేగదా! స్వభావసిద్ధమే గదా! వెంటనే యీ నావను తిరిగి సప్తసముద్రాలపై యానము చేయించక పూర్వము నావలోని బాటసార్లు పరస్పరమైత్రితో మెలగకరా? లేనిచో వైమనస్యము లెట్లు సంభవించెను? వాటి నివారణమార్గము లెట్టివి? అందులకై ఇంక తాను చేయవలసిన త్యాగము లున్నవా? అను పరిశోధనలలో నిమగ్నుడై హిందూ మహమ్మదీయఐక్యతను సమకూర్చి ఘనీభవింపజేయు నుద్దేశముతో నవాఖాలీ కేగి, పాట్నా యరిగి, ఢిల్లీ కేతెంచి, ఏ ఐక్యతకొఱకు ౧౯౨౦లో అసహాయోద్యమము నారంభించెనో, పూర్తిగ నెరవేరని ఆ ఫలితము కొఱకే జీవితయాత్రను ఒక తోడిమతస్థుని చేతిలో దేశమునకును, ప్రకృతికిని అర్పించెను. ౩౦ వ జనవరినాడు బిర్లాపార్కునందు వారి శరీరమునుండి ప్రవహించిన రక్తముచే పోషితమై, సర్వమతైక్యత లను బీజములు మొక్కలై పెరిగి పెంపొంది పూవులు పూచి, కాయలు కాచి, పండ్లు పండి ఆసేతుహిమాచలపర్యంతము నీడనిచ్చి ద్వారకనుండి ప్రాగ్జ్యోతిషపురమువఱకు సుఖదాయకమై భారతవర్షమును తోడిజాతులవారి సరసన అగ్రస్థానము వహింపజేయుగాక!

గాంధీమహాత్ముడు పూర్ణపురుషు డని ఒకానొకప్పుడు (౧౯౩౯లో) నేను వర్ణించినపుడు "అవతారమూర్తి యంటే అందువుగాని, పూర్ణపురుషు డని చెప్పరాదు" అని నన్ను ఆయన మందలించెను. అవును, నిజమే. ఉపనిషద్వాక్యము నందలి పూర్ణపురుషుని వర్ణననుబట్టి నావాతకంటె ఆయనవిమర్శనయే సత్యముగ తోచుచున్నది.

పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్పూర్ణ ముదచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణ మేవావశిష్యతే.

ఇంక అవతారమూర్తి యనెదమా? ఆక్షేపణ ఏముండగలదు? ఆదిని జీవము జలమునందు పుట్టిన మత్స్యమై, జలస్థలములందు నివసించు కూర్మముగ మారి, స్థలవాసి యగు వరాహరూపమున, ఇంకను పూర్వవాసనలు వదలలేక 'పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా' యను కవివాక్యమునకు ఆధారభూతమై, అరణ్యరాజయిన నారసింహమై, మానవసృష్ట్యాదియగు వామనరూపమును దాల్చి, ఖడ్గప్రయోగముచే క్షాత్రవంశమును సంహరించిన పరశురాముడై, దుష్టమూర్తియగు రావణుని సంహతుని గావించిన శ్రీరాముడుగ మారి, శివహత్యను త్యజించి, భూగర్భమునుండి ఆహారపదార్థములను జనింపజేయు బలరాముడై, భూతదయను బోధించిన బౌద్ధావతారమై, చివరకు అహింసాసత్యములను ప్రపంచమున కెల్ల పాదరక్షలుగను, ఛత్రములుగను నుపకరింపజేసిన కల్కియని యూహింపదగిన గాంధీమహాత్ముని అవతారపురుషునిగ భావించుటలో ఆశ్చర్య మేమి? అహింస ఆయనయొక్క అస్త్రశస్త్రములలో డాలుగను, సత్యము కత్తిగను పరిణమించిన దనుటలో అతిశయోక్తి ఏముండగలదు? 'నేను' అన్న కేంద్రమునుండి 'మమ' యను

కైవారము గల సంకుచితచక్రములో సంచరించు మానవకోటిమధ్య అహంకార, మమత్వములను త్యజించిన పురుషుడు మహాత్ముడు కాకున్న మరి యెవ్వరు మహాత్ములు కాగలరు? ఆనాడు భీష్ములు ధర్మరాజుకు బోధించిన నిత్యోపవాసము, నిత్యబ్రహ్మచర్యము, నిత్య అతిథ్యము ఎక్కడ? గాంధీమహాత్ముడు 36 వ ఏటినుంచి అవలంబించిన ఘోరబ్రహ్మచర్యము: ఘోరతరఉపవాసము, ఘోరతమ ఆత్మసమర్పణ ఎక్కడ?

ఒకానొకనాడు భీష్ముని వాక్యములు ప్రసంగవశమున నేను ఆయనకు వినిపించినపుడు 'చూడు' అని ఏవగింపుతో ఆయన బదులుచెప్పగా "మీకు ఏవగింపు అయితే కావచ్చును. మాకు ఆదర్శమే" అంటిని. గాంధీమహాత్ముని సత్యవ్రతనిర్వచనము ననుసరించి మరియొకరు మన పేరట వ్రాసిన లేఖను తిరిగి వారు తీసుకొనదలచినపుడు ఆ లేఖయొక్క ప్రతిని మనవద్ద నుంచుకొని మూలము నిచ్చుట అసత్యము. అహింసయొక్క నిర్వచనము చేయునపుడు మనోవాక్కాయకర్మలందు హింసను వర్జించుట సర్వవిధహింసాతుల్యమే! లక్షల మధ్య అపరిగ్రహము, యువతుల మధ్య బ్రహ్మచర్యము, శత్రువుల మధ్య అహింస, అధికారము మధ్య ప్రాయోపవేశము బూనుట సామాన్యపురుష లక్షణములు గావు. సామాన్యులకు సాధ్యమును గావు. ఇట్టి ప్రశంసలు జరుగునపుడే గర్వభావముతో "అందుకనే నేను మహాత్ముడ నయినది" అని ఆత్మస్తుతితో పరిహాసము గావించగలిగిన మహనీయుడు గాంధీ. కోపము నుచాలించి, దుఃఖముగ పరిణమింపజేయదగిన స్పష్టీకర్త. సర్వజనారాధనమధ్య వినయము బూని, తా నెంత అల్పుడనో యని ఆత్మసంస్కరణకొఱకై యత్నించు వివేకి. వీతరాగభయక్రోధుడై ప్రవర్తింపగలిగిన స్థితప్రజ్ఞుడు.

ప్రజహాతి యదా కామాన్
సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః
స్థితప్రజ్ఞస్తదోచ్యతే.
దుఃఖేష్వనుద్విగ్నమనాః
సుఖేషు విగతస్పృహః
వీతరాగభయక్రోధః
స్థితధీర్మునిరుచ్యతే.
యస్సర్వత్రానభిస్నేహః
తత్తత్ప్రాప్య శుభాశుభం
నాభినందతి న ద్వేష్టి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

ఇట్టివారికి మృత్యు వెట్లు సంభవింపగలదు?



# సౌందర్య దేవత



ఫ్రాన్సుదేశ ప్ర రాజుల ఆస్థానములలో వగలాడితనము చాలా ఎక్కువగా నుండేది. దీనికి పమిటచెంగులు, ఈకలు, విసనకఱ్ఱలు, ప్రధానసాధనములుగా నుండేవి. కాని చిట్టచివరకు వీటన్నిటికి పరిపూర్ణత నొసగినది పరిమళద్రవ్యముల వశీకరణ శక్తియే. ఈ పరిమళద్రవ్యముల అద్భుతవశీకరణశక్తి పూర్వకాలమున్నదానికంటె ఏమియు తగ్గిపోలేదు. మీ సాంప్రదాయకపు రుచులననుసరించి, నిర్వాణ్ ను వాడినచో మీరుకూడా పురాతనదినములలోని అద్భుత వశీకరణశక్తిని పొందగలరు.

## నిర్వాణ్

పరిమళద్రవ్యము & ఓడికొలోన్

ది టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్.



# TINY DROPS OF WATER

*make the mighty*

# RIVERS FLOW

...చిన్న చిన్న జలకణములు చేరి మహానదులై మన మాతృభూమిని ప్రవహించి మనకు నీటిని, ఆహారమును, సర్వసౌఖ్యములను ప్రసాదించుచున్నవి.

ఇదేవిధమున ప్రతివ్యక్తియు తన జీవితముపైన చేయు భీమా ఎంత కొద్దిదైనను మన జీవితాభ్యుదయమునకు దోహదమిచ్చు మహోన్నత భీమా కంపెనీలను నిర్మించుచున్నది.

ఇరువది సంవత్సరముల క్రితము పట్టాదార్ల చేతనే స్థాపింపబడి నెం. 10, మౌంట్ రోడు మదరాసు నందు హెడ్డాఫీసు కలిగియున్న **ఇండియన్ మ్యూచువల్ లైఫ్ అస్సోసియేషన్ లిమిటెడ్.,** నిరంతరాభివృద్ధినందుచు జీవిత భీమాయందలి ఉత్తమ ప్రయోజనములనన్నిటిని, అనగా **రక్షణ - భద్రత - సేవ - స్వపరిపాలన**-లను ఇచ్చుచున్నది.

మద్రాసులోనే హెడ్డాఫీసు కల **ఇండియన్ మ్యూచువల్ జనరల్ ఇన్స్యూరెన్సు సొసైటీ లిమిటెడ్** కూడ ఇదే విధముగ స్వపరిపాలితమైన సంస్థ. మోటారు, ప్రమాదములు, అగ్ని శాఖలలో మీకు భీమా రక్షణ మిచ్చుచున్నది. వీటినిగురించి మీరు ఎక్కువ వివరములు తెలిసికొనుట ప్రయోజనకరము.

వివరములకు వ్రాయగోరెదము :

# INDIAN MUTUAL

**LIFE ASSOCIATION LTD., &**

**GENERAL INSURANCE SOCIETY LTD....**

10, MOUNT ROAD... MADRAS...

FAS-I-4




## క్రొత్తసంవత్సరం

విశేషావకాశములను
సమకూర్చి జీవితమున కత్యంత
శుభప్రదమగు గాక.

**అల్లయిడ్ ఇండస్ట్రియల్ డిస్ట్రిబ్యూటర్సు లి॥**
120, ఆర్మీనియన్ వీధి, మదరాసు.

సోల్ సెల్లింగ్ ఏజంట్లు:

**మెట్టూర్ కెమికల్ & ఇండస్ట్రియల్ కార్పొరేషన్ లిమిటెడ్.**
మెట్టూర్ డాం, సేలం.

---

Tel: "Presundry" Madras

# కే. ఆర్. అండ్ కంపెనీ,

## 40, చిన్నతంబి వీధి, మదరాసు.

ప్రింటింగ్ యింకులు, ప్రింటింగు మెషినులు,
ఇతర ప్రింటింగు సామానులకు డైరెక్టు ఇంపోర్టర్లు.

చాండ్లర్ అండ్ ప్రైస్ మాదిరి అమెరికన్ (బాండు కొత్త కాపీ) ఫోలియో ట్రెడిల్సు కావలసినవారు మాకు వ్రాసినచో సప్లయి చేయగలము. అమెరికాలో షిప్‌మెంటుకు సిద్ధముగా నున్నవి. మాకు దిగుమతి లైసెన్సు కూడ కలదు.

దిగువవారికి సోల్ ఏజంట్లు:

## మెసర్సు. సామ్యుల్ జోన్సు అండ్ కంపెనీ,

## (ఎక్సుపోర్టు) లిమిటెడ్, లండన్.

నాణ్యమైన ఆర్టు పేపరు, గం పేపరు, టేపులు తయారు చేయువారు.
అన్ని రకముల కాగితముల ఎగుమతి దారులు.

# వ్యావహారికభాష - మంచిచెడ్డలు




శ్రీ గంకిపాటి కృష్ణమూర్తి

ఇప్పటికి ౪౦ సంవత్సరములనుండి తెలుగుదేశములో గ్రామ్యభాషావాదము బయలుదేరి చెలరేగుచున్నది. ఆ ఫలములను ఇప్పు డనుభవించుచున్నాము గనుక, ఇప్పు డొకసారి వెనుకకు చూచి మన సారస్వతము దీనివలన ఎంత అభివృద్ధిలోనికి వచ్చినదో చూచిన మంచిది.

గ్రామ్యభాష అను మాటయే బాగుండలేదు. అంతకంటె నాగరికభాష అని వ్యవహరించుట మంచిది. వారు నాగరికులు అని గొప్పగా చెప్పుకొనుదురు గాని వారు గ్రామ్యులు అని ఎవరును గొప్పలు చెప్పరు. కాబట్టి భాషకు మంచి పే రిచ్చిన మనకు గౌరవ మెక్కువ. గ్రామ్యశబ్దముతో బాటు 'వ్యావహారిక'శబ్దమును కొందఱు ప్రయోగించుచున్నారు. వ్యవహారమునందు సాధువు, వ్యవహారమును చేయుచున్నాడు అను అర్థములలో ఠక్ ప్రత్యయము వచ్చి వ్యావహారిక శబ్ద మగుచున్నది.

వ్యవహారమునందు సాధువైనది వ్యావహారిక భాష. వ్యవహార మనేకవిధములు. వ్యాపారము కావచ్చును, కోర్టు వ్యవహారము కావచ్చును, శాస్త్రీయమైన వ్యవహారము కావచ్చును. వ్యాపారమునకు, సాహిత్యమునకు ఎల్లప్పుడును సగ మెఱుక యే. కోర్టు వ్యవహారములలో, ప్లయింటుస్టేటుమెంట్లలో వ్రాయు భాష సాహిత్యగ్రంథములలో ఇఱికించిన అది ఎవరికిని అర్థము కాకుండ పోగలదు. శాస్త్రీయ వ్యవహారములలో ప్రయోగించు భాష చాలామందికి తలబరువుగా నుండును.

ఈ బాధ లన్నియును పడలేక ఈ మధ్యకాలములో వ్యావహారికభాష అని ఒకటి పెట్టి మనము మాట్లాడు పద్ధతినే వ్రాయవలె నను వాదమును చెప్పుచున్నారు. వ్రాయుచుండిరి కూడ. ఇవి చూచి సంతోషించుచున్నవా రున్నారు. ఎవరు మాట్లాడే పద్ధతిని అవలంబించి వ్రాయవలెను అనే విషయము చాలా మందిని కలవరపెట్టుచున్నది. తెలుగుదేశములో అనేకవిధములైన తెలుగుభాష ఉన్నది. తెలింగాణా వారి మాటలు సగ మర్థము కావు. రాయలసీమవారు తమ తెలుగే బాగుగా నుండునని ఎప్పుడూ మిగిలిన జిల్లాల వారిని ఆక్షేపించుచుండురు. కృష్ణా గుంటూరు గోదావరి వాళ్లకు తమ తెలుగే అందమైనదని అహంకారము. వేదములోవలె స్వరము మన తెలుగులో లేదు గాని, ఉన్నట్లైన తూర్పువారి దీర్ఘములు, రాయలసీమవారి మూలుగులు, తెలింగాణావారి యాసలు వ్రాతలో కూడా చూపించుటకు వీలయ్యెడిది.

జిల్లా కొక భాష, ఆ భాషలో స్థానికమైన మార్పులు, స్వరములు ఉండుటయేగాక ఒకజిల్లాలో వారందఱూ ఒకే తీరుగా మాట్లాడుట లేదు. 'అ డెళ్లేడు' అనేవారిదగ్గఱనుండి 'వాఁడు వెళ్లెను' అని అఱసున్నలతో గూడ పలికేవారిదాకా ఉన్నారు. ఏరకము వారికి ఆరకము భాష ఉన్నది. మఱి వీనిలో, వ్రాయుట కే భాష నవలంబించవలెను? కొన్ని సంవత్సరములక్రిందట ఉన్న వ్యావహారికభాషావాదులు శిష్టవ్యవహారములో ఉన్న భాషనే అవలంబించవలె నని చెప్పిరి. వెనుకటితరములోని శిష్టులను తీసికొనిన, 'నే నిషు పెడచాను, ఉంచాను' అని వ్రాయవలసివచ్చేది. ఈకాలపు వ్యావహారికభాషావాదులలో శిష్టప్రయోగము నవలంబించవలెనని చెప్పువా రున్నారా? నాకు నమ్మకము లేదు. ఇప్పుడు ఫలానావారు శిష్టులు అని చెప్పుటకు

సాధ్యమగునా? ఇది ఎవరైన అంగీకరించెడి విషయమేనా? ఇప్పు డందఱును విశిష్టులే. వెనుకటి తరములోని వ్యావహారిక భాషా వాదులకు ఈ ఇబ్బంది లేకున్నది. అందుచే వారు ధైర్యముగా శిష్టవ్యవహారమని చెప్పుటకు వీలొచ్చినది. ఇప్పుడు కాలము మఱింత మాఱి అందఱూ విశిష్టులై, ఎవరి భాష వారు వ్రాసుకొనుచున్నారు. శిష్టవ్యవహార మనునది అర్థములేకుండ పోయినది. అక్షరములు వ్రాయుట, చదువుట వచ్చినవారందఱును తమ తమ భాషలలో వ్రాసుకొనుచున్నారు. వందలకొలది పత్రిక లున్నవి. వాని కాహారము కావలెను. అది సరిగా నుండక పోవుటచే ఆకలి ఎక్కువై అవి భాషనే దిగ్రమింగుచున్నవి. చివరకు అంతా వెకిలి వ్యవహారభాషగా పరిణమించుచున్నది. వ్రాయగలవారిలో కూడ తాము చదివినదానిని మఱచి లోకసంగ్రహార్థము ఇట్టి వ్రాత నవలంబించినవారు గలరు.

తెలుగుభాషలో సహజముగా తెచ్చిపెట్టగలిగిన వెకిలితనమే గాకుండ, ఇప్పుడు తెలుగు పద్యములలో ఇంగ్లీషు భాషలోనుండి కొన్ని పదములను ఇఱికించి వాని వెకిలితనమును ఇనుమడింపజేయువా రున్నారు. ఉభయభాషలలోను అప్రవీణులైనవారు దీనిని పొగడుట కద్దు. కొందఱు బాగుగా సంస్కారము కలిగినవారు కూడ దీనిలో ఏదో విశేష మున్నదని చదివి ముగ్ధులై ఆహాహాకారములు చేయుచుందురు. దీనివలన తెలుగుకవిత్వము వృద్ధిచెందుచున్న దనువారితో మాటాడుట కష్టమే. ఈ 'దుబాష్ కవిత్వము' ను మెచ్చేవారిని వారి ఆనందమునకు విడచి తెలుగును తెలుగుతోనే గగ్గోలుపఱచువారిని చూచిన మంచిది.

తెలుగుభాష ఎప్పుడూ ఒక మాదిరిగా లేదు. దానిలో అప్పుడప్పుడు మార్పు గలుగుచున్నది. సరియైన వ్యాకరణము లేకుండ ప్రయోగములమీద ఆధారపడియున్న జీవద్భాష లన్నిటిలోను ఎప్పటికప్పుడు మార్పు వచ్చుచునేయుండును. ఇంగ్లీషు భాష ఎంత మాఱిపోయి ఎంత అభివృద్ధిలోనికి వచ్చినదో అందఱకూ తెలిసిన విషయమే. ఇంగ్లీషు అభివృద్ధిలోనికి వచ్చుటకు కారణము ఎవరిచ్చవచ్చినట్లు వారు వ్రాయుట గాదు; ఆ భాషలో వ్రాయువారందఱు తమ పూర్వకవులను చదివి, గ్రీకు లాటినులు చదివి, ఇతర యూరోపియన్ భాషలను చదివి వానిలో గల మంచినంతను తమ భాషలోనికి తెచ్చుకొని, ఇతర భాషలలో గల అర్థవత్తరములైన శబ్దములను తమ భాషలో చేర్చుకొని, దాని నొక అంతర్జాతీయ భాషగా చేసిరి. అది యొక సర్వ భాషాసంమిశ్రణమై అన్ని వ్యవహారములకును బహు యోగ్యముగా నున్నది. మన తెలుగుభాష వ్రాయువారుకూడ వారిని అనుసరించి ఇతర భాషలలో గల మంచినంతయు గ్రహించిన మన భాషకు మేలు. ఇతర భాషలనుండి గ్రహించమనినప్పుడు ఇంగ్లీషుమాటలను సగమునకు సగముగా తెలుగులో గుప్పవలసినదని కాదు నా భావము. మనకు సంస్కృతము ఒక పాతరవలె నున్నది. దానిలోనుండి మన మెన్నియైనను గ్రహింపవచ్చును. సంస్కృతములోనుండి గ్రహించమనినపుడు తెలుగు ద్రావిడజాతిది అని చెప్పువారు ఆగ్రహింపవచ్చును. కాని నా ఉద్దేశములో తెలుగు సంస్కృతమునుండి విభిన్నమైనది కాదు. తెలు గొక సంపూర్ణమైన భాష అని గర్వించువా రున్నారుగాని, ఏదో ఒక శృంగార కావ్యము వ్రాయదలచిన మఱియొక భాష నుండి మాటలను అప్పు తెచ్చుకొనకుండ సరిపడునేమో; శాస్త్రీయమైన విషయము వ్రాయవలెనన్న రాజకీయములు, ఆర్థికము, సైన్సులకు సంబంధించినవి వ్రాయవలెనన్న సంస్కృతమునకు పోవలసినదే.

ఇప్పుడు వ్రాయసగాండ్రు సంస్కృతమును విరివిగా ఉపయోగించుచునేయున్నారు. అదియునుగూడ తెలుగునకు వెకిలితనము తెచ్చిపెట్టునట్లు ఉపయోగించుచున్నారు. పెద్ద సంస్కృతసమాసమును ప్రయోగించి—ఇది విడదీసిన చాలవఱకు అర్థముండదు—చివర కొక తెలుగు ప్రత్యయమును చేర్చి దానికంతకును ఒక వికారమును తెచ్చిపెట్టుచున్నారు. భాషలో ఏదో కొంత మార్పు ఉండవలసినదేగాని ఇంతటి మార్పు ఉండవలెనా? గ్రాంథికభాష ఎవరును సరిగా వ్రాయలేరు గావున అందఱును గ్రామ్యమును వాడవలెనని వీరిలో కొందఱు పెద్దలు చెప్పియున్నారు. కాని నియమభంగ మొనరించినందున నియమము అనుష్ఠేయము కాదని త్రోసివేయనగునా! వడగళ్ళవానకు

వెఱగొంది, గిడుకొందరుజేరి లోకముపై పిడుగులను విడువనగునా! తెలుగువచనకావ్యములలో గట్టిగా చదవదగిన పుస్తకము కనబడుట లేదు. ప్రపంచములో గల సాహిత్యమంతయు ఇంగ్లీషు రాకపోయిన తెలుగువారికి అందుబాటులో లేదు. ఏభాషలోనైనను చక్కటి పుస్తకము అచ్చుపడినవెంటనే అది ఇంగ్లీషులోనికి తర్జుమా అగుచున్నది. తెలుగులో అట్టి ప్రయత్నమే లేదు. ఒకవేళ ఎవరైన ప్రయత్నించిన అది చదువుటకు వీలుకాకుండ వ్రాయుచున్నారు. ఈవిధముగా నుండుటకు కారణము ఎవరు మాట్లాడినట్లు వారు వ్రాయవలెనని ప్రయత్నించుటయే.

వ్రాయు భాషకు, మాట్లాడు భాషకు అన్ని దేశములలోను భేదము కన్పించుచున్నది. మనదేశము వారు ఇంగ్లీషు మాట్లాడిన, పుస్తకమునుండి చదువుచున్నట్లు మాట్లాడుదురని, సహజముగా ఇంగ్లీషు ఒకరితో నొకరు మాట్లాడుకొన్నట్లు మాట్లాడరని చెప్పుకొనుదురు. మనలోగూడ ఎవరింట వారు మాట్లాడుచున్నప్పుడు మాటను సగము మ్రింగినను రెండవవారికి అర్థమగును. అట్టి భాషను లోకము మీద పాఱవేసిన అది అందఱకు అర్థమగునా? ఇంటివద్ద మాట్లాడినట్లు బయటకు వచ్చి మాట్లాడము. వ్రాసినప్పుడు, ఏశబ్దము ఏ అర్థమునందు నిశ్చితమైనదో ఆ అర్థమునందే ప్రయోగించి చదువుచున్నవానికి భాషయందు కొంత గౌరవము కలుగునట్లు వ్రాసిన మంచిది. విషయమునుబట్టి భాష మాఱవలసి వచ్చుచుండును. పిట్టకథలు, పిల్లకథలు, పిచ్చినాటకములు వ్రాసిన శయ్యలో ఉదాత్తములైన విషయములను పఱుండబెట్టిన అది దానికి గొయ్యి అగునుగాని వేఱుగాదు. ఇప్పుడు జరుగుచున్నదదియే. మంచికిని, చెడుకును ఒకే భాషను ప్రయోగించుచున్నారు. పదికాలములపాటు, పుస్తకము నిలచియుండి, అర్థమగుచుండవలెనని యున్న, భాషయందు మన కింకను కొంచెము గౌరవ ముండవలెను.

భాష మాఱకుండ ఉండవలెననిన్, నన్నయ కాలములోవలె ఫుల్‌స్టాప్ లేకుండ దండకమువలె ఉండవలెనని నా తాత్పర్యము గాదు. భాష మాఱవలసినదే. ఇప్పు డందఱును సమగ్రమైన తెలుగు వ్యాకరణము వ్రాయవలెనని ప్రయత్నించుచున్నారు. మనభాషలో కర్మణిప్రయోగము అరుదు. ఇది తెలుగు భాషాజీవమునకు సరిపడదని తెలుగువైయాకరణుల మతము. కర్మణిప్రయోగము లేకపోవుట మన భాషకు గౌరవము తెచ్చిపెట్టదు. కొంచెమాలోచించి శాస్త్రీయమైన విషయమేదైన వ్రాయవలెననిన కర్మణిప్రయోగము చాలా ఉపకరించును. మన భాషలో లేదని మానుకొనుట మంచి పని గాదు. మన పూర్వులుగూడ భాషను మార్చుచువచ్చిరి. నిండుసున్నను సగముజేసి నిండు ప్రాణమును సగముచేసిరి. వారు మ్రింగగా మిగిలిన సగమును మనము మ్రింగి పూర్తిగా లేకుండ జేసిన కొంత బాగుండునేమో. కొన్ని మాటలలో అర్థభేదము వచ్చునుగాని ప్రకరణవశముచే దానిని తెలుసుకొనవచ్చును. 'ఱ' ను గూడ బండి ఎక్కించిన నష్టముండదేమో! సమగ్రమైన తెలుగు వ్యాకరణము వ్రాయువారు ఇవన్నియు నిర్ణయించి లోకమునకు నుపకరింతురుగాక.

ఇది విసంధియుగము. పూర్వులమీద మఱీ కోపగించి మఱీ విసంధిగా వ్రాయుచున్నారు. పూర్తిగా సంధులను విడచుటలో గుణమేమియు లేదు. రెండచ్చులు దగ్గఱ జేరినపుడు అన్ని భాషలలోను ఏదియో ఒక ఆగమము వచ్చుచున్నది. ఇంగ్లీషులో చదువునప్పుడు ei అని రెండచ్చులను కలుపుచుందురు. ఫ్రెంచిలో వ్రాయునపుడుకూడ తుగాగమము వచ్చును- a-t-on, a-t-elle· సంధి యంతయు ముఖసుఖోచ్చారణార్థమే. అసలు, సంధి ఉండకూడదని చెప్పుట లేనిపోని కష్టము తెచ్చిపెట్టుకొనుటయే. అంతా సంహితగా వ్రాసినను చదువుట కష్టమే. వాక్యమందు సంహిత వివక్షాధీన మన్నారు సంస్కృతములో; అంటే మన తెలుగువారు వాక్యాంతమందు సంహిత వివక్షాధీన మన్నారు. దండకము వ్రాసే రోజులలో ఆ అర్థము చెప్పవచ్చును గాని ఇప్పుడు కుదురదు. కొన్ని మాటలు సంధిలో విపరీతార్థద్యోతకములుగా నుండును. అట్టి స్థానములలో దానిని సంధింపక విడచిన మంచిది. సంధిలేకుండ వ్రాయవలె ననుట యెంత విరుద్ధమో అంతయును సంహితగా వ్రాయుమనుట అంత విరు

తిలో అంటుతుందనే భయం నాకు లేదు. మనలో కొంత మాలిన్యం ఉంటేతప్ప ఎదుటి మలినత్వం అంటుతుందనే భయం ఉండదు.

యు వ తి

(ఇంకా శంకిస్తూ) కాదు ప్రభూ... కాదు. ఈ దీన రాలు ఏ కులశీలములు గలవారి మన్ననకూ పాత్రురాలు కాదు. ఇక తమవంటి తపోధనుల పాదధూళిని తాకడానికైనా......

మ హ ర్షి

కల్యాణీ! నే నభయ మిస్తున్నాను. నీ ఉదంతం చెప్పు.

యు వ తి

ప్రభూ, నా సౌందర్యయౌవనాలను నాకు ప్రియతముడైన ఒక్క పురుషునికి అర్పించి బతికే అదృష్టం నాకు లేదు.

నా చర్మపు లావణ్యంకోసం, కన్నుల వెలిసౌందర్యం కోసం, పెదవుల మాధుర్యంకోసం నాచుట్టూ మూగి సువర్ణరాసులు కుమ్మరించే పురుషకిరాతకుల బారికి తాళలేక... అన్ని ఆశలను చంపుకుని అడవులవెంట పరుగెత్తుకువచ్చాను.

నా ఇహలోకయాత్ర ఎంత దుఃఖభాజన మయిపోయింది స్వామీ! (పొంగే కన్నీటిని గోటికొనతో చిమ్ముతుంది.)

(ప్రవేశం : వృద్ధవేశ్య కామమంజరి, ఇద్దరు పరిచారికలు...ఎవరినో వెదకుతూ)

కా మ మం జ రి

రాగిణీ, రాగిణీ, కన్నతల్లి అనే కనికరమైనా లేకుండా ఈ ముసలిబతుకును ఎన్ని శ్రమల పాలు చేస్తున్నావమ్మా... అబ్బా... ఈ కాళ్ళల్లో ఎన్ని ముళ్ళు! అయ్యో! అడుగుపడడం లేదు.

౧ ప రి చా రి క

అమ్మా! అదిగో మన రాగమంజరి... మహర్షి పాదాలవద్ద తల వంచుకొని నిలుచునివుంది.

కా మ

(ఆతురతతో) నాతల్లి రాగిణి కనపడ్డదా? ఏదీ ఏదీ, పదండి పదండి శ్రీవారి పాదసన్నిధికి.

(మహర్షిని సమీపించి) మహర్షిదేవా! నమస్కారం.

మ హ ర్షి

కల్యాణప్రాప్తిరస్తు. ఎవరమ్మా మీరు? ఇంత శ్రమపడి ఈ అరణ్యసీమలకు ఎందుకు వచ్చారు? పాపం! చాలా అలసిపోయినట్టు కనబడుతున్నారు.

కా మ

దేవా! ఏమి చెప్పను? ఈ ముసలితనంలో అందరివలె సుఖించే యోగం నా ముఖాన లేదు. మీవద్ద నిలిచివున్న ఆ కఠిన రాలు... ఈ అభాగ్యురాలి ఏకైక పుత్రిక...

మ హ ర్షి

ఓహో, అట్లాగా... అయితే...

కా మ

ఇక్కడికి యోజనదూరంలో వున్న చంపానగరం మా నివాసం. నేను... మహర్షులతో ఏమి మనవిచెయ్యను...

మ హ ర్షి

సరే సరే. మీరు రూపజీవికాకులానికి చెందినవారని నీ పుత్రిక మాటలబట్టి గ్రహించాను. తరువాత—

కా మ

నా పేరు కామమంజరి. నాకు ఈమె ఒక్కతే బిడ్డ. పేరు రాగమంజరి. అన్ని ఆశలూ ఈమెమీద పెట్టుకొని ఎంతో కాంక్షతో బతుకుతున్నాను.

మ హ ర్షి

సరే. ఇప్పుడేమి విరుద్ధసంఘటనం జరిగింది?

కా మ

మనవి చేస్తున్నాను.

పసిపాపటనుంచే అపురూపతతో తలదంటి మంచిగంధపు పొడిలో నలుగుపెట్టి పన్నీటితో జలకమాడించాను స్వామీ!

మ హ ర్షి

పాపం... పుత్రికాస్నేహం అంత చిక్కనిదికదా. ఆపైని...

కా మ

చంపలలో వింత కాంతి, సోగకళ్ళలో చంచలశోభా పొడచూపగానే అద్దాలమేడలో పట్టుదిండ్ల తూగుటుయ్యాలలో ఉంచి కన్నతండ్రికంటెనైనా పసిరిక చిలకలా పెంచి పెద్ద చేశాను.

మ హ ర్షి

(చిత్రమైన చూపుతో) ఊహూఁ—

కా మ

పిమ్మట నారద తుంబురులవంటివారిచేత సంగీతమూ, భరతాచార్యులవంటివారి చేత నృత్యమూ అద్వితీయంగా నేర్పించాను తండ్రీ!

మ హ ర్షి

ఔను. మాతృధర్మం పూర్తిగా నెరవేర్చావు.

కా మ

ఉత్సవసమయాల్లో రత్నాభరణా లలంకరించి నా సౌధోపరి భాగంమీద నిలిపితే స్వర్గభూమినుంచి సరిగా ఆ మేడమీదకు

రా X

అమ్మయ్యో—గురుదేవులు !! నా పిచ్చిపాటలతో ఆచార్య దేవుని తపోభంగం చేశానుగాబోలు......

మ హ ర్షి

లేదు. లేదు. నీవల్ల నాకు తపోభంగమా? (నవ్వి) పిచ్చి దానా, ఎంతమాత్రం కాదు. వచ్చిన ఆరునెలలనుంచీ తరితిప్పకుండా నావల్కలములు ఉతికి ఆరవేసి, పర్ణశాల అలికి పలుముగ్గులు తీర్చి, దినదినమూ ప్రభాతకాలానికి నా దేవార్చనకు వింతవింత పుష్పాలు అమర్చి నా ధర్మదీక్షకు నిత్యం ఎంత సహాయపడుతున్నావు! నీ సుకుమారశరీరం ఈ వనవాసక్లేశానికి ఎంత నొచ్చుకుంటున్నదో అని బాధపడుతూంటాను.

రా X

ప్రభూ, తమ అనుగ్రహంవల్ల నా కట్టి వ్యథ ఏమీ కలగడం లేదు. ఈ చర్మపు నునుపు చెరగకుండడానికానీ, ఈ కన్నుల మెరుగు తరగకుండడానికానీ నాకు విచారం లేదు. ఈ అరణ్యమూ, తమ పవిత్రసాన్నిధ్యమూ నా కెంతశాంతి నిస్తున్నాయో ఎట్లా చెప్పను!

మ హ ర్షి

కాదు రాగిణీ! నీవు పొరపడుతున్నావు. కుసుమసుకుమారమైన నీ శరీరం, లేతచివుళ్లవంటి నీ కోమలపాదాలు, ఈ అడవిరాతి నేలలో ఎంత చిక్కుపడుతున్నాయో నాకు తెలుసు. పట్టణ సౌధాలు, సౌఖ్యాలు నీవంటి పువ్వుశీలలకోసమే ఏర్పడినాయని ఇప్పుడు నిశ్చయంగా అనుకుంటూన్నాను కూడా—

రా X

గురుదేవా! ఈనాడు వింతగా సెలవిస్తున్నారు.

మ హ ర్షి

రాగిణీ, అతిశయోక్తి కాదు. వచ్చిననాటినుంచీ నీ శరీరాన్ని ఎన్ని శ్రమలకు అగ్గంచేసి ఈ తపస్విసేవృత్తిని సాగిస్తున్నావు! ఐనప్పటికీ—అన్నిటికీ ఓర్చి నీనవ్వులతో, పాటలతో ఈ ఆశ్రమాన్ని ఎంత ఉత్సాహభరితం చేశావు! నిజం చెబుతున్నాను. విను. నీ సాహచర్యంవల్ల ఇంతవరకూ నేను నా జీవితంలో చూడని ఒక సుందర లోకపు ద్వారం హఠాత్తుగా తెరచుకున్నట్టయింది. నీ వీఆశ్రమంలో అడుగుపెట్టేవరకూ పూవుల్లో ఇంత పరిమళం ఉంటుందనీ, పాటల్లో ఇంత తీపి ఉంటుందనీ నాకు తెలియదు. నిరంతరతపస్సాధనలో ఈ అనుభవాలు నాలో మూర్ఛిల్లి ఉవ్వెత్తుగా ఇపుడు నీవల్ల మేలుకున్నాయిగాబోలు—నా బుద్ధికి ఊపిరాడడం లేదు.

రా X

నాకేమీ అర్థంకాక సిగ్గుపడుతున్నాను ప్రభూ!

మ హ ర్షి

పిచ్చివాళ్ళు ఎవరో తపస్సుకు స్త్రీ విఘ్నకారిణి అంటే నిజమే అనుకున్నాను. ఇప్పుడు అసత్యం అని గ్రహించాను. సుందర దేహవల్లితో నీ వీ ఆశ్రమంలో కదలుతూ, ఏవో తీయనిపాటలు పాడుతూ ఇచటి ప్రతిఅణువుపై నీ అమృతస్నేహం వర్షించి ప్రేమించుతూఉంటే మా కీకుప్పకవవాసం, నిష్ఠురతపశ్చర్య మృదువుగా, మధురంగా మారినవంటే నమ్ము. ఉండు—ఈ జలసేచనంలో ఎంత అలసిపోయినావూ! చెమటపట్టిన నుదుటిమీద చూర్ణకుంతలాలు చిక్కులుపడి ఎట్లా అంటుకుపోయాయో చూచావా!

రా—ఈ శమీవృక్షంకింద కూర్చుని స్థిమితంగా మాటాడుకోవచ్చు.

ఏం—నిద్రవస్తున్నదా? ఈ శరజ్జ్యోత్స్న ఎట్లా ఉన్నదో చూశావా?

రా X

చిత్తం. తమకు శ్రమకాకపోతే...వెన్నెలరాత్రిలో నాకు నిద్ర ఉండదు స్వామీ.

(శమీవృక్షంకింద ఆహ్లాదంగా కూర్చుంటారు)

రా X

గురుదేవా! నాకు ఈ లోకంపోకడ చూస్తే నవ్వొస్తుంది. సర్వోత్తమమైన ధర్మాన్ని అర్థకామాలతో కలిపి ఎందుకు ఉచ్చరిస్తారో తెలియదు.

మ హ ర్షి

రాగిణీ! నీ బుద్ధికౌశలం చూస్తే నాకు ఆశ్చర్యమూ, సంతోషమూ కలుగుతాయి. అయితే, చెప్పు చూదాం. అర్థకామాలకంటె ధర్మం ఎందుచేత గొప్పది?

రా X

సకలశాస్త్రకోవిదులు—తమకు నేను చెప్పడమా? ఏమి టీపరీక్ష గురుస్వామీ—అయినా, తమ ఆజ్ఞ. తోచినది మనవిచేస్తాను.

ధర్మం లేనిదే అర్థకామాలు పుట్టవు. ఇవి లేకపోయినా ధర్మం స్వతంత్రంగా నిలిచి వెలుగుతుంది. తత్త్వజ్ఞానంలో బలపడిన ధర్మాన్ని అర్థకామాలు బాధించజాలవు. ఒకవేళ వాటివల్ల బాధ కలిగినప్పటికీ కొద్దిప్రయత్నంతో ధర్మం నిలదొక్కుకొని ఉత్తమ సిద్ధిని పొందితీరుతుంది.

మ హ ర్షి

ఎట్లాగో చెప్పు.

రా X

ఏమి ప్రభూ—తిలోత్తమను కామించిన విధాత, వేయి మంది మునిపత్నులను కామసేవకు పురికొల్పిన పరమశివుడు, గంగా

పవిత్రతీరాన కైవర్తకన్యతో సుఖించిన పరాశరమహర్షి ఏమి మహిమను కోల్పోయారు?

మహర్షి

(పకపక నవ్వి) ఎన్నడూ లేనిది ఈ బ్రాహ్మణ్ని శీతలమారుతం చక్కిలిగింతలు పెడుతున్నది. సరేగాని—మీరు అడుగుతున్న విషయం గనుక కుతూహలంకొద్దీ అడుగుతున్నాను.

కామపురుషార్థరహస్యం ఏమిటి రాగిణీ!

రాగ

(సిగ్గుతో నవ్వుతూ) ఈనాడు నిజంగా గురుదేవులు నన్ను పరీక్ష చేస్తున్నారు.

తెలిసినంత విన్నవిస్తాను.

ప్రేమగల ఇద్దరు స్త్రీపురుషుల హృదయాలలో ఉద్భవించిన ఒక మధురకాంతాభావం. అన్యోన్యప్రియసల్లాపాల్లో, పరిమళాల్లో, విహారాల్లో విజృంభించి ఒక ఆనందసమాధిలో లీనంచేస్తుంది. ఆ సుఖంకోసం ఎన్ని యజ్ఞాలు, తపస్సులు, దానాలు, యుద్ధాలు, సముద్రలంఘనాలు ప్రవర్తిల్లినవో తమకు తెలియనిదా గురుదేవా?

మహర్షి

(చిత్రమైన మానసవికారానికి లొంగి)

ఎంత విజ్ఞానవతివి రాగిణీ! ఇంతవరకూ నేను నీకు గురువును. ఈ పైన నీవు నాకు.

అపూర్వ జ్ఞాన శోభతో వెలిగే నీ కన్నుల అందాన్ని సమీపంలో చూడనీ—దగ్గరగా, ఇంకా దగ్గరగా రా...అయ్యో! జరీవ కేసరాలు ఎన్ని చిందరవందరగా నీ తలపై పడ్డవో చూశావా? ఏమీ శ్రద్ధచెయ్యవు.

రాగ

ఆచార్యదేవా! వద్దు. వద్దు. ఈ పాపాత్మురాలిని శాసించండి. నరకంలోకి జారిపోయే ఈ దీనురాలిని రక్షించండి.

మహర్షి

తృతీయపురుషార్థఆచార్యా!! నరకనాకములకు ఏది ప్రమాణం?

రాగ

(తప్పించుకుంటూ) గురుదేవులు పరిహాసిస్తున్నారేమో. ఆఁ ఆఁ, ధర్మం కాదు.

మహర్షి

జ్ఞాన రాగిణీ! నాకు కావలసింది ధర్మం కాదు.

రాగ

మానిదేవులు నిశ్చయంగా తృతీయపురుషార్థంద్వారా ఈ దాసిని అనుగ్రహించదలచితే—మా చంపానగరసౌధానికి దయచేయండి స్వామీ—కర్ణీరథం సిద్ధంగా ఉంది.

మహర్షి

(తృప్తిగా) సర్వోత్తమం. పద.

—మూడవ దృశ్యం—

[అంగరాజధాని చంపానగరం. దేశమంతటా వసంతోత్సవం. అంగరాజోద్యానంలో వసంతోత్సవకలకలం. మహారాజు రత్న సింహాసనాసీనుడు. కలకంఠాలు కలిపి వారవిలాసినులు నృత్యంచేస్తూ పాడుతూంటారు]

(గీతం)

మరల వచ్చె నియ్యదిగో—మానినులారా!
మన వసంతమదనోత్సవము—
తరళతరళమంజరులు చరచరా
విరిసి పుష్పాదులు కురిసినవి
నవరసాల మృదుకిసలయకబళము
మేసి కోయిలలు కూసినవి॥ మ॥

కుసుమకోమలుల రసహృదయమ్ములు
క్రోలి మధుపతతు లూగె—
చైత్రములో మధుచైత్రయాత్రలో
చెఱకువిల్లు మ్రోగె॥ మ॥

(పాట క్రమంగా ఆగిన తర్వాత)

మహారాజు

శభాష్! ఉత్సవాని కింకా రాగిణి రాలేదేమా? ఆమె పద మంజీరధ్వని, మధురకంఠమూ కలిస్తే ఈ మధూత్సవం ఇంకా వేయిరెట్లు కళగా సాగుతుందని మా అభిప్రాయంసుమా—

శ్వ ని

చిత్తం ప్రభూ, సంకేతమేమి? ఇంకా ఎందుచేతనో రాలేదు. (కొంటెగా నవ్వి) ఆమె సంగతి మాకంటె మదనమంజరికి బాగా తెలుస్తుంది మహారాజా!

(అన్ని స్త్రీకంఠాలూ ఒక్కసారిగా)

అదిగో రాగిణి! గెలిచింది. గెలిచింది.

ఒక గొంతు

ఎంతటి జాణ! మనోహరంగా అలంకరించుకొని పురుషుని వస్త్రాలతో ఎవరినో వెంటబెట్టుకొని వస్తున్నది.

(ప్రవేశం : ఉత్సవ ఉజ్జ్వలవేషంతో రాగమంజరి, విలాస పురుషవేషంతో మరీచి మహర్షి.)

రాగ

(మహారాజును సమీపించి) భూలోకదేవేంద్రా! అంగ ప్రభూ! నమస్కారం.

రాజు

ఇదిగో రాగిణీ! చాలా సంతోషం. సమయానికి వచ్చావు. సరేగాని నీవెనుక ఆ పక్షివిలాసి ఎవరు ?

రాగ

చిత్తం చిత్తం రెండుగడియలలో అన్నీ ప్రభువారికి విశద మవుతాయి. (విజయగర్వసూచకంగా మదనమంజరివైపు చూస్తుంది.)

రాజు

(చిరునవ్వుతో) మదనా, ఏమిటీ గాథ ?

మ ద న

(గంభీరంగా) మహారాజా, కథ ఏమీ లేదు. నేను ఆరునెలల కిందట రాగిణితో పందెంవేసి ఇప్పుడు ఓడిపోయాను. నిశ్చయంగా రాగిణి గెలిచింది. నేను ఆమెప్రజ్ఞను మెచ్చుకుంటున్నాను.

మహారాజు

రాగిణీ, నీ విజయగాథ ఏమిటో వివరించు.

రాగ

చిత్తం మహారాజా. సుమారు ఆరునెలలకిందట ఒకనాడు మేమంతా గోష్ఠిలో ఉండగా, పురుషులూ, ఇంద్రియనిగ్రహం ప్రసక్తి వచ్చింది.

అప్పుడు మదన అంది. అచ్చమైన ఇంద్రియవిజేతలు - మహర్షులు ఎంతటి లావణ్యనిధి కంటపడినా కన్నెత్తి చూడరని ప్రతి పాదించింది. నేను, పూర్వం స్త్రీసౌందర్యాగ్నికి ఆహుతులైన మునుల కథలు చెప్పాను.

మదన కథలు నమ్మనంది. నా పట్టుదల హెచ్చింది. మదన తుద కిట్లా అంది: 'వృథావాదాలు ఎందుకూ? నువ్వు ఆరునెలల్లో గంగాతీరతపోవనవాసి మరీచిమహర్షి ని నీసౌందర్యసమ్మోహితుని చేసి ఈ చంపానగరానికి తెస్తివా, నీకు నేను దాసి:వుతాను. ఓడితే నీవు నాకు కావాలి' అని. ఒప్పుకున్నాను. ఈరోజు తుదిగడువు. ఇదుగో మహర్షులవారు నన్ను అనుగ్రహించారు.

(మహర్షి ఆశ్చర్యంలో మునిగి తలవంచుకుంటాడు)

రాజు

రాగిణీ, తక్కిన విషయాలు అట్లా ఉంచి, నీకౌశలానికి ఎంతైనా మెచ్చుకుంటూ ఈ జాతిముక్తాహారం నీకు బహుమానం ఇస్తున్నాను. ఏవరక్కడ?

పరిచారిక

చిత్తం. ఏమి సెలవు?

రాజు

రెండు దుకూలవస్త్రాలు. నూటపదారు దీనారాలు. ఒక కర్పూరతాంబూలం ఈ, వెంటనే—

పరిచారిక

ఏలినవారి ఆజ్ఞ.

(బహుమానసామగ్రి తెచ్చి ఎదుట ఉంచుతుంది)

రాజు

రాగిణీ, ఇదిగో మా వసంతబహుమానం.

రాగ

(కృతజ్ఞతగా) మహాప్రభువుల అనుగ్రహం. (స్వీకరిస్తుంది)

రాజు

ఈవినోదములతో ఇప్పటికి సభ చాలిస్తున్నాం.

దాసికలు

జై. అంగమహాప్రభువులకు జై.

(అందరూ వెడలిపోగా-రాగిణి, మహర్షి)

రాగ

మహర్షి దేవా! ఈ దాసిని ఇన్ని సన్మానగౌరవాలకు పాత్రురాలిని చేసినందుకు కృతజ్ఞతతో నమస్కరిస్తున్నాను. (పాదాలమీద పడుతుంది)

మ హ ర్షి

(ఆశ్చర్యంతో చలించిపోతూ)

రా...గి...ణీ, రా...గి...ణీ—నీవే మాట్లాడుతున్నావా? ఎంతటి నటనాకౌశలం చూపావు! నీ మోహినీనేత్రశోభకు నా చిర సంచిత తపోధనమంతా చూరయిచ్చి నీకంటినీనల్లో నశించివచ్చానే! లోకంలో ఇంత వంచన ఉంటుందా? ఏమిటీ!...నామాటలు గాలికి విడిచి నడిచిపోతున్నావా? చండికా!

నిన్ను విడిచి ఎట్లా బతకను? ఎక్కడికి వెళ్ళను?

(దిగ్భ్రమగా నిలుచుంటాడు)

రాగ

గురుదేవా! వెళ్ళండి. ఇప్పటికైనా కామపురుషార్థంలోని క్షుద్రత్వం, పతనం గ్రహించి ఏ యువతీలావణ్య సమ్మోహానికీ లొంగని బలిష్ఠమైన ఆత్మనిగ్రహసంపత్తిని వహించి ఉత్తమసిద్ధిని పొందండి. ఇదిగో, ఇదే తమ ఆశ్రమానికి రాజమార్గం.

ఇక నాకు సెలవు.

స్వార్థంకోసం ఇంతటి అమాయకసాధుమూర్తిని వంచించిన నా పాపానికి నిష్కృతి ఉండదు.

(పశ్చాత్తాపంతో, తిరిగిచూడకుండా వెళ్ళుతుంది)

మ హ ర్షి

(పెద్దగా విట్టూర్చి)

ఔరా! స్త్రీహృదయం అమృతమా?

హాలాహలమా??

కాను. అది సముద్రం!!

(నిష్క్రమణం)

# మన క్రొత్త రాజ్యాంగప్రణాళిక

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

౧౯౪౮ డిసెంబరులో సమావేశమైన రాజ్యాంగపరిషత్తులో జరిగిన చర్చలను ఆధారముచేసికొని డాక్టరు అంబేద్కర్ కమిటీవారు చిత్తు (Draft) రాజ్యాంగప్రణాళికను ఈమధ్య ప్రచురణచేసిరి. త్వరలోనే ఈ ప్రణాళికను పరిషత్తువారు విమర్శించి ఆమోదించగలరు. బహుశః పరిషత్తువారు ఇందులో గొప్పమార్పు లేవియు చేయరని చెప్పవచ్చును. అకారణముచేత ఈప్రణాళికయే మన భావిరాజ్యాంగప్రణాళిక కాగలదు. మార్పులు కొన్ని జరిగినను అవి స్వల్పమార్పులుగానే ఉండును.

దేశపరిపాలనకు ఏలాటి మూలసూత్రములును, సిద్ధాంతములును ఆధారములుగ నుండవలెనో నిర్ణయించి, వాటిని ఆచరణలో నుంచుటకు కావలసిన అధికారవర్గము ఎట్టిదిగ నుండవలెనో, ఆ వర్గములోని అంగములకు గల పరస్పరసంబంధ మెట్టిదో వివరించు ప్రణాళికయే రాజ్యాంగప్రణాళిక. ప్రతి దేశమునకు, రాజ్యమునకు ఏదో ఒక రాజ్యాంగప్రణాళిక ఉండుట అవసరము. అందులోని పరిపాలన విధాన మంతయు ఈ ప్రణాళికను అనుసరించియుండును.

మన ఈ రాజ్యాంగప్రణాళికకు ఒక విశిష్టత ఉన్నది. ఈ రాజ్యాంగము స్వతంత్రభరతఖండమునకు అనువర్తించునది. గత ౧౫౦ సంవత్సరములమధ్య మన దేశమును పాలించుటకు బ్రిటిషువారు అనేకరాజ్యాంగప్రణాళికలను అప్పుడప్పుడు తయారుచేయుచుండిరి. వారు ఆఖరున తయారుచేసినది ౧౯౩౫సం.పు ఇండియాపరిపాలన చట్టము. కాని ఈ ప్రణాళిక లన్నియు పరాధీనమగు భరతఖండమును ఏలాగు పాలించవలెనో నిర్ణయించినట్టివి. బ్రిటిష్‌వారి అధికారము నిలుచుటకు ఏలాటి ఏర్పాటులు, సూత్రములు, కీలకములు అవసరములో నిరూపించినట్టివి. ఇప్పుడు మనము ఏర్పరచుకొన్న రాజ్యాంగప్రణాళిక అట్టిది గాక స్వతంత్రభరతఖండము ఎట్లు పాలింపబడవలెనో నిరూపించుచున్నది. ఇది ఇందులోని మొదటి విశేషము. రెండవ విశేష మేమనగా: ఇది మనమే తయారుచేసికొన్నది. ఇదివరకు అమలులో నుండిన ప్రణాళికలన్నియు బ్రిటిష్‌వారు తయారుచేసినవి. వాటిని సృష్టించుటలో మన కెట్టి జోక్యము లేకుండెను. కాని దీనిని స్వేచ్ఛగా, మన అవసరానవసరములను ఆలోచించుకొని మన పెద్దలే తయారుచేసిరి. కనుక ఇది స్వదేశీరాజ్యాంగప్రణాళిక.

ఈ ప్రణాళికకు మరొక విశేషముకూడ కలదు. ఇందులో ఉద్దేశింపబడిన రాజ్యము ప్రజారాజ్యము. అనగా ఇందు సర్వస్వామ్యము ప్రజలదే. ప్రజల దృఢసంకల్పమే దీనికి మూలమని ప్రణాళికలోని ప్రస్తావనావాక్యములు ఘోషించుచున్నవి. ప్రస్తుతము ప్రపంచములో రెండువిధములైన రాజ్యాంగవిధానములు పరస్పరము పోటీచేయుచున్నవి. ఒకటి నిరంకుశవిధానము; రెండు ప్రజాస్వామ్యము. నిరంకుశ విధానములో రాజ్యాధికారమునకు హద్దు, నియమము అనునది ఉండదు. అధికారములో ఉన్నవారు ఏది చేసినను చెల్లును. అది చెల్ల దనికాని, చెల్లకూడ దనిగాని చెప్పగలవా రెవ్వరు ఉండరు. అందుచేతనే నిరంకుశ మను పేరు దానికి సార్థకమగుచున్నది. ప్రజాస్వామ్యము ఇట్టిది కాదు. ఇందు అధికారములో నుండువారు కొన్ని విషయములందే అధికారము వహించియుందురు. అందుచేతనే వారి అధికారము పరిమితమైన దని చెప్పబడుచున్నది. రాజ్యాంగ ప్రణాళికయొక్క ఉద్దేశములలో ఈ హద్దులను నిర్ణయించుట ఒకటి. నిరంకుశప్రభుత్వములో అధికారమంతయు ఒక నియంతయొక్కగాని, ఒక రాజకీయపక్షముయొక్కగాని వశమై యుండును. నిరంకుశుడు ఒకే వ్యక్తి అయినను, ఒకే పక్షమైనను దానికి ఒక లక్షణ ముండును. అల్పసంఖ్యాకులు అధికసంఖ్యాకులను పాలించుటయే ఆ లక్షణము. హిట్లరుకాలమున జర్మనీయందు, ముస్సోలినీకాలమున ఇటలీలో ఉండినట్టి, ప్రస్తుతము స్టాలిన్ అధీనమున రష్యాలోను, తూర్పుయూరపులోని ఇతరకమ్యూనిస్టు దేశములలోను ఉండు నిరంకుశప్రభుత్వము అల్పసంఖ్యాకులు అధికసంఖ్యాకులపై చేయుచుండు ప్రభుత్వము. ఇది ప్రజాస్వామ్యము కాదనుట కిది యొక కారణము. నిరంకుశప్రభుత్వమును నియమించుటకుగాని, అధికారమునుండి తొలగించుటకుగాని, దాని చర్యలను విమర్శించుటకుగాని ప్రజలకు అధికార ముండదు. ప్రజాస్వామ్యములో ఇట్లుగాక అధికసంఖ్యాకుల చేతులలో అధికార ముండుటయేగాక, ఏ మంత్రివర్గమువారుకూడ శాశ్వతముగ అధికారములో నుండ వీలుండదు. అప్పుడప్పుడు ఎన్నికలు జరుగుటయు, ప్రజలు స్వేచ్ఛగ ఓట్లను ఇచ్చి, ఎవరు అధికారములో ఉండుటయు మానుటయు నిర్ణయించుట కవకాశ మున్నది. అందుచేత ప్రజాభిప్రాయమును గమనించకగాని, దానికి విరుద్ధముగగాని రాజ్యమును పాలించుటకు వీలుండదు. ఈ రెంటిలో ఏదో ఒక రాజ్యాంగవిధానమును మనము ప్రస్తుతము అనుసరించవలసియున్నది. మన రాజ్యాంగపరిషత్తువారు ఆమోదించబోవు ప్రణాళిక నిరంకుశ ప్రభుత్వమును నిరసించునట్టిదియు, ప్రజాస్వామ్యమును సంస్థాపనము చేయునట్టిదియుగ నున్నది. ఇదియే ఇందులోని మూడవ విశేషము.

మన క్రొత్త రాజ్యాంగ ప్రణాళికకంతకు చాలవరకు వ్యక్తిత్వము ఆధారము. ఇది కూడ ఒక ప్రధానమైన లక్షణము. దీనిప్రాధాన్యమును గ్రహించుట సులభము కాదు. తత్త్వవిషయము లన్నిటివలె ఇందులో క్లిష్టాంశము లనేకము లున్నవి. రాజకీయతత్త్వములు మెుత్తముమీద

రెండు రకములుగ విభజింపవగియున్నవి. వ్యక్తితత్వ సమిష్టితత్వములే అవి. జాతి, మతము, వర్ణము, కులము, వర్గము—వీటిని ఆధారముచేసి కొని వ్యక్తికి వ్యక్తికి మధ్య విచక్షణ కల్పించి రాజ్యమును పాలించుట ఒక విధానము. అదియే సమిష్టితత్వవిధానము. అందు వ్యక్తికి స్వతస్సిద్ధమైన ప్రాధాన్య ముండదు. అతనికి పరిపాలకుల దృష్టిలో గల ప్రాధాన్యము వాని మతమునుబట్టియో, వర్ణమునుబట్టియో, వర్గమును బట్టియో నిర్ణయ మగుచుండును. ఒక మతమునకు చెందినవా డన్న కారణము చేతనో, ఒక వర్ణమునకుగాని, వర్గమునకుగాని చెందిన వా డన్న కారణముచేతనో అతనికి పరిపాలనాధికారులు ఎక్కువ సదుపాయము కల్పించుటయు, కల్పించక పోవుటయు జరుగు చుండును. జాతి, మతము, వర్ణము, వర్గము—ఇవి అన్నియు సమిష్టిని (Group) సూచించు మాటలు. సమిష్టితత్వములో సమిష్టియే సర్వ మనియు, వ్యక్తి మిథ్య అనియు, సమిష్టికే విలువగల దనియు, వ్యక్తి స్వతహాగా విలువ లేదనియు, సమిష్టిలో ఒక అంగముగుటయే వ్యక్తి వాంఛించతగిన పరమావధి అనియు ప్రతిపాదిత మగుచుండును. ప్రాచీన కాలపు భారతరాజ్యాంగవిధానమున కంతకు వర్ణధర్మము మూలము. వ్యక్తి ఏ వర్ణమునకు చెందినవా డన్న సూత్రము ననుసరించి అధికార ములు రాజులు కల్పించుచుండువారు. వర్ణహీన మైనట్టిగాని, వర్ణసంకరము కలిగినట్టిగాని సంఘము వర్జనీయ మనియే అప్పటి తత్వము. మహమ్మదీయపరిపాలన కాలములో మతతత్వమే పరిపాలనకు ఆధారము. బ్రిటిష్‌పాలనలో జాతి, మతము, కులము, వర్ణము, వర్గము—ఇవన్నియు వారు వారి చిత్తానుసారము ఆధారములుగ తీసికొని, అంతర్విభేదము లనేకములను కల్పించి వారి అధికారమును నిలబెట్టు కొనిరి. ప్రస్తుతము రష్యాదేశమందును, కమ్యూనిస్టుపాలనకు లోబడిన ఇతరదేశములందును పరిపాలనకు వర్గతత్వము మూలాధారము. కూలిపని చేయువాని కుండు సదుపాయములు ఇతరులకుండవు. ప్రాచీనభరతఖండములో బ్రాహ్మణవర్ణము అగ్రస్థానము వహించినట్లు కమ్యూనిస్టుదేశములలో కాయకష్టము చేయు కార్మికులకు అగ్రస్థానము. వర్తకవ్యాపారములు చేసి జీవించువారికి స్థానమే లేదు. వ్యక్తితత్వమును ఆధారముగ చేసికొన్న ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికా మొదలైన ప్రజాస్వామ్యదేశములలో వ్యక్తి సత్య మనియు, సమిష్టికి ప్రత్యేకత లేదనియు, అది మిథ్య యనియు ప్రజ లంగీకరించు చుందురు. రాజ్యాంగదృష్టిలో వ్యక్తులందరు—జాతిమతకులవర్ణ వర్గవిచక్షణ లేక—సమానులు. ఎన్నికలలో పాల్గొనుటకుగాని, పరి పాలకవర్గములో సభ్యు లగుటకుగాని, ఉద్యోగముల ననుభవించుటకు గాని, వారివారి ఇష్టమువచ్చిన వృత్తుల ననుసరించుటకుగాని, వ్యక్తు లందరికిని సమానమైన హక్కు లుండును. రాజకీయముగ వ్యక్తుల కుండవలసిన అవకాశములు, సదుపాయములు జాతి, మతము మొదలైన బాహ్యచిహ్నములను బట్టి నిర్ణయింపబడవు. అన్నిటికిని వ్యక్తియొక్క నిశ్చితమైన అర్హతానర్హతలే ఆధారములు. మన మిప్పుడు తయారుచేసికొన్న రాజ్యాంగప్రణాళికకు వ్యక్తితత్వము ఆధారము, సమిష్టితత్వమును అది నిరాకరించినది. ప్రాచీనహైందవసంప్రదాయ మైన వర్ణధర్మము ననుసరించి ఇప్పటి భరతఖండము పాలింపబడవలె నని మన రాజ్యాంగపరిషత్తులో ఎవ్వరును వాదించియుండలేదు. అందరు ఆ సమిష్టితత్వమును నిరాకరించినవారే. మతజాతికులవివక్షత లేని సర్వసమత్వమును ప్రతిపాదించు రాజ్యాంగప్రణాళికయే మనది. ఇదికూడ ఈ ప్రణాళికకు ఒక ప్రత్యేకతను కల్పించుచున్నది.

## ప్రాథమికహక్కులు (Fundamental Rights)

ఈ కారణముచేతనే ౧౮ పర్వములతో గూడిన మన రాజ్యాంగప్రణాళికలో ౩ పర్వములు (అనగా, ౩, ౪, ౧౪ పర్వ ములు) వ్యక్తుల హక్కులకు సంబంధించి యున్నవి. వ్యక్తియొక్కడే సత్యపదార్థ మనియు, కష్టసుఖములను అనుభవించువారు వ్యక్తులే గాని సమిష్టిసంస్థలు కావనియు ఆధారముచేసికొన్న మన రాజ్యాంగ ప్రణాళిక ఈ మూడు పర్వములలో ఇకమీదట ఏర్పడబోవు పరి పాలకవర్గము ఎట్టి నియమములకు బద్ధమై తన ధర్మమును నిర్వహించ వలెనో చెప్పుచున్నది. వ్యక్తుల హక్కులకు విరుద్ధమైన చట్టములను ప్రభుత్వమువారు సాధారణముగ చేయరాదు. దేశమున కేదైన గొప్ప ప్రమాదము జరుగ నున్నప్పుడును, శాంతిభద్రతలను కాపాడవలసి వచ్చినను తప్ప తక్కిన సమయములలో ఈ హక్కులను ప్రభుత్వము వారు భంగపరచరాదు. ఇతరు లెవరైన వాటికి భంగము కలిగించిన యెడల అది నేరముగ పరిగణించబడును. అట్టివారు శిక్షాపాత్రు లగు దురు. ఈవిధముగ నిర్ణయింపబడిన ప్రాథమికహక్కులలో (౧) సర్వ జనసమత, (౨) వాక్స్వాతంత్ర్యము, సంఘముల నేర్పరచుకొను స్వాతంత్ర్యము, సమావేశముల స్వాతంత్ర్యము, మతస్వాతం త్ర్యము, వైజ్ఞానికస్వాతంత్ర్యము ప్రధానములైనవి. అంటరాని తనము ఉండరాదు. దుకాణములు, రోడ్లు, పాఠశాలలు, బావులు, మొదలైన బహిరంగప్రదేశములలోనికి అందరు రావచ్చును. ఈలాటి హక్కులకు విరుద్ధముగ శాసనసభవారు చట్టములు చేసి నను, మంత్రివర్గమువారు వాటిని అమలులో ఉంచినను వాటిని రద్దుచేయుటకు న్యాయస్థానములకు సర్వాధికార ముండును. ప్రాథమికహక్కులకు సంబంధించిన భాగము ఇంతకుపూర్వపు రాజ్యాంగ ప్రణాళికలలో ఉండలేదు. అట్టి భాగమును చేర్చుట అనవసర మనియు, నష్టకర మనియు కూడ బ్రిటిషువారు వాదించు చుండిరి.

## ఆదర్శములు

ప్రభుత్వమువారు వ్యక్తుల హక్కులకు విరుద్ధముగ ఎట్టి చట్టము లను చేయరా దని చెప్పుటయే గాక, వ్యక్తుల శ్రేయోభివృద్ధికై వా రెట్టి పనులను చేయవలసియున్నదో, దానినికూడ మన ప్రణాళిక స్పష్ట పరచుచున్నది. ఇదికూడ ఇందులో కనిపించు విశేషములలో ఒకటి. దేశములోని ప్రజలు ప్రస్తుతము అనేకవిధములైన కష్టము లనుభవించు చున్నారు. దారిద్ర్యము, అజ్ఞానము, అనారోగ్యము ఈలాటి కష్ట ములలో కొన్ని. వీటి నన్నిటిని తొలగించుటకే మన రాజ్యాంగ మేర్పడిన దనియు, వీటిని తొలగించుటకు పరిపాలకులు సమస్తప్రయ త్నములను చేయవలసి యున్న దనియు నాల్గవ పర్వములో రాజ్యాంగ ప్రణాళిక ఉద్ఘాటించుచున్నది. జీవనోపాధి లేని వ్యక్తి ఒక్కడుకూడ ఉండరాదు. దేశములోని ధనమంతయు ఎవరో కొందరి అనుభవ ములోమాత్ర ముండక, అందరి అనుభవమునకు యోగ్య మగునట్లు ఏర్పాట్లు జరుగవలెను. అవినీతికరములును, అనారోగ్యమును వృద్ధి చేయునట్టివియు అగు వృత్తులు దేశమం దుండరాదు. నిరుద్యోగుల కును, రోగపీడితులకును, ఆశ్రయములేని వృద్ధులకును, వికలాంగుల కును ప్రభుత్వము సహాయము చేయవలెను. అందరికి ప్రాథమికవిద్య లభ్యము కావలెను. ప్రపంచశాంతికై ప్రభుత్వము పాటుపడవలెను.

వెనుకబడినవారిని ముందుకు తేవలెను. ఈలాటి గొప్ప ఆదర్శములను సాధించుటయే ఈ క్రొత్త ప్రణాళికమూలమున ఏర్పడబోవు రాజ్యాంగముయొక్క కర్తవ్యము. ఇది వెంటనే జరుగుటకు సాధ్యము కాక పోవచ్చును. కాని వీటిని సాధించుటయే దాని ధర్మము.

ఈ ప్రాథమిక హక్కులు సంపూర్ణములా, లేక వాటియం దేమైన లోపములున్నవా అను విషయమై ఒక మాట చెప్పవలసి యున్నది. ఇది చాలవరకు సంపూర్ణమైనదేగాని, రెండు మూడు విషయములలో మాత్రము కొంత సవరణ అవసర మని తోచుచున్నది. ఇవి (అ)మత ప్రచారము, (ఆ) అల్పసంఖ్యాకుల భాషకు, విజ్ఞానమునకు సంబంధించిన హక్కులు, (ఇ)కొందరు అల్పసంఖ్యాకులు, వెనుక బడిన వర్గములవారికై కేటాయింపుచేయబడిన ప్రత్యేకసభ్యత్వములు, ఉద్యోగములు.

## మత ప్రచారము

ఎవరి మతమును వారు అనుసరించుటకు ప్రతివ్యక్తికి హక్కు ఉండవలె నని అందరు అంగీకరించుచున్నారు. కాని పరమతముల ననుసరించువారిని తమ మతములో చేర్చుకొనుటకై స్వమతప్రచారము చేయుటకూడ ప్రాథమికహక్కులలో నొకటిగ పరిగణింపబడవలె నని రాజ్యాంగప్రణాళికలో ఉన్నది. కాని స్వీయమతప్రచారముద్వారా ఇతరమతములవారిని తమ మతములో చేర్చుకొనుటకూడ ఒక హక్కా, ఇట్లు చేయకూడ దని ప్రభుత్వమువారు చట్టము గావింప రాదా అన్నది కొంత విమర్శించదగిన విషయమే. మన దేశములోని ప్రస్తుతకల్లోలమున కంతకు మతద్వేషమును, ఒక మతమువారిని మరొక మతములో చేర్చుట కవకాశ ముండుటయు ప్రధానకారణములు. మతగ్రంథములను సమగ్రముగ పరిశీలించి, ఒక మతము మరియొక మతముకంటె ఉత్కృష్టమైన దను విశ్వాసము కలిగినప్పుడు మతమును మార్చుకొనుటలో లోపము లేకపోవచ్చును. కాని గత వేయిసంవత్సరములమధ్య—అనగా మహమ్మదీయులు మన దేశమును ప్రవేశించినతర్వాత—హిందువులు లక్షలాదిగ మహమ్మదీయు లగుటకును, కొందరు ఇటీవల క్రైస్తవు లగుటకును ఇట్టి పరిశీలన కారణము కాదు. హిందూమతవిషయమై వారు గావించిన దుష్ప్రచారము, బలాత్కారము, ధనమును ఇచ్చుట—ఈలాటి సాధనములద్వారా హిందువు లనేకులను వారు మహమ్మదీయులుగను, క్రైస్తవులుగను చేసిరి. ఈ కారణముచేత మతసమస్య దేశములో తీవ్రరూపమును ధరించి ప్రస్తుతదేశవిభజనకును, అశాంతికిని కారణ మయ్యెను. ఈ సందర్భములలో మతప్రచారమును ఒక ప్రాథమికహక్కుగా మనము అంగీకరించుట ఉచితము కాదు. ఏ మతస్థులు ఆ మతస్థులకు వారి వారి మతధర్మములను బోధించుకొనవచ్చునేగాని, ఇతరులకు కూడ వాటిని బోధించి మతములను మార్చరాదు. ఇంతకును అన్ని మతములలో ఉండు ప్రధానసత్యము లొక్కటే. వాటిలో ఏలాటి భేదములు లేవు. కావున, దుర్వినియోగము చేయుట కవకాశ ముండుటచేతను, అట్టి దుర్వినియోగము ఇదివరకు జరిగియున్నందునను, దానిమూలమున రాజకీయపరిస్థితులు క్లిష్టము లగుట తప్పని కారణముచేతను మతప్రచారస్వాతంత్ర్యమును ప్రాథమికహక్కులనుండి రద్దుచేయుట అవసరము. ఒక మతమును వదలి మరియొక మతములో చేరినవారిని తిరిగి వారి మొదటి మతములోనికి వచ్చుటకు కావలసిన ప్రచారము మాత్రమే అవసరము.

## అల్పసంఖ్యాకుల భాషావిజ్ఞాన హక్కులు

ఎవరి భాషను, విజ్ఞానమును వారు రక్షించుకొనుటకు హక్కు ఉండవలె నని ప్రణాళిక స్పష్టపరచుచున్నది. ఇది చాల ప్రధానమైన విషయము. దేశమంతయు భాషాప్రయుక్తరాష్ట్రములుగా విభాగము కానున్నది. అట్టి సందర్భములో మన మెంత జాగ్రత్తగను, నిష్పక్షపాతముగను ప్రవర్తించినప్పటికి ప్రతిరాష్ట్రమందును రాష్ట్రభాషను మాట్లాడని అల్పసంఖ్యాకులు కొందరు ఉండుట తప్పదు. ఉత్కళములో ఆంధ్రులు; ఆంధ్రరాష్ట్రములో ఉత్కళులు, కర్ణాటకులు, అరవలు; అరవరాష్ట్రములో కొందరు ఆంధ్రులు ఉండుట తప్పదు. అల్పసంఖ్యాకులగు వీరు వీరి మాతృభాషను తమ పిల్లలకు నేర్పుటను కోరుట సహజమే. అట్టి కోరిక రెండు విధములుగా సఫలము కావచ్చును. వీరు స్వంతద్రవ్యము ఖర్చుపెట్టుకొని, ప్రత్యేకపాఠశాలలను స్థాపించుకొని, తమ పిల్లల కందులో చదువు చెప్పించుకొనుట ఒక మార్గము. ఇట్లుగాక రాష్ట్రప్రభుత్వమువారే ఇట్టి పాఠశాలలను స్థాపించి, ఇతరపాఠశాలలకు ద్రవ్యము ఖర్చుపెట్టినట్లు వీటికికూడ ద్రవ్యము ఖర్చుపెట్టి అల్పసంఖ్యాకుల మాతృభాషను పోషించుట మరియొక మార్గము. మొదటి మార్గమును గురించియే మన రాజ్యాంగ ప్రణాళికలో ప్రశంస ఉన్నది. అదిమాత్రము చాలదు. ప్రత్యేకపాఠశాలలను స్థాపించి నడుపుకొనుటకు కావలసిన ద్రవ్యవసతులు, అవకాశములు అల్పసంఖ్యాకులకు లేకపోవచ్చును. అట్టి సందర్భములో రెండవ మార్గమే అనుసరణయోగ్య మగును. కనుక వారివారి సంఖ్యను బట్టి ప్రతిరాష్ట్రములోని ప్రభుత్వము విద్యకై చేయు ఖర్చులో ఒక భాగమును అల్పసంఖ్యాకుల విద్యాభివృద్ధికై కేటాయించవలెను. అందుకై ప్రభుత్వసహాయ ముండుట వారి ప్రాథమికహక్కులలో ఒకటిగా పరిగణింపబడవలెను.

## శాసనసభలలో ప్రాతినిధ్యము

వ్యక్తితత్వము ననుసరించి తయారుగావింపబడిన ప్రణాళికలో కులమునుబట్టియు, మతమునుబట్టియు శాసనసభలందును, ఉద్యోగములందును ప్రాతినిధ్య ముండవలె నని చెప్పుట అసంగతము. వారివారి సంఖ్యను బట్టి మహమ్మదీయులకును, హరిజనులకును, ఇండియన్ క్రిస్టియనులకును శాసనసభలలో కొన్ని ప్రత్యేకస్థానములు ఏర్పాటు గావింపబడి ఉన్నవి. ఇట్టి ఏర్పాటు అనుచితము. ఇది కులతత్వమును, మతతత్వమును బలపరచు విధానము. అయితే, శాసనసభల విషయములో మాత్రము ఈ ఏర్పాటు పది సంవత్సరములు మాత్రమే ఉండును. అటుపిమ్మట శాసనసభవారు ఆమోదించినగాని ఇది ఆచరణలో ఉండజాలదు. పది సంవత్సరములు మాత్రమే అమలులో నుండగల ఏర్పాటు ఎంత అసంగతమైనదైనను, దానిని రద్దుచేయవలసిన దని ఆందోళన చేయుట అవసరము లేదని కొందరు అభిప్రాయపడవచ్చును. కాని విషబీజమువలన కలుగు ఫలితము పది సంవత్సరముల కాల ముండుటకూడ అనర్థమే. కనుక దానిని రద్దుచేయుట మంచిది.

## ఉద్యోగములలో ప్రాతినిధ్యము

సర్కారు ఉద్యోగములలో వారి సంఖ్యనుబట్టి హరిజనులకు, వెనుకబడిన వర్గములవారికిని ప్రాతినిధ్య ముండవలె నని రాజ్యాంగ ప్రణాళిక చెప్పుచున్నది. ఇదికూడ ప్రమాదకరమైనట్టియు, ప్రజాస్వామ్యసిద్ధాంతమునకును, వ్యక్తితత్వమునకును విరుద్ధమైనట్టియు

గోత్రము. వెనుకబడిన కులము అన్న మాటకు నిర్ణీతమైన అర్థము లేదు. సర్కారు ఉద్యోగములలో కులసంఖ్యకు తగినంత ప్రాతినిధ్యము లేని కులము వెనుకబడిన కుల మని భావించరాదు. అట్టి కులములోని వారు వర్తక వ్యాపారములు చేసియు, భూస్వాములయ్యు ఎంతో ధనము గడించు చుండవచ్చును. దానితోపాటు వారికి ఉద్యోగాలలో కూడ ప్రాతినిధ్య ముండుట అనుచితము. అన్ని వృత్తులలోను, సమస్త ఆర్థిక వసతుల ననుభవించుటలోను కులవారీగా పంపకము జరిగినప్పుడు ఉద్యోగాలుకూడ కులవారీగా పంపకము కావలెనని వాదించుట సందర్భముకాని, ఉద్యోగాల విషయమందుమాత్రమే ఈ పంపక ముండవలె నని వాదించుట సబబు కాదు. హరిజనుల విషయములో కూడ ఇదే గమనించవలెను. ఏ ఉద్యోగమునకు ఎవడు అర్హుడో వాడు ఆ ఉద్యోగమును చేయవలసినదే గాని కులము ననుసరించి ఉద్యోగముల పంపకము జరిగినయెడల ప్రభుత్వసౌష్ఠవము, చెట్టు తగ్గి పోవును. కనుక ఉద్యోగములలో ప్రాతినిధ్యముండుట ప్రాథమిక హక్కులలో నొక్కటిగా పరిగణింప రాదు.

## మనది ఎంతవరకు స్వదేశీ రాజ్యాంగము?

స్వతంత్రత్వము సాధారముచేసికొని, వ్యక్తుల ప్రాథమికహక్కులను గణించి ప్రజలందరి శ్రేయస్సును అభివృద్ధిచేయు ఉద్దేశముతో నిర్మాణము గావింపబడిన ఈ రాజ్యాంగప్రణాళిక స్వదేశీరాజ్యాంగ ప్రణాళిక యని చెప్పుటకు ఎంతవరకువీలున్నది? దీనిని నిర్మాణము చేసినవారు మనవారేగనుక అంతవరకు ఇది స్వదేశీప్రణాళిక అని చెప్పుటకు అర్హమగుచున్నది. కాని దీనిని నిర్మించుటయందు ఎక్కువగా పాల్గొనిన ప్రజాపరిషత్తుసభ్యులు, కాంగ్రెసునాయకులు, ప్రణాళికరచనకై ప్రత్యేకముగ ఏర్పడిన డాక్టరు అంబేద్కరు కమిటీవారు ఈకాలపు పాశ్చాత్యరాజకీయచట్టములందును, సంప్రదాయము లందును మునిగి తేలినవారు; వాటియందు పరమవిశ్వాసము గలవారు; గ్రంథములద్వారా పాశ్చాత్యప్రజాస్వామ్యసిద్ధాంతములను అవగాహనము చేసికొని, అవియే మన దేశమునకుకూడ వర్తించు నను దృఢ నమ్మకముతో నుండువారు. కనుక శరీరతః వారు భారతీయులైనను వారి బుద్ధి, మనోభావము, రాజకీయతత్వము పాశ్చాత్యవిజ్ఞానమును అనుసరించినవి. ఈ ప్రణాళికను తయారుచేయుటకు కావలసిన అంగముల నన్నిటిని వారు పాశ్చాత్యప్రపంచము నుండి సంపాదించిరి. ఇంగ్లండు, అమెరికా, కనడా, ఆస్ట్రేలియా మొదలగు దేశములలో నొక్కొక్కదానినుండి వారికి రుచించిన అంగములను కొన్నిటిని మన దేశమునకు తెచ్చి, వాటి నన్నిటిని కూర్చి సమగ్రమైనట్టియు, సంపూర్ణమైనట్టియు స్వరూపము గల ప్రణాళికను నిర్మించుటయే వారు చేసిన పని. ఇదివరకు ఇట్టి అంగముల సమకూర్పు బ్రిటిషువారు బ్రిటనులో చేసి దాని మూలమున ఏర్పడిన రాజ్యాంగమును మన దేశమునకు తెచ్చి ఆచరణలో ఉంచుచుండిరి. ఇప్పు డవే అంగములను మనవారు ఢిల్లీకి తెచ్చి, ఇచ్చట వాటి నన్నిటిని సమకూర్చి ఈ ప్రణాళికను తయారుచేసిరి. ఇందులో భారతఖండపరిస్థితులను ప్రత్యేకముగ మనస్సునం దుంచుకొని వాటికి తగినట్లు ప్రణాళికను సవరించిన భాగములు చాల స్వల్పములు. మహాత్మాగాంధీ గారి పంచాయతీరాజ్యలక్షణములు ఇందు ఏవియు లేవు. ఈ ప్రణాళికలో నూటికి డెబ్బై అయిదు వంతులు బ్రిటిషు వారు ౧౯౩౫ లో నిర్మించిన ఇండియాపరిపాలనచట్టముయొక్క నమూనా. ఆ చట్టములోని సెక్షనులు, క్లాసులు ఏలాటి మార్పులు లేక, మక్కీకు మక్కీ అన్నట్లు ఇందులో చేర్చబడినవి. దానికి, దీనికి ఒక అంశమందుమాత్రమే భేదము. ౧౯౩౫ చట్టములో బ్రిటిష్ అధికారమును నిలుపుకొనుటకు అవసరములైన సెక్షన్లు, క్లాసులు అనేకము లున్నవి. అవన్నియు ఇప్పుడు రద్దు కావింపబడినవి. అవి మినహాగా తక్కిన భాగములన్నియు మనవారు ఇప్పుడు తయారు చేసిన రాజ్యాంగప్రణాళికయందు ప్రధానభాగము లైనవి.

## మనది వికేంద్రీకృతమైన సంయుక్తరాజ్యాంగము

క్రొత్త ప్రణాళికమూలమున ఏర్పడబోవు రాజ్యమునకు సంయుక్తభరతఖండము (The Indian Union) అను పే రుండును. అనేకరాజ్యములుకలిసి ఏర్పడిన మహారాజ్య మను అర్థము "సంయుక్త" (Union) అన్న మాటవల్ల స్పష్టమగుచున్నది. అనగా దేశములో ఏర్పడినట్టియు, ఇకమీదట ఏర్పడబోవునట్టియు రాజ్యములకు ఒక ప్రత్యేకరీతియు, స్వతంత్రాధికారమును ఉండును. అవి కేంద్రప్రభుత్వమునకు సంపూర్ణముగ అధీనమైన రాజ్యములు కాజాలవు. అనేక వ్యవహారములలో వాటి ఇష్టానుసారముగా ప్రవర్తించుటకు అధికారము గల రాజ్యములుగా నుండును. ఇవి రెండు తరగతులుగా విభజింపబడియున్నవి. మొదటి తరగతిలో గవర్నరుల అధీనమునకు లోబడిన మద్రాసు, బొంబాయి, మధ్యరాష్ట్రము, ఉత్కళము మొదలైన రాజ్యములును, రెండవతరగతిలో సంయుక్తఇండియాలో చేరిన సంస్థానములును ఉండును. ఇప్పుడు తయారైన ప్రణాళికలో గవర్నరురాజ్యములు తొమ్మిదియు, సంస్థానములు పదొమ్మిదియు ఉదాహరింపబడినవి. ఇందులో ఆంధ్రరాజ్యము పేర్కొనబడ లేదు. ఈ ప్రణాళికను రాజ్యాంగపరిషత్తువారు ఆమోదించులోపల కేంద్రప్రభుత్వమువారొక సరిహద్దుసంఘమును నిర్మించి, ఆంధ్ర రాజ్యపు హద్దులను దృఢపరచినయెడల ఆంధ్రరాజ్యముకూడ గవర్నరుల రాజ్యపట్టికలో చేర్చుట కవకాశ ముండును. మన మేర్పరచు కొనబోవు సంయుక్తరాజ్యము వికేంద్రీకృతమైన దని చెప్పుటకు గల కారణములు సులభగ్రాహ్యములు. పరిపాలనవ్యవహారము లన్నిటిపై ఒక కేంద్రప్రభుత్వమునకే గాక, కొన్ని వ్యవహారములపై కేంద్రప్రభుత్వమునకును, తక్కిన వ్యవహారములపై రాజ్యప్రభుత్వములకును అధికార ముండుటచేత మన రాజ్యాంగము వికేంద్రీకృతరాజ్యాంగ మని చెప్పదగియున్నది. ఏ వ్యవహారములలో కేంద్రప్రభుత్వమునకును, వేటిలో రాజ్యప్రభుత్వములకును, వేటిలో రెండింటికిని అధికార ముండవలెనో ప్రణాళికలో వివరింపబడియున్నది. ఈ మూడింటిలో చేరని వ్యవహార మేదైన యున్నయెడల దానిపై కేంద్రప్రభుత్వమునకు అధికార ముండును. ఆ అధికారమునకే శేషించిన అధికారము (Residuary Power) అని పేరు. ఈ అధికారము సంయుక్త ప్రభుత్వమున కుండవలెనా, రాజ్యప్రభుత్వముల కుండవలెనా అన్న విషయమై తెగనట్టి వాదప్రతివాదములు ఇదివరలో జరుగుచుండెను. మహమ్మదీయు లొకవాదపు పక్షమునను, తదితరులు ఇంకొకవాదపు పక్షమునను ఉండిరి. పాకిస్థాననిర్మాణమూలమున ఈ వాదము ఉపసంహరింపబడెను. సంయుక్తకేంద్రప్రభుత్వమునకే ఈ శేషించిన అధికార ముండవలయు నను వాదము గెలిచెను.

### బలిష్ఠమైన కేంద్రము

మొత్తముమీద ఈ ప్రణాళికవలన ఏర్పడబోవు సంయుక్త కేంద్రప్రభుత్వము మిక్కిలి బలిష్ఠమైనదిగా నుండును. రక్షణ, విదేశ రాజ్యాంగవ్యవహారములు, రాకపోకల సాధనములు అను వ్యవహారములపైననేగాక భరతఖండమునకంతకును సమిష్టిప్రయోజనము చేకూర్చగల బ్యాంకింగు, చెలామణి, ఆర్థికనిర్మాణము మొదలైన వ్యవహారములపైగూడ కేంద్రమునకు అధికారముండును. అవసరమైనప్పుడు రాజ్యవ్యవహారములలో జేనినైనను తన అధికారములోనికి తెచ్చుకొనుటకుకూడ కేంద్రమునకు అవకాశము కల్పింపబడియున్నది. కేంద్రశాసనసభలో ఒక శాఖగా నుండు రాజ్యప్రతినిధుల సభయొక్క అమోదముతో ఇట్టి మార్పు జరుగవచ్చును. కనుక మొత్తము మీద బలిష్ఠమైన కేంద్రము ఏర్పడినదని చెప్పవచ్చును.

### మనది ప్రజాస్వామ్య రాజ్యాంగము

కేంద్రమందుగాని, రాజ్యములందుగాని అధికారమందుండు వారిని ఎన్నుకొను హక్కు స్త్రీపురుషభేదముగాని, జాతిమతకులవర్గ వివక్షగాని లేక యువజనమునకంతకు నుండును. ౨౧ సంవత్సరముల కంటె ఎక్కువ వయస్సు గలవారందరు ఎన్నికలలో పాల్గొనగలరు. ధనికులకంటె దరిద్రుల యొక్కయు, సాహుకార్లకంటె కార్మికుల యొక్కయు, ఉన్నవారికంటె లేనివారి యొక్కయు సంఖ్య అత్యధికముగ నుండుటచేత ఈ ఎన్నికలలో కార్మికులు, దరిద్రులు, లేనివారు—వీరి మాటయే సార్థకమగును. వీరు నిలబెట్టిన అభ్యర్థులే గెలువగలరు. వయోజనవోటు మూలమున కలుగబోవు లాభ మిదియే. స్త్రీల ఇష్టానిష్టములను గుర్తెరుగక, వారికి నష్టము కలిగించు చట్టములు చేయు పురుషులాక్కరే శాసనసభలలో ఉండుట జరుగదు. స్త్రీలుకూడ ఎందరో సభ్యురాండ్రై వారి సౌఖ్యమునకు కావలసిన చట్టములను చేసికొనవచ్చును. ప్రత్యేక నియోజకవర్గము లికమీదట ఉండవుగనుక వారివారి జాతికిమాత్రమే లాభము నపేక్షించు శాసనసభ్యుల సంఖ్య తగ్గిపోవును. కనుక దేశమునకంతకు, రాజ్యమునకంతకు సమిష్టిమీద ఉపచరించు ప్రభుత్వమేర్పడుటకు మన ఈ క్రొత్తప్రణాళిక అవకాశము కల్పించినది. ఇదే నిజమైన ప్రజాస్వామ్యము.

### రాజ్యాంగశాఖలు

ఇప్పుడు తయారైన ప్రణాళికప్రకారము రాజ్యాంగమంతయు సంయుక్తరాజ్యాంగము, రాజ్యరాజ్యాంగము అని రెండు భాగములలో పనిచేయును. ఇందులో ఒక్కొకదానియందు శాసనశాఖ, కార్యవర్గశాఖ, న్యాయశాఖ, ఉద్యోగశాఖ అని నాలుగు శాఖలుండును. ఈ ఒక్కొకభాగమునకును, శాఖకును సంబంధించిన వివరములన్నియు ప్రణాళిక పేర్కొనుచున్నది. ఇదిగాక ఆదాయ వ్యయములకు సంబంధించిన భాగమొకటియు, కొండజాతులకు సంబంధించిన భాగ మింకొకటియు కలదు.

### కార్యవర్గశాఖ

సంయుక్తరాజ్యము (The Union)యొక్కయు, ఒక్కొక గవర్నరు రాజ్యము (The States) యొక్కయు పరిపాలనమును నడుపువారు కార్యవర్గశాఖకు చెందినవారు. ఈ పరిపాలనముల నైతికరీతిని నిర్ణయించుచు, విదేశసంబంధములను పరిష్కరించుచు, శాసనములను అమలులో నుంచుచు, దినచర్యలన్నియు సక్రమముగ జరుగుచున్నవా లేవా అని పైవిచారణ చేయుటయే సంయుక్తకేంద్ర కార్యవర్గమువారి పని. ఇందులో విదేశసంబంధములుతప్ప తక్కిన వ్యవహారముల నన్నిటిని తమ తమ రాజ్యములకు సంబంధించినంతవరకు చక్కబెట్టుటయే గవర్నరురాజ్యకార్యవర్గమువారి పని.

### సంయుక్త కార్యవర్గశాఖ (Union Executive)

సంయుక్తరాజ్యమున కంతకు ఒక అధ్యక్షు డుండును. ఇతనిని ౫ సంవత్సరముల కొక పర్యాయము కేంద్రశాసనసభల సభ్యులు, ప్రత్యేకరాజ్యములందలి శాసనసభలలో ప్రజలచే ఎన్నుకొనబడిన సభ్యులు కలిసి ఎన్నుకొనెదరు. ఇతనికి ౩౫ సంవత్సరములకంటె తక్కువ వయస్సు ఉండరాదు. ఎవరుగాని రెండు పర్యాయములకంటె ఎక్కువ అధ్యక్షపదవికి ఎన్నుకొనబడరాదు. ౫ సంవత్సరములమధ్య అధ్యక్షపదవినుండి ఇతనిని కేంద్రశాసనసభవారు తొలగింపవచ్చును. కాని ఇతడు రాజ్యాంగచట్టమును ఉల్లంఘించెనని రుజువైనప్పుడే అట్లు తొలగించుట కవకాశము కలదు. ఇతనికి నెలకు రు ౫,౫౦౦ లు జీతము. (ఇప్పటి గవర్నరు జనరలుకు నెలజీతము రు ౧౦,౦౦౦.)

ఇదిగాక సంయుక్తరాజ్యమున కొక ఉపాధ్యక్షుడుకూడ నుండును. ఇతనిని కేంద్రశాసనసభ్యులు మాత్రమే ౫ సంవత్సరముల కొకపర్యాయము ఎన్నుకొనెదరు. అవసరమువచ్చినప్పుడు అధ్యక్షస్థానమునకు వచ్చుటయేగాక ఇతడు కేంద్రశాసనసభ కొక శాఖయైన రాజ్యప్రతినిధుల శాఖకు అధ్యక్షుడు.

సంయుక్తరాజ్యమునకు సంబంధించిన కార్యకలాపముపై అధికార మంతయు (పేరునకు) అధ్యక్షునిదే. కాని ఈ అధికారమునంతను ఇతడు మంత్రుల సభయొక్క సలహాను అనుసరించి నడుపవలసినవాడే కాని వారిని కాదని స్వతంత్రించి నడుపుటకు వీలులేదు. అధికారమంతయు మంత్రుల సభదే. ఈ మంత్రులు శాసనసభలోని ప్రజాశాఖయొక్క విశ్వాసమునకు పాత్రులుగ నున్నవారే. అందుచేత ఈ విధానమునకు బాధ్యతాయుతప్రభుత్వవిధాన (Responsible Government) మని పేరు. అనగా, శాసనసభకు బాధ్యులైన మంత్రుల ప్రభుత్వ మని దీని అర్థము. బ్రిటిషుసంప్రదాయ మిదియే. వారినుండి మన మీ విధానమును స్వీకరించితిమి.

మంత్రుల సభలో ఒక ప్రధానమంత్రియు, తక్కిన సామాన్యమంత్రులును ఉందురు. ప్రధానమంత్రిని అధ్యక్షుడు నియమించును. తక్కిన మంత్రులనుగూడ అతడే నియమించును గాని ప్రధానమంత్రిసలహామీదటనే వారిని అతడు నియమింపవలెను. ఈ మంత్రులు ప్రధానియొక్క నాయకత్వమున సమిష్టిబాధ్యతతో వ్యవహారములను జరుపవలెను. సాధారణముగ కేంద్రశాసనసభలో సభ్యులు కానివారు మంత్రు లగుటకు వీలులేదు. ఒక్కొక్కసమయమున అట్టివారు మంత్రులైనను ౬ నెలలలోపల వారు శాసనసభలో సభ్యులు కావలెను. అట్లు కానప్పుడు వారు మంత్రిపదవులను వదలుకొనవలెను. వారి జీతములను నిర్ణయించుటకు కేంద్రశాసనసభకే అధికారము.

## (గవర్నరు) రాజ్యకార్యవర్గశాఖ

సంస్థానముల వర్గమునకు చెందని ప్రతిరాజ్యమునకు ఒక గవర్నరుండును. ఇతని నియామకమునుగురించి ప్రణాళిక ఇదమిత్థమని నిర్ణయించలేదు. రాజ్యములోని ప్రజలందరు కలిసి ఎన్నుకొనుట ఒక మార్గమనియు, రాజ్యములోని శాసనసభవారు నలుగురిని ఎన్నుకొనుట, ఆ నలుగురినుండి ఒకనిని సంయుక్తాధ్యక్షుడు గవర్నరుగ నియమించుట మరియొక మార్గమనియు ప్రణాళిక సూచించుచున్నది. ఇందులో రెండవమార్గమే అనుసరణీయము. బాధ్యతాయుతులగు మంత్రుల ద్వారా రాజ్యపరిపాలనము జరుగవలసియున్నప్పుడు ప్రజల మూలమున అధికారములోనికి వచ్చినవారిద్దరు కార్యనిర్వాహమునకు బాధ్యులై ఉండుట ప్రమాదకరము. వారిమధ్య సంఘర్షణ తప్పదు. కనుక ఒకరు ప్రజామోదమును పొందినవారు, రెండవవారు మరొక మార్గమున అధికారములోనికి వచ్చువారుగను ఉండుట మంచిది. బ్రిటిషుసంప్రదాయము ననుసరించిన కనడా, ఆస్ట్రేలియా మొదలగు దేశములందు ఇదియే ఆచారము. మంత్రులు ఏలాగైనను ప్రజామోదమును పొందినవారుగ నుండుట తప్పదుగనుక గవర్నరును ప్రజ లెన్నుకొనుటకు బదులు సంయుక్తాధ్యక్షుడు నియమించుట ఉత్తమము. అట్టి సందర్భములో రాజ్యశాసనసభ నలుగురిని ఎన్నుకొనవలె ననుసూచనకూడ అనవసరము. గవర్నరు ఉద్యోగపరిమితికూడ ౫ సంవత్సరములే. ఎవరుగాని రెండుపర్యాయములకంటె ఎక్కువ గవర్నరుగా నుండరాదు. వయస్సు ౩౫ సంవత్సరములకు తగ్గరాదు. ౫ సంవత్సరములమధ్య గవర్నరును ఉద్యోగమునుండి తొలగించుటకు అవకాశమున్నది.

కేంద్రమున మంత్రుల సభ ఉన్నట్లే ప్రతిరాజ్యమందును ఒక మంత్రులసభ ఉండును. ప్రధానమంత్రిని, తక్కిన మంత్రులను నియమించుటలో అధ్యక్షునికంటె గవర్నరుకు ఎక్కువ స్వాతంత్ర్యమున్నట్లు ప్రణాళిక సూచించుచున్నదిగాని స్పష్టముగ చెప్పుట లేదు. కాని మొత్తముమీద రాజ్యప్రభుత్వముకూడ బాధ్యతాయుత ప్రభుత్వమే. శాసనసభయొక్క విశ్వాసము లేనివారు మంత్రులుగ నుండుటకు వీలుండదు. సామాన్యముగ వారి సలహాను అనుసరించియే గవర్నరు రాజ్యమును పాలించవలెను.

సంయుక్తాధ్యక్షునికిని, గవర్నరుకును ఒక విషయములో కొంత భేదమున్నది. మంత్రుల సలహాలను అనుసరించక అధ్యక్షుడు ఎట్టి పరిస్థితులలోకూడ వ్యవహరించుటకు వీలులేదు. గవర్నరు అట్లుగాక కొన్ని పరిస్థితులలో మంత్రుల సలహాను అతిక్రమించి నడుచుకొనవచ్చును. రాజ్యముయొక్క శాంతికి భంగకరమైనట్టి ప్రమాదస్థితి వచ్చినదనిగాని, రాబోవుచున్నదనిగాని తోచినప్పుడు మంత్రుల సలహానుగాని, రాజ్యాంగప్రణాళికలో రాజ్యమునకు వర్తించు తక్కిన చట్టములనుగాని గమనించకయే గవర్నరు సర్వాధికారమును తానే చలాయించవచ్చును. యుద్ధకాలమందు రాష్ట్రములనుండి కాంగ్రెసు మంత్రివర్గమువారు ౧౯౩౯ లో రాజీనామా ఇచ్చిన తర్వాత గవర్నరులు సర్వస్వతంత్రులైనట్లే స్వతంత్రభరతఖండమందుకూడ గవర్నరునిరంకుశత్వమున కవకాశమున్నది. కాని ఇట్టి ప్రమాదస్థితి సంభవించినట్లు అతడు సంయుక్తాధ్యక్షునికి వెంటనే తెలియజేసి అతని ఆజ్ఞానుసారము ప్రవర్తించవలెను.

## శాసన శాఖ

ఈ కాలపు పరిపాలనవిధానమునకంతకు క్రొత్త క్రొత్త శాసనములను, చట్టములను చేయుచుండుట ఒక లక్షణము. మన పూర్వులు ఇట్లు చేయువారు కారు. సనాతనముగ వచ్చుచున్న సంప్రదాయములను, ఆచారములను మార్చకూడదనియే వారు భావించుచుండువారు. శాసనములను చేయదగినవారు ప్రజాప్రతినిధులే అని అనుకొనుటకూడ ఈ కాలపు రాజ్యాంగమున కొక లక్షణము. దీని ననుసరించి సంయుక్తకేంద్రమందొక శాసనసభయు, ప్రతి గవర్నరు రాజ్యమందొక శాసనసభయు ఉండును. కేంద్రశాసనసభలో ప్రజాశాఖ అని, రాజ్యముల శాఖ అని రెండు శాఖలు తప్పక ఉండవలెను. రాజ్యశాసనసభలో రెండు శాఖలు ఉండవలసిన జరూరు లేదు. ఆయా రాజ్యములవారి ఇష్టానుసారము వారు చేయవచ్చును. అందుచేత కొన్ని రాజ్యములలో రెండు శాఖలతో కూడిన శాసనసభలు, కొన్నిటిలో ఒకే శాఖగల సభలు ఉండును. కేంద్రమందును, రెండు శాఖలుగల రాజ్యములందును ఒక శాఖలో వయోజనులందరు సమిష్టినియోజకవర్గములద్వారా ఎన్నుకొనిన ప్రతినిధు లుండురు. అట్టి శాఖకు ప్రజాశాఖ యను పేరుండును. కేంద్రమందలి రెండవది యగు రాజ్యప్రతినిధిశాఖలోని సభ్యులలో ౧౫ మందిని మాత్రము సంయుక్తాధ్యక్షుడు పేర్కొనును. తక్కిన ౨౩౫ సభ్యులను వారి నిర్ణీతదామాషాప్రకారము ఒక్కొక్క రాజ్యములో ప్రజలచే ఎన్నుకొనబడిన శాసనసభాసభ్యులు ఎన్నుకొనెదరు. ఇదే విధముగ రెండు శాఖలతో కూడిన శాసనసభలుగల రాజ్యములందు ప్రజాశాఖలోని ప్రతినిధులను రాజ్యములోని వయోజనులందరు ఎన్నుకొనెదరు. రెండవ శాఖలోని సభ్యులలో మూడవవంతును ప్రజాసభవారు ఎన్నుకొనెదరు. తక్కినవారిని గవర్నరు పేర్కొనును.

కేంద్రమందును, రాజ్యములందును ఉండు రెండు శాసనసభాశాఖలయొక్క నిర్మాణమందును, అధికారములందును కొంత భేదమున్నది. ప్రజాశాఖకు ౫ సంవత్సరముల కాలపరిమితి కలదు. ఆటు తర్వాత ఆ శాఖ రద్దగుటయు, అందులో సభ్యుల నందరిని ప్రజలు తిరిగి ఎన్నుకొనుటయు జరుగును. రెండవ శాఖకు కాలపరిమితి లేదు. అది శాశ్వతముగ నుండునది. ఎప్పుడుగూడ అందులోని సభ్యులందరు ఏకకాలమున సభ్యత్వమును వదలుకొనరు. మూడవ వంతు మాత్రము కేంద్రమున ౨ సంవత్సరముల కొక పర్యాయమును, రాజ్యములలో ౩ సంవత్సరముల కొక పర్యాయమును సభ్యత్వమును కోల్పోయెదరు. ఆ ఖాళీలు మాత్రమే భర్తీ అగుచుండును. అధికారములో కూడ ఈ రెండు శాఖలకు భేదమున్నది. ఆదాయవ్యయములకు సంబంధించిన చట్టములన్నిటిలో ప్రజాశాఖకే సంపూర్ణాధికారము. రెండవ శాఖయొక్క ఆమోదము అంత అవసరము కాదు. తక్కిన చట్టముల విషయమున మాత్రము రెండు శాఖలకు సమానత్వమున్నది.

శాసనశాఖనుగురించి పేర్కొనవలసిన విశేష మింకొకటి మాత్రమే కలదు. కేంద్రమందు శాసనసభవారు ఆమోదించిన చట్టములు అధ్యక్షుని ఆమోదము పొందిన తర్వాతగాని శాసనములు కాజాలవు. కాని సాధారణముగ అతడీ చట్టములకు సమ్మతి చూపుట అవసరమగును. లేని పక్షమున బాధ్యతాయుతప్రభుత్వవిధానము

జరుగజాలదు. ఇదేవిధముగ గవర్నరుయొక్క ఆమోదము లేక సాధారణముగ రాజ్యశాసనసభవారి బిల్లులు చట్టములు కాలేవు. కాని కొన్ని సందర్భములలో అతని ఆమోదము లేకున్నను, అతని ఆక్షేపణలను విమర్శించి శాసనసభవారు బిల్లులను చట్టముల జేయవచ్చును. కొన్ని వ్యవహారములకు సంబంధించిన బిల్లులను గవర్నరు సంయుక్తాధ్యక్షుని ఆమోదమునకుకూడ పంపవచ్చును.

ఈ వివరము లన్నియు శాసననిర్మాణసందర్భములో కొన్ని చిక్కులను కలిగించునవిగా నున్నవి. శాసనసభవారు ఆమోదించిన బిల్లులను ఆక్షేపించుటకుగాని, పునర్విమర్శచేయుమని అడుగుటకుగాని అధ్యక్షునికి, గవర్నరులకు అధికారము లేకుండుటయే ఉత్తమ మార్గము. ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులతో కూడుకొన్న శాసన సభలును, వాటికి బాధ్యులుగ నుండు మంత్రులును కలిసి ఆలోచించి ఆమోదించిన చట్టములను మరెవ్వరు ఆమోదించవలసిన జరూరు ఉండరాదు.

## న్యాయశాఖ

ప్రతిరాజ్యాంగమందును న్యాయశాఖ ఒకటి ఉండవలెను. శాసనసభవారు గావించిన చట్టములు ఎవరెవ్వరి విషయములో, ఎట్టి సందర్భములలో, ఏ విధముగా వర్తించునో నిర్వచించుటయే ఇది చేయవలసిన పని. వికేంద్రీకృతసంయుక్తరాజ్యములో న్యాయశాఖ చేయవలసిన పని ఇంకొకటి ఉన్నది. కేంద్రప్రభుత్వమువారు చేయు చట్టములు రాజ్యముల అధికారమునకు విరోధము కాకుండునట్లును, రాజ్యములలోని శాసనసభలు చేయు చట్టములు కేంద్రపు అధికారమునకు విరోధము కాకుండునట్లును వాటివాటి హద్దులలో వాటిని ఉంచుటయే ఈ పని. ఇదిగాక రాజ్యమునకు రాజ్యమునకును, కేంద్రమునకు రాజ్యమునకును వివాదములు సంభవించి, ఆ వివాదములను చట్టానుసారముగ పరిష్కరించవలసిఉన్నప్పుడు ఆ పని చేయగలది ఒక న్యాయశాఖయే. ప్రజల ప్రాథమికహక్కులకు విరుద్ధముగ శాసనసభలుగాని, కార్యనిర్వాహకశాఖవారుగాని ప్రవర్తింపకుండ, ఆ హక్కులను కాపాడుటకుకూడ న్యాయశాఖ అవసరము. ఈ అవసరముల నన్నిటిని గుర్తించి రాజ్యాంగప్రణాళికలో న్యాయశాఖకు సంబంధించిన ఏర్పాటు లనేకములు చేయబడినవి. వీటిలో కేంద్రమందు స్థాపింపబడిన సుప్రీంకోర్టు, ప్రతిగవర్నరు రాజ్యమందు స్థాపింపబడిన హైకోర్టులు ముఖ్యముగ గమనింపదగియున్నవి.

సుప్రీంకోర్టు కోర్టులన్నిటిలో అగ్రస్థానము వహించినది. ఇందు ఒక ప్రధానన్యాయమూర్తియు, ఏడుగురికి తక్కువగాక తక్కిన న్యాయమూర్తులు ఉండెదరు. ఇంతకంటె సంఖ్య హెచ్చు కావలసినపుడు కేంద్రశాసనసభ దానిని హెచ్చుచేయవచ్చును. న్యాయమూర్తులను నియమించు అధికారము అధ్యక్షునికి ఇయ్యబడినది. ఈ నియామకము చేయుటలో అతడు తక్కిన న్యాయమూర్తులతోను, రాజ్యములలోని హైకోర్టులందలి న్యాయమూర్తులతోను సంప్రతించవలెను. ఒక పర్యాయము నియమింపబడిన న్యాయమూర్తి ౬౫ సంవత్సరముల వయస్సు వచ్చువరకు ఉద్యోగములో ఉండవచ్చును. ఉద్యోగమునుండి ఏ న్యాయమూర్తినిగాని తొలగించుటకు అధ్యక్షునికి అధికార మున్నను ఆ అధికారమును అతడు కేంద్రశాసన సభవారు కోరినప్పుడే చెలాయించుటకు వీలున్నది. కనుక న్యాయమూర్తులకు తమ ఉద్యోగము పోవు నను భయము ఉండవలసిన జరూరు లేదు. వారి జీతములను ఈ రాజ్యాంగప్రణాళికయే నిర్ణయించుచున్నది. అందులో శాసనసభ మార్పులు గావించవచ్చును గాని, ఆ మార్పులు అప్పట్లో అధికారమందుండు న్యాయమూర్తులకు నష్టకరముగ వర్తించరాదు. కనుక తమ జీతములు తగ్గిపోవునను భయముకూడ న్యాయమూర్తులకు ఉండవలసినది లేదు. ఇట్టి సదుపాయము లుండుటచేత న్యాయమూర్తులు వారి విధులను నిష్పక్షపాతముగను, నిర్భయముగను నిర్వర్తించువారగుచున్నారు. రాజ్యములలోని హైకోర్టులలోని న్యాయమూర్తుల విషయములో ఈలాంటి ఏర్పాటులే చేయబడియున్నవి. ఈ హైకోర్టులనుండి అప్పీళ్లు సుప్రీం కోర్టుకు పోగలవు. ఇంగ్లండులోని ప్రివీకౌన్సిలుతో మన కేలాటి సంబంధము ఉండదు.

కెనడా, ఆస్ట్రేలియా మొదలగు రాజ్యములలోని హైకోర్టులకు సంబంధించిన మంచి ఏర్పాటులను కొన్నిటినికూడ మన రాజ్యాంగప్రణాళికయందు చేర్చియున్నారు. మొత్తముమీద న్యాయ పరిపాలన చక్కగ జరుగు నను నమ్మకము కుదురుచున్నది.

## తక్కిన శాఖలు

ఉద్యోగశాఖనుగురించిగాని, ఆదాయవ్యయవ్యవహారములను గురించిగాని ప్రత్యేకముగ నిచ్చట పేర్కొనదగిన విశేషములేవియు లేవు. ౧౯౩౫ సం.పు చట్టము ననుసరించియే ఈ సందర్భమున మన రాజ్యాంగప్రణాళిక తయారుచేయబడినది. ఆదాయవ్యయములను గురించి ఏవైన మార్పులు అవసరమైనయెడల వాటి నన్నిటిని పరిశీలించుటకు ౫ సంవత్సరములైనతర్వాత ఒక సంఘమును సంయుక్తాధ్యక్షుడు నియమించవలసినదిగా ప్రణాళిక సూచించుచున్నది. ఆ సంఘముయొక్క సిఫార్సులనుబట్టి మన భావిఆర్థికపద్ధతి నిర్ణయమగును. ఇదేవిధముగ మద్రాసు, అస్సాం మొదలగు రాష్ట్రములలోని మన్యప్రాంతములలో నివసించు కొండజాతులవారి రక్షణకై అత్యవసరములైన ప్రత్యేకఏర్పాటులు కొన్ని చేయబడినవి. ప్రజలందరి యోగక్షేమముల ననుసరించి ఈ ప్రణాళిక తయారుచేయబడిన దని అనుకొనుటకు ఇది యొక ఉదాహరణము.

## ఉపసంహారము

మొత్తముమీద మన క్రొత్తరాజ్యాంగప్రణాళిక తృప్తికరముగ నున్నదని చెప్పవచ్చును. ఇందులో లోపములు లేకపోలేదు. ఇప్పుడు మనకు కనిపించని లోపము లనేకములు కాలక్రమమున కనిపించవచ్చును. అనుభవముమీదగాని ఏయేలోపము లున్నవో చెప్పలేము. లోపములు కనిపించినప్పుడు వాటిని సవరించుకొనుటకు ప్రణాళిక మార్గము నొకదానిని సూచించియున్నది. అది సులభమైన మార్గము. దాని ననుసరించినయెడల ప్రణాళిక కాలానుసారముగ మన అవసరములనుబట్టి మారగలదు. ఈ ప్రణాళికను ఆధారము చేసికొని, దీని ఉద్దేశముల ప్రకారము అధికారమునకు వచ్చువారు వారివారి విధులను నిర్వర్తించినయెడల ప్రజలందరికి సుఖము కలిగి, వారి శ్రేయస్సు, భోగభాగ్యములు వృద్ధికాగలవు.

---

# ఆంధ్రబ్యాంకు లిమిటెడ్,

(స్థాపితము 1923)

## హెడ్డాఫీసు: మచిలీపట్టణం

| | | | |
|---|---|---|---|
| అధికారము పొందబడిన మూలధనం | ... | రు. | 1,00,00,000 |
| చందా వేయబడి, జారీచేయబడిన మూలధనం | ... | ,, | 50,00,000 |
| చెల్లించబడిన మూలధనం | ... | ,, | 25,00,000 |
| రిజర్వుఫండు వగైరా | ... | ,, | 8,45,220 |
| డిపాజిట్లు | ... | ,, | 4,00,00,000 పైగా |
| అమలులోవున్న వ్యాపారం మొత్తం | ... | ,, | 5,00,00,000 పైగా |

## బోర్డు ఆఫ్ డైరెక్టర్లు:

1. శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహదూర్ జమీందారుగారు, (ఛైర్మన్) 2. శ్రీ తాడేపల్లి శ్రీరాములుగారు (మేనేజింగు డైరెక్టరు) 3. శ్రీ పిల్లారిశెట్టి పార్థసారథినాయుడుగారు, 4. శ్రీ కటవర్తి నాగపోతరావుగారు, 5. శ్రీ దారా విశ్వేశ్వరరావుగారు, 6. శ్రీ మద్ది సుదర్శనంగారు, 7 శ్రీ మాకేటి శేషగిరిరావుగారు, 8 శ్రీ దంటు సూర్యారావుగారు, 9 శ్రీ పాలపర్తి శోభనాద్రిగారు, 10. శ్రీ కపాక సత్యనారాయణమూర్తిగారు, 11. శ్రీ కల్లు మణిక్యాలరావుగారు, 12 శ్రీ కర్లపూడి సుబ్బారావునాయుడుగారు.

**మదరాసు బ్రాంచి:**
బాంబేమ్యూచుయల్ బిల్డింగ్సు
373, ఎస్ప్లనేడ్.

**సికింద్రబాదు బ్రాంచి:**
మెహతా మహల్
జేమ్సు వీధి.

## ఇతర బ్రాంచీలు—సబ్ ఆఫీసులు

మచిలీపట్టణం, నెల్లూరు, తెనాలి, గుంటూరు, బెజవాడ, ఏలూరు, రాజమండ్రి, కాకినాడ, విశాఖపట్టణం, విజయనగరం, బరంపురం, (గంజాం), ఒంగోలు, చీరాల, దగ్గిరాల, గూడూరు, (నెల్లూరు), నరసారావుపేట, వినుకొండ, రండల్ పేట, (గుంటూరు), గవర్నరుపేట, (బెజవాడ) గుడివాడ, పాలకొల్లు, భీమవరం, సామర్లకోట, రామారావుపేట, (కాకినాడ) పిఠాపురం, తుని, అనకాపల్లి, చికాకోల్ (వైజాగ్) జయపూర్ (ఒరిస్సా) పెద్దాపురం, అమలాపురం, ఆముదాలవలస, తిలారు, సాలూరు, పెడన, చల్లపల్లి, మహారాణిపేట, (వైజాగ్) గొల్లప్రోలు, జగ్గయ్యపేట (కృష్ణా.)

ఫిక్సెడ్ డిపాజిట్లు:—నూరురూపాయలకు తక్కువగాని మొత్తములను 3, 6, 12, 24 మాసములకు అన్ని బ్రాంచీలలోను తీసుకొనబడుచున్నవి. 3 సంవత్సరముల క్యాషుసర్టిఫికెట్లు ఈ బ్యాంకులో ప్రత్యేక సౌకర్యము. అన్నిరకముల చెక్కులు, డ్రాఫ్టులు, డివిడెండు వారంట్లు, హుండీలు వసూలుచేసి పెట్టబడును.

గవర్నమెంటు పత్రములు, షేర్లు, కొనుట, అమ్ముట మొదలగు వ్యాపారములు కూడ చేయబడును.

వివరములు ఏ ఆఫీసులోనైనను తెలిసికొనవచ్చును.

తాడేపల్లి శ్రీరాములు,
మేనేజింగు డైరెక్టరు.

వారణాసి కృష్ణమూర్తి,
ఎం. ఏ., బి. కాం., ఎల్. ఎల్. బి., సి. ఎ. ఐ. ఐ. బి.
జనరల్ మేనేజరు.

# భూమిశిస్తు, భూమిసాగు సంస్కరణలు

శ్రీ కళా వెంకటరావు

ఆర్థికవిధానములోని మార్పులును, నాగరికతా పరిణామమును రైలుపట్టాలవలె ఒకదానిని ఇంకొకటి అనుసరించి పోవుచుండుట ప్రపంచచరిత్రే నిరూపించుచున్నది. ప్రాచ్యదేశములలో అనుశ్రుతమైన పద్ధతి భూములను వంశపారంపర్యా ఎక్కువగా పంపకము చేయుటకు అనుకూలముగా ఉండుటయేగాక మేతబయళ్లు, చెరువులు, నీటిపారుదల సాముదాయికముగా ఉపయోగించుకొనుట సాంప్రదాయసిద్ధమైనది. భారతదేశములోని ప్రజాసామాన్యము భూమిపైననే ఆధారపడి, గ్రామపంచాయతీ మూలముగా కార్యనిర్వహణ సాగించుకొనుచుండును. పరిపాలనలోని మార్పులవలన ఈ స్థిరసంస్థలు కాలగర్భములో ఇమిడిపోయినవి. సాముదాయికస్వామ్య మను సమిష్టిపద్ధతిపైన నిర్వహించబడు సాముదాయికపు ఆస్తులన్నియు నశించుటతోడనే రైతు అనాథయై ఒకవైపు శిస్తుగ్రాహకుని యొక్కయు, రెండవవైపు అప్పిచ్చువానియొక్కయు మధ్య పడి నలిగిపోవుట తటస్థించినది. రైతునకు కావలసిన కార్యసాధనములు (నాగళ్లువగైరా), మంచివిత్తనములు, ఆదాయము నిచ్చు పంటలు దూరమైనవి. అతని ఆస్తి చిన్నదైయుండుటయు, అతని పరపతి స్వల్పమైయుండుటయు ఈ పరిస్థితికి కారణము.

కాలము, ఋతువులు, వర్షపాతము చేరి మనుష్యుని దైనికస్వభావనిర్ణయమునకు కారణభూతము లగును. జపానుదేశములో నాల్గింట మూడువంతులు పర్వతప్రదేశము. మిగిలిన కాలుభాగము పంట కొరకు. అత్యద్భుతమైన శ్రద్ధతోను, మంచి పట్టుదలతోను పండించుటకొరకు ఆ దేశస్థులు కృషి చేయుచున్నారు. ఈ కష్టపరిస్థితులవలన వారిలో మితవ్యయము, సహనశక్తి, స్వశక్తిపై ఆధారపడుట మొదలగు సుగుణములు పెంపొంది రైతుయొక్క గౌరవమును అభివృద్ధి చేసినవి. ఇండియా, ఇండోచీనా, కొరియా, జపాను, తూర్పు దక్షిణభూభాగములోని ద్వీపములు మొదలగు ప్రాచ్య రాజ్యములన్నింటిలో ప్రపంచములోని మొత్తము జనాభాలో సుమారు సగముమంది నివసించుచున్నారు. కాని ఈ భూభాగము ప్రపంచవైశాల్యములో పదింట ఒక భాగము అయియున్నది. అందువలన మనుజుని బుద్ధికుశలత . చేకూర్చగలిగిన హస్తకళాకౌశల్యమంతయు ఈ ప్రాంతములో వ్యవసాయపురోభివృద్ధికి

వినియోగించబడుచున్నది. ఈ జాతులన్నియు సహజ స్వభావపరిస్థితులను, పంటలనన్నింటిని ప్రాంతీయ స్వభావ పరిస్థితులకు అనువర్తింపజేసినవి. హెచ్చు జనాభా గల ప్రదేశములకు ధాన్యపుపంటయే ఉత్తమమైన పంట యని చరిత్ర నిరూపించుచున్నది. తక్కువ జనాభా గల ప్రదేశములలో ధాన్యపు పంట అభివృద్ధి చెందనేరదు. ఎందువల్ల ననగా, పంట పండించుటకు అనువైన కాలము పరిమితము. పరిమితకాలములోనే హెచ్చుమంది ప్రజలు కాయకష్టపడి పంట పండించవలసియుండును. గ్రామపంచాయతీలు ఏర్పడి, సాముదాయిక ప్రయోజనముకొరకు అట్టి భూవిధానమును ఏర్పాటుచేయుటలో తోడ్పడినవి.

### మన కర్తవ్యము

నేడు ఈ పరిస్థితులన్నియు మారినవి. నాగరికతా ప్రవాహము మారినది. సంస్కృతియొక్క స్వభావము మారినది. పరిస్థితుల మార్పుల కనుగుణముగా కాలప్రవాహముతోబాటు మన భూములను, పంటలను, పరిపాలనావిధానమును, శిస్తువిధానమును మార్చుకొనుటయే లాభకరము కావున ఈ మార్పుల స్వభావమును గుర్తించి మనము ఒక సమగ్రమైన భూమిశిస్తువిధానము సృష్టించుకొనుట చాల అవసరము. భూమిశిస్తును పండిన పంటలో రాజభాగము అని నిర్వచించవచ్చును. రాజభాగ మనగా పండిన పంటలో రాజువల్ల తీసుకొనబడు భాగము. మొగలాయిరాజ్యము వచ్చిన పిమ్మట ఈ వస్తురూపకమైన భూమిశిస్తును ధనరూపకముగా మార్చిరి.

భూమిశిస్తువిధానములను పలువిధములుగా విభజించవచ్చును.

I పన్ను ఎవరివద్దనుండి వసూలు చేయబడుచున్నదో వారియొక్క ప్రతిపత్తినిబట్టి విభజించవచ్చును:

(౧) రాజుతరఫున రైతునుండి పన్ను వసూలు చేయుటకొరకు మధ్యవర్తి ఉన్నచో దానిని జమీందారీపద్ధతి అనెదరు.

(౨) భూమిని పట్టాలక్రింద విభజించి అట్టి పట్టాదారువద్దనుండి పన్ను వసూలుచేయుచో రైతువారీ పద్ధతి అనెదరు.

II నిర్ణయింపబడిన శిస్తు స్థిరరూపకమైనదా, కొన్ని సంవత్సరములకు మాత్రమే నిర్ణయింపబడినదా అనే విషయముపైకూడ భూమిశిస్తు విధానము ఆధారపడియున్నది.

### జమీందారీలు

జమీందారీలలో రెండురకములు గలవు—బంగాళము, బీహారు, మద్రాసు, సంయుక్త రాష్ట్రములలో కొన్ని భాగములపైన స్థిరరూపకమైన శిస్తువిధానము గల జమీందారీలు ఉన్నవి. సంయుక్త రాష్ట్రములలో చాల భాగము అసలు జమీందార్లకు చెందినను సెటిల్‌మెంటులు మాత్రము ప్రతి ౨౦, ౩౦ సంవత్సరములకు చేయబడుచున్నవి గలవు. వీనిని తాలూకాదారీలు అనెదరు. మధ్య రాష్ట్రములలో 'మాల్‌గుజారీ' అనే పద్ధతి ఉన్నది. ఇక్కడ సెటిల్‌మెంటు ఎస్టేటులపైగాక గ్రామములవారీ చేయబడియున్నది.

భూమిశిస్తువిధానమునకు సర్వే సెటిల్‌మెంటులు ముఖ్యమైన ఆధారములు. భూమి సర్వేని కెడస్ట్రల్ (Cadastral) సర్వే అనెదరు. ఈ సర్వేలో భూమియొక్క నిమ్నోన్నతములను, పర్వతములను, అడవులను, రాస్తాలను, కాలువలను, చెరువులను, తోటలను, గృహములను, పంటభూములను, పోరంబోకలను నిర్ణయించెదరు. ప్రతి పొలముయొక్క సరిహద్దును సుస్పష్టము చేసెదరు. పొలమనగా సాధారణముగా ఒక యకరము మాగాణిగాని, రెండుయకరముల మెట్టగాని అయియుండును. ఇంతకంటె తక్కువ విస్తీర్ణము గల భూములను సబ్ డివిజనులుగా గుర్తించెదరు. స్థిరమైన సర్వేరాళ్ళను వేసినపిమ్మట ప్రతి పొలమును సూచించు గ్రామముల ప్లానులను, తాలూకామ్యాపులను తయారుచేసెదరు.

### సెటిల్‌మెంటు

పైన చెప్పబడినట్లు సర్వేచేయబడిన పొలములపై పన్ను విధించు విధానమునే సెటిల్‌మెంటు అనెదరు. మద్రాసు రాజధానిలో సెటిల్‌మెంటు పద్ధతిని చాల శాస్త్రీయముగా చేయవలసియున్నది. ఒక పొలముపై పన్ను విధించుటకు ముందు అనేక విషయములపై పరిశోధన చేయవలసి యుండును. భూములను వానియొక్క సారమునననుసరించి కొన్ని తరగతుల క్రింద

విభజింపవలెను. ఇట్టి భూములలో వేయు పంట, పంట పరిమాణమును నిర్ణయింప వలెను. పలురకములైన సారము ననుసరించి ఇందులో పండు పంటను కొన్ని ప్రదేశములలో కొలచికూడ చూడవలెను. పంటపండు భూములకుదగ్గరగా రోడ్లు వగైరా వసతులు, నీటిపారుదల వసర్లు ఉన్నవో, లేవో చూడవలెను. కాలములోని మార్పులవలన, అతివృష్టి అనావృష్టిదోషములవలన కలుగబోవు నష్టములనుకూడ ఈ సందర్భములో గుర్తింపవలెను. ఇట్లు అంచనా వేయబడిన పంట మొత్తమునకు ధర నిర్ణయింపవలెను. అట్టి ధర సెటిల్ మెంటు జరుగు సంవత్సరమునకుముందు ౨౦ కరువు కాని సంవత్సరముల సగటుధరలపై ఆధారపడిఉండును. ఇట్లు నిర్ణయింపబడు మొత్తములో వ్యవసాయపు ఖర్చులను తీసివేసి మిగిలిన మొత్తములో సగము భాగమును ప్రభుత్వము పన్నుక్రింద తీసుకొనవచ్చును. కాని రీసెటిల్ మెంటునకు, అనగా ౩౦ సంవత్సరముల తరువాత తిరిగి సెటిల్ మెంటు జరుగునప్పుడు హెచ్చు చేయవలసిన మొత్తము మాత్రము నూటికి ౧౮-౧౨-౦ కి మించకూడదని నిర్ణయింపబడినది. ఇచట వివరించిన సంగతులు క్లుప్తమైనవి. ఇట్లు ౧౯౧౦ సం. మొదలు ౧౯౩౨ వరకు శాస్త్రీయమైన రైతువారీ సెటిల్ మెంటు జరిగినది. కాని ౧౯౩౨ సంవత్సరము దరిమిలాను సర్వే సెటిల్ మెంటులు నిలిపి వేయబడినవి. కొలది జమీందారీలలో మాత్రమే సర్వే సెటిల్మెంటులు గలవు. జమీందారీలలో చాలభూభాగములు సర్వేకూడ కాలేదు.

ఈ వ్యాసములో జమీందారీ విధానమును గురించి హెచ్చుగా వ్రాయదలచలేదు. దీనికి ముఖ్యమైన కారణము జమీందారీవిధానము త్వరలో రద్దు కానున్నది. కనుక మద్రాసు ప్రభుత్వము జమీందారీల లోని సామువాయికభూములను, కమతంభూములను ఇతరులకు అన్యాక్రాంతము చేయకూడదని చట్టము చేసినారు. తరువాత జమీందారీగ్రామములలోని పన్నురేటును అతరాపురైతువారీ భూముల పన్నురేటుకు తగ్గించు చట్టముకూడ చేయబడినది. అసలు జమీందారీ రద్దుబిల్లు శాసనసభయెదుట ఉన్నది. త్వరలో శాసనము కాగలదు. అందువలన వాటినిగురించి తిరిగి ఈ చిన్నవ్యాసములో పునర్విమర్శించు ఆవశ్యమును ఎంచలేదు.

రెండు తరగతుల భూములు

ఈ రాజధానిలో రైతువారీ ప్రదేశము ౨ కోట్ల ౮౦ లక్షల ఎకరము లున్నది. ఈప్రదేశమంతయు సర్వే చేయబడి సెటిల్ మెంటు చేయబడినది. ఇచట భూములు రెండుతరగతులుగా ఉన్నవి—జలాధారములుగలవి; జలాధారము లేనివి. కొన్ని భూములు వర్షాధారములు. వానిని 'మానవరి' అనెదరు. ఈ ప్రదేశములలో సుప్రసిద్ధమైన గోదావరి, కృష్ణ, కావేరి మొదలగు నదులపై ఆనకట్టలు నిర్మించి నీటి పారుదల సౌకర్యములు కల్పింపబడినవి. ఇంతేగాక పలు చిన్ననదులపై కల్పింపబడిన నీటివనరులుగలవు. ఈ వసర్లు నరిపోక ఇంకను పలు కార్యక్రమములను అమలులోనికి తీసుకొని రావలెనని ప్రభుత్వమువారు ప్రయత్నించుచున్నారు. తుంగభద్ర, రామపాదసాగర్, కృష్ణ, పెన్నార్, లోయర్ భవాని, పేరూరు మొదలగునవి పెద్ద స్కీములు. వంశధారా, నాగావళీ మొదలగు స్కీములు కూడ ఆలోచనలో ఉన్నవి. కొన్ని జిల్లాలలో ముఖ్యమైన నీటివనరులు కల్గించగల్గిన జీవనదులు లేవు. స్కీములలో మైనర్ ఇరిగేషన్, మేజర్ ఇరిగేషన్ అను రెండురకములు గలవు. ప్రభుత్వమువారు ఈ సంవత్సరము మైనర్ ఇరిగేషన్ నిమిత్తము గత సంవత్సరపు బడ్జెటులోకంటె రెట్టింపు మొత్తమును ప్రత్యేకించినారు. అసలు తటాకములను తిరిగి మరమ్మతుచేయుటకు టాంక్ రెస్టోరేషన్ స్కీము (Tank Restoration Scheme) ను అమలులోనికి తెచ్చుటకు ప్రభుత్వము నిర్ణయించినది. గత 3 సం. ల నుండియు నూతులను త్రవ్వటను ప్రోత్సహించుటకు ప్రభుత్వము సాలునకు ఒక కోటి ౭౦ లక్షలు ఖర్చుపెట్టుచున్నది. రాష్ట్రము మొత్తముమీద అనేక నూతులు త్రవ్వబడినవి. ఇంకను ఈ స్కీము వచ్చేసంవత్సరముకూడ అమలులో ఉండగలదు. కరువు, కాటకము, పంటనష్టము వచ్చినప్పుడు జమీందారీ గ్రామములలో శిస్తురెమిషన్ లేదు. కాని రైతువారీ గ్రామములలో అవసరమునుబట్టి ప్రభుత్వమువారే శిస్తురెమిషన్ ఇచ్చుటయు, ప్రతిసంవత్సరము జమాబందీ జరిగించుటయు చేయుచున్నారు.

ఈనాములు

ఈ సందర్భములో ఈనాములను గురించి కూడ చెప్పవలసియున్నది. ఈనాములు ముఖ్యముగా రెండురకములుగా ఉన్నవి: (౧) ఈనాం గ్రామములు (Whole Inam Villages)—ఈ గ్రామములలో పెచ్చు భాగము ౧౯౦౮,౧౯౩౬ ఎస్టేటులాండ్ ఆక్టుక్రింద ఎస్టేట్లుగా అయినవి. ఇచట భూస్వాములు పన్ను వసూలు చేసుకొను హక్కు కలిగియున్నారు. రైతు భూమికి హక్కుదారుడు అయియున్నాడు. (౨) మైనరు ఈనాములు—వీనిలో వేరువేరు తరగతులు ఉన్నవి. వీనిలో ౧౯౫౦ సంవత్సరములో జరిగిన ఈనాం సెటిల్‌మెంటు క్రింద ప్రభుత్వమునకు రావలసిన పన్నులో కొంత భాగమును వసూలుచేసుకొనుచు భూమిని పండించుకొను హక్కు ఈనాందారునికే వదలివేయబడినది. ఇట్లు ప్రభుత్వమునకు ఇచ్చు పన్నును 'క్విట్ రెంటు' అనెదరు. అనగా నామమాత్రపు పన్ను. మిగిలినవి అనేక ఈనాములు గలవు—దశబంధ ఈనాములు, జోడి ఈనాములు వగైరా. ప్రభుత్వముచే ఎస్టేట్లుగా పరిగణించబడిన ఈనాములన్నియుకూడ జమీందారీలతో పాటు రద్దుచేయబడుచున్నవి. మిగిలిన మైనరు ఈనాములను ప్రస్తుతపు ఈ శాసనము ముట్టుకొనుట లేదు. కాని భూమివిధానముయొక్క స్వరూపమును ఇంతటితో మనము వదలిపెట్టిన అసలు సంగతిని మరచుటయే యగును. వ్యవసాయక చరిత్ర ప్రథమ ఘట్టములో భూమిని వ్యవసాయదారుడే స్వంతముగాగాని, గ్రామములోనున్న కుటుంబమువారుగాని, గ్రామములోని జనాభా అంతయు సాముదాయికముగాగాని పంట పండించుకొనెడివారు. కాలక్రమేణ వచ్చిన మార్పులలో ఈ పంట పండించు రైతుకు పట్టణవాసము అలవడుటద్వారాను, ఇతర వృత్తులలో పాల్గొనుట మూలముగాను భూమిని ఇంకొకరికి కౌలుకు ఇచ్చు పద్ధతి అమలులోనికి వచ్చినది. ఈ కౌలువిధానములో రెండు ముఖ్యవిధానములు గలవు. ఒకటి వారంపద్ధతి; రెండవది గుత్తపద్ధతి. వారంపద్ధతి యనగా కొంత పెట్టుబడి భూస్వామి ఇచ్చి, పండిన పంటలో నిర్ణీతభాగము సగమునకు మించకుండ తీసుకొనుట. మిగిలిన సగము భాగమునుండి నే భూమిని పండించు కౌలుదారే వ్యవసాయఖర్చులు భరింపవలెను. సమానముగా పంచుకొను పద్ధతిని శుద్ధవారము అనెదరు. ఈపద్ధతి కాలమానపరిస్థితులపై ఆధారపడు ప్రదేశములలో అమలులో ఉండును. గుత్తకౌలుపద్ధతి అమలులో ఉన్న ప్రదేశములలో పంటపండినను ఎండినను ఒక నిర్ణీతమైన మొత్తమును కౌలుదారు భూస్వామికి చెల్లించవలసియున్నది. ఈ కౌలు ఎన్నిసంవత్సరములు అమలులో ఉండవలెనను విషయము మొదట నిర్ణయించుకొన్న షరతుపై ఆధారపడియుండును. ఈ కౌలునిర్ణయము చాలవరకు మూజువాణీ. అనగా వాగ్రూపకము. కొన్ని విషయములలో కౌలు రిజిస్టరుచేయబడుచున్నది. రిజిస్టరుకౌలుకు సాధారణముగా ౫ సం. ముల కాలపరిమితిఉన్నది. రైతులు శిస్తులు చెల్లించకపోయినచో అటువంటి రైతును పొలమునుండి వెడలగొట్టుటకు భూస్వామికి శాస్త్రరీత్యా అధికారమున్నది. ఇట్లు కౌలుపైన జీవనము చేసుకొనువారు దేశములో చాలమంది యున్నారు. భూమిపై స్వయముగా వ్యవసాయము చేసుకొనువారి (అనగా పట్టాదార్ల) సంఖ్య తగ్గుచున్నది.

ఈ తరగతులేగాక నిత్యము భూమిపై కూలినాలి చేసుకొను జనముకూడ చాలమంది యున్నారు. వారిని వ్యవసాయకూలీ లనెదరు. వారికి సంవత్సరము పొడుగునను పని ఉండదు. ఊడ్పులు, కోతలు వగైరా సమయములలోనే పని దొరుకును. వారికి చాలమందికి ధాన్యరూపములో కూలి ఇవ్వబడుచున్నది. కొంతమందికి ధనరూపకముగా ఇవ్వబడును

భూమిపై హక్కు ఎవరికుండవలెను?

భూమి దున్నుకొనువారికే భూమిపై హక్కు ఉండవలెనుగాని భూమిని పెట్టుబడిక్రింద వినియోగించుకొనువారికి భూమిపై హక్కు ఉండరాదను వాదన దేశములో దినదినాభివృద్ధి చెందుచున్నది. ముఖ్యముగా భూమిపై జీవనము చేసుకొనువారి సంఖ్య పైన వివరించిన రీతిని దిన దినము హెచ్చు అగుచుండుటయే దీనికి ప్రధానకారణముగా ఎంచవలసియున్నది. గ్రామములలో గ్రామోపయోగమునకు పనికివచ్చు చిన్నవృత్తులు సన్నగిలుటవలనను ఈపరిస్థితి ఏర్పడుచున్నది. ఇప్పుడు ఈ సమస్యాపరి

ష్కారము చాల కష్టమైనసంగతి. ఎందువల్ల ననగా గ్రామములలో చాలమందికి అతిస్వల్పమైన భూమి గలదు. పలుగ్రామములలో ఇట్టి స్వల్పభూము లున్నవారు వారే వ్యవసాయము చేసుకొనుచుందురు. రైతునకు స్వల్పము, పరిమితము అయినభూమి ఉండుటవలన ఎరువులు వేయుటకు, నూతనవ్యవసాయపద్ధతులకు పెట్టుబడి పెట్టుకొనుటకు శక్తి లేక భూమిపైన పండించు పంటకూడ అల్పమగుచున్నది. ఈ రోజున దేశములో ఉన్న జనాభా కంతకు సరిపైన భోజనము లేకుండుటకు ఇది యొక్కటియే ప్రధాన కారణముగా ఎంచవలసియున్నది. ఈ పరిస్థితులలో మన మొక నూతన విధానము సృష్టించుకొనుట అత్యవసరము. ఈ సందర్భములో ఈ దిగువసమస్యలు ప్రస్ఫుటమగుచున్నవి.

(౧) రాష్ట్రములో కొలదిమందికి వేలాది యకరముల భూమి యున్నది. తంజావూరుజిల్లాలో ఒకరికి ౯ వేలయకరముల రైతువారీభూమి కల దను ప్రతీతి. పశ్చిమగోదావరిజిల్లాలోకూడ ఇంకొకనికి ఉన్నట్లు తెలియుచున్నది. ఇదేగాక ౧౦౦ మొదలు వెయ్యిఎకరముల భూమి గలవారు పలువు రున్నారు. ఇంత హెచ్చుభూమిని స్వయముగా పండించజాలరుగనుక కష్టించువారికే ఈ భూమిపై హక్కు కలుగజేయవలె నను వాదన ఒకటి యున్నది. సాగులేని వ్యవసాయక భూముల నన్నింటిని బీదవారికి ఇవ్వవలె నను వాదన యున్నది. అసలు తానే స్వంతముగా వ్యవసాయము చేసుకొనని పట్టాదారుని భూమిని అచట వ్యవసాయము చేసుకొనుచున్న రైతునకు ఇవ్వవలె నను వాదన యున్నది.

(౨) మన రాజధానిలో పలువురు చిన్నచిన్న భూస్వాములగుటవలన వీరి ఆస్తిని ఇంకొకరికి సంక్రమింపజేయుటకు వీలు కాదు. ఇటువంటి చిన్న భూస్వాములు అనేకమంది కలిసి సహకార సంఘముగా ఏర్పాటై తమతమ భూములపై హక్కులను పోగొట్టుకొనకయే పాటుబడి వ్యవసాయము సాముదాయికముగా చేసుకొని ఖర్చులు పోను మిగిలిన పంట పండించుకొనుచో దానిని సహకారవ్యవసాయపద్ధతి అనెదరు.

(3) పట్టాభూమినంతను సమిష్టిచేసి, అనగా ఏ ఒక్కరిపేరను పట్టా లేకుండ చేసుకొని పంట పండించి పంచుకొన్నచో సమిష్టివ్యవసాయ మనెదరు.

ఈ మూడు పద్ధతులలో ఏది దేశమునకు అనుకూలించు ననువిషయము చాల జాగ్రత్తగా యోచించవలసియున్నది. ఈ మూడింటిలోను సహకారవ్యవసాయపద్ధతియే అనుకూలమైన దని మన దేశపరిస్థితిని బట్టి అనుకొనవలసివచ్చుచున్నది. అందువలన స్వల్పభూపరిమితి గల వ్యవసాయదారునకు వలయు పెట్టుబడి యెరువులు, నూతనవ్యవసాయపద్ధతులను అవలంబించు సావకాశము దొరుకును. తమ భూమిని పోగొట్టుకున్నానే అను విచారము కూడ లేకుండును. ఏ ఒక్కరికిని ఒక నిర్ణీతమైన విస్తీర్ణముకంటె హెచ్చు భూమి ఉండరాదనే నిర్ణయము చేయవలసిన దని హెచ్చుఆందోళన గలదు. ఈవిషయమునుగూర్చికూడ ప్రభుత్వము యోచించవలసియున్నది.

తలపోతలోనున్న శాసనములు

మద్రాసు రాజధానిలో ప్రస్తుతము రైతువారీ భూమికి సంబంధించిన శాసనము లేదు. త్వరలో జమీందారీ భూములన్నియు రైతువారీభూములు కానున్నవి. అందువలన రాజధానికంతకు పన్నులకు సంబంధించిన శాసనము చేయుటకు ప్రభుత్వమువారు కృషి చేయుచున్నారు. ఈ శాసనము అమలులోనికి వచ్చుసరికి పైన వివరించిన భూమిశిస్తు సంస్కరణకు సంబంధించిన శాసనము, రైతుకు భూస్వామికి మధ్యగల సంబంధమును నిర్ణయించు చట్టము చేయవలసిన అవసరము గలదు. మరియు వ్యవసాయ కూలీకి కనీసకూలీ నిర్ణయించు చట్టము చేయవలసిన అవసరముకూడ కలదు. ఈ అన్ని కార్యక్రమములు సర్వతోముఖముగా జరిగించుటకు కృషి జరుగుచున్నది.

అన్నిటికంటె ముఖ్యమైనది ప్రస్తుతము పన్నువసూలుచేయు పద్ధతిని మార్చి చేయవలసియున్నది. ఇప్పుడు స్వల్ప విస్తీర్ణము గల భూస్వామి, అత్యధిక భూవిస్తీర్ణము గల ఆసామి ఒకే రేటున పన్ను చెల్లించుచున్నారు. ఈ పన్నును క్రమాభివృద్ధిగలదైన పద్ధతిని నిర్ణయింపవలసిన అవశ్యకత ఉన్నది. ఈవిషయమును

కూడ ప్రభుత్వము అనతికాలములో ఆలోచించవలసిన పరిస్థితి ఏర్పడినది.

ఏది ఎట్లున్నను భారతదేశ భావిభాగోదయము కృషీవలునిపైననే ఆధారపడియున్నది. పైన చెప్పబడిన విషయమును సమగ్రమైన స్వరూపమునకు తెచ్చి సాధ్యమైనంత హెచ్చుపంటను పండించుకొనవలసిన సమయము, పన్నువిధానములను సంస్కరించుకొను సమయము ఇదే. ఈ విషయములో తగు సలహాలు ఇచ్చుటకు అఖిలభారత కాంగ్రెసు సంఘము ఒక ప్రత్యేక కమిటీని నియమించియున్నారు. వారు తమ నివేదికను జూను నెలాఖరుకు ప్రచురించెదరు. వారి నివేదిక వచ్చినవెంటనే మన రాజధానిలో తీసుకొని రావలసిన సంస్కరణలను తీసుకొనివచ్చుటకు కృషి చేయవలసియున్నది. రైతు భూమికి రాజు. ఇట్టి రైతు రాజ్యాంగనిర్వహణలో తనయొక్క ఉత్తమస్థానము అలంకరించునట్లు చేయుటయే మనయొక్క ముఖ్యమైన విధి. నాడే దేశము సౌభాగ్యవంతమగును.




హంపీశిథిలములలోని గంట స్తంభము
చిత్రకారుడు: శ్రీ పి. వి. రామారావు

# అపేక్ష - ఉపేక్ష

శ్రీ వప్పూరి రామాచార్యులు

అపేక్ష యనగా కోరిక. ఉపేక్ష యన అశ్రద్ధ. మన కపేక్షలు మెండుగా నున్నవి. కాని ఉపేక్షగూడ మనలో నతిశయమే. ఈ యుపేక్షవలన అపేక్ష లడుగంటుచున్నవి. ప్రజలకు సంభవించు దుర్దశలేగాదు ఈ యుపేక్ష కారణముగా సామ్రాజ్యములు తల్క్రిందైనవి. జనపదములు నాశమైనవి.

ఉపేక్ష లోశత్రువు. బయటిశత్రుల నెందరినైన జయించవచ్చును కాని ఈ యంతశ్శత్రువును జయించుట కష్టము. సముద్రముల నెగురదాటిన హనుమంతుడు తన పీడను దాటజాలడా? ఈ యుపేక్ష మనలోనే పుట్టి పెరుగుచున్నది. తెలియకనే మనము దానికి దోహద మిచ్చుచున్నాము. మొదట నది సుఖస్వరూపముతో ప్రత్యక్షమగును. తుదిని సర్వనాశము చేయు కాళమూర్తిగా పరిణమించును.

పరీక్షలో తప్పుట. ప్రమోషను రాకపోవుట. రైలు అందకపోవుట. బస్సు టిక్కెట్ దాటిపోవుట. పత్రములు వాయిదాపోవుట. జీవితభీమాలు రద్దగుట. పైరు చెడుట. ఆస్తి నశించుట. రోగము పెరుగుట. అగ్నిబాధ చోరభయములు అన్నియు ఉపేక్షవలననే.

తీగకు చీడ. పైరునకు తెగులు. కాయకు పుచ్చు. వ్రణమునకు దోషము. సంగీతపాఠకుని కపస్వరము వంటి దీ యుపేక్షాగుణము మానవులలో.

ఇంటిలోని వస్తువు లుండవలసిన చోట లేక అన్నియు తికమకగా నుండుట యజమాని ఉపేక్షవలన. గ్రామములు దుర్గంధనిలయములై వీథులు కాలుపెట్టరానివై గ్రామజనులు కలహశీలురై చేవచెడియుండుటకు ఊరిపెద్దల యుదాసీనత కారణము. బడిపిల్లలు తగవరులై అల్లరిపిల్లలుగా మారుటకు ఉపాధ్యాయుని అశ్రద్ధ హేతువు.

తిద్ది తీర్చిన దేవాలయగోపురముల మీద అశ్వత్థవృక్షపు మొలక మొలచి పెరిగి పెంపొంది కోమలముగా కన్పడును. కొంత కాలమున కది వేళ్ళూని గోపురమునే చీల్చి కూల్ద్రోయును. ధర్మకర్తల యుపేక్ష దేవాలయశిథిలమునకు కారణమైనది.

కోటగోడలమీద చీమలు పెట్టిన రంధ్రములో నీళ్లదిగి శత్రువుల ఫిరంగిలు చేయజాలని వినాశమును అవలీలగా చేసినవి. కాపలివారి యుపేక్ష అందునకు కారణము.

పుత్రుని మీది ప్రేమతో వాని అవినయమును మొదట మన్నింతుము. తర్వాత సహింతుము. పిమ్మట దానికే లోబడుదుము. కాని అది మితిమీరి 'ప్రాణగొడ్డమై' వచ్చినప్పుడు నిరోధింపజాలక వెతలొందుదుము. ధృతరాష్ట్రుని పశ్చాత్తాపము తర్వాత పనికిరాలేదు. 'అనఘుడు పుత్రు జూదమున గొప్పుట యెంతయు' జిచ్చుపెట్టి కాల్చినయది ! యుపేక్షయు అని సంజయుడు ధృతరాష్ట్రునిఎదుట వాపోవుటలో నిజము తప్పక యున్నది గదా!

ఉపేక్షాపరుడగు ప్రభువురాజ్యములో శాంతి యుండదు. వాని ప్రజలకు సౌఖ్యము లేదు. వాని స్వాతంత్ర్యము నిలువదు. రాజ్య ముండదు.

ప్రక్కయింటివానిమీద జరుగు పరుల దౌర్జన్యమును మన ముపేక్షించిన క్రమముగా నది మన మీదికి వచ్చుట నిజము. అవిధముగనే పొరుగున నున్న రాజువినాశమును చులకనగా చూచు రాజులుగూడ త్వరలో విపద్దశ నొంది యుందురు.

* * *

ఇండియామీద దండెత్తినవారిలో ప్రథముడు అలెగ్జాండరు. వాని సైన్యమును ఒక్క పురుషోత్తముకుతప్ప తక్కిన రాజులు నిరోధింపదల్చ లేదు. ఆ యిరువురి పోరాటమును వా రుపేక్షతో చూచుచుండిరి. దాని ఫలితమును పురుషోత్తము డొక్కడే అనుభవించలేదు. చుట్టుపట్ల రాజులును, క్రమముగా ప్రాచ్యభారత మంతయు యవనులకు లోబడక తప్పదయ్యెను.

హిట్లరుదౌర్జన్యమును జర్మనుప్రజలు మొదట మెచ్చుకొనిరి. చుట్టు రాజ్యములవారు సహించిరి. ఇంగ్లాండు పధాని ఉపేక్షించెను. ఈ యుదాసీనత జర్మనీవినాశమునకు తుదిని కారణమైనదేకాక ప్రపంచమునంతయు కలగుండుపెట్టి తీరని కష్టనష్టములకు గురిచేసినది.

భారతదేశచరిత్రయం దిట్టి యుదాహరణము లెన్నియో కలవు. తెల్లవా రీదేశమున నడుగుబెట్టను, కోటలు కట్టుకొనను, సైన్యముల కూర్చుకొనను, అనుజ్ఞనిచ్చి వారి ఆక్రమణను, బలుపును నిరోధింపక ఉపేక్షించిన ఫలమును మొగలుపాదుషాహాలేగాక, హిందూచక్రవర్తులు గూడ అనుభవించిరి, అంతేకాక ఆదుష్ఫలమును భారతదేశప్రజలు రెండు శతాబ్దములకాలము దుఃఖదారిద్ర్యరూపమున అనుభవింపక తప్పదయ్యెను. మహాత్ముని మెలకువ లేకున్న మన మావిపద్దశనుండి వెలువడియుండనేర మనుట యనుమానమా?

* * *

ఇప్పుడున్న కాంగ్రెసుమంత్రులు గాఢమగు దేశభక్తి కలవారగుట వాస్తవమే. కాదనలేము. కాని ప్రజలలో పెల్లురేగిన అపేక్షల నన్నింటిని ఈ మంత్రుల యుపేక్ష నలిపివేయుచున్నది.

రాజధానిలో నంతయు మద్యనిషేధము నమలుపరుపవలెనను అపేక్ష మంత్రులకును కలదు. కాని దానిని కార్యరూపమునకు తెచ్చుటలో గల యుపేక్షవలన అందువలని ప్రయోజనము సున్నయగుటయేగాక ప్రమాదములుగూడ పెరిగివచ్చుచున్నవి.

జనుల సంఖ్య పెరుగుదలతోపాటు వారికి విద్య కఱపు పాఠశాలల సంఖ్య పెరుగుట లేదు. కాక తక్కువయగుచున్నవిగూడ. నిరక్షరతను రూపుమాపు నపేక్ష మంత్రులకును లేకపోలేదుగాని మరల జనగణనసంవత్సరమునాటికి మన దేశ జనులకును,అక్షరజ్ఞులకును ఇప్పుడున్న దామాషా వైరము తగ్గిపోవునేమో? యథాతథపద్ధతిలోనే ఇంకను ఈ విద్యాశాఖను నడిపించు ఉపేక్షవలన ముందు నిరక్షరత పెరుగు ప్రమాదమునకు దేశము గురియగుట కాంగ్రెసుప్రతిష్ఠకు హానికరముగాదా?

కాంగ్రెసుమంత్రుల కార్యాకార్యములను విమర్శించు వ్యాఖ్యానముగాదిది. పడిసెము, తలనొప్పి ఉపేక్షించినచో క్రమముగా పెరిగి తొలగని జాడ్యముగా పరిణమించునట్లే పరిపాలనలోని చిన్న లోపములు తర్వాత నవరింపరాని రీతి పెరిగి జాతికి ముప్పుగా, దేశమునకు కళంకముగా నేర్పడవచ్చును. కావున మంత్రులు మెలకువతో వర్తించుటయు, దీర్ఘదృష్టితో కార్యారంభములకు పూనుటయు, ఉపేక్షాపరులు గాకుండుటయు అత్యవసరము.

అధికారవర్గమునకే ఉపేక్షనంతయు అంటగట్టుట పక్షపాతపు తెలుగగును. మంత్రు లేమైన చేయనిమ్మని తమకు కాబట్టనిరీతి ఉపేక్షతో ప్రజలు వర్తించుటవలననే మంత్రులకు మాంద్యము హెచ్చును. నూరిననే గాని కత్తి పదునెక్కదు రాచినగాని గంధము పరిమళింపదు. ప్రజలు అధికారుల అరుణకటాక్షములకు వెఱచి విమర్శకు దూరమై వందిమాగధుల చందము వహించినయెడల ప్రభుత్వము పేరుకొని, మంత్రులు నియంతలై, అభివృద్ధి కాటంక మేర్పడును.

కాంగ్రెసుమంత్రుల సంచారకార్యక్రమములోగూడ విందులు, విహారములు, స్తుతివాక్యములు, సన్మానపత్రములే కనుపించుచున్నవి. ఖడ్గహస్తులైన విజాతిప్రభువుల విశ్వాసము గడించుటకు పరాభూతప్రజలు భయముతో చేయు మర్యాద లివి. ప్రజాప్రతినిధులగు మంత్రుల సందర్శనకార్యక్రమము ఆ ప్రాతమార్గముల నడువరాదు. పరిపాలనలోని లోపము లేవియున్నవో, వానిని వారించుతెరగు లెవ్వియో అన్వేషించి అట్టి లోపములు ముందు జరుగనియట్లు ఏర్పాట్లు కావించుటకు మంత్రులు సమ్మతించుటయు, ప్రజానీకము ఆయుద్దేశమునకు సాయపడుటయు జరిగినచో నదియే మంత్రులకు గొప్ప సన్మానము.

అట్లుకాక లోపముల నణచిపెట్టి మంత్రులను గురించిన స్తుతిసన్మానములను స్వర్ణాక్షరములతో ప్రకాశింపజేసినచో అది మంత్రులను భ్రమలో ముంచుటయేగాక-దానివలన ప్రజలును ఆత్మవంచనదోషమునకు గురియై అధర్మప్రాబల్యమున నలిగి నశింతురు.

అకార్యములను, కార్యదోషములను వ్రేలుపెట్టి ప్రజలు మంత్రులకు చూపని యుపేక్ష ఉభయులకును తుదిని ముప్పుదెచ్చును.

ఉపేక్ష పూర్తిగా నశించినగాని అపేక్షలు అనుభవమునకురావు.



## ఉగాది
## అభినందనలు





మీరు ఉగాదికి క్రొత్త బట్టలు కొనాలి. అవి ఉత్తమమైన అతి శ్రద్ధగా తయారుచేయబడిన ఉన్నితో నేయబడినవి దీర్ఘకాలం మనునవి పరిశుద్ధమైన రంగు, సహజమైన అందము కలవి!
దయచేసి మా వర్‌స్టెడ్ సూటింగులు, యూనియన్ సూటింగులు, పాంబీచ్, సూపర్-ఫైన్ శాలువలు, షర్టింగులు, లోయీలు, ప్యాక్ దుప్పట్లు, రగ్గులు, బ్లేంకెట్లు, హోజియరీ లను చూడండి.







A J.K. INDUSTRY




**THE RAYMOND WOOLLEN MILLS LTD.**
**BALLARD ESTATE, BOMBAY — MILLS AT THANA**

# రేమండ్ వులెన్ మిల్సు లి॥

బల్లార్డు ఎస్టేటు, బొంబాయి — మిల్లులు థానావద్ద

చీఫ్ ఏజంట్లు:

## హిందుస్తాన్ టెక్స్‌టయిల్ కార్పొరేషన్,

9, గోడౌన్ వీధి, — మద్రాసు.



# కావ్యహరిశ్చంద్రము

నాటిక



శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

[పాత్రలు—హరిశ్చంద్రుడు; మాతంగకన్యలు; విశ్వామిత్రుడు; నక్షత్రకుడు; చంద్రమతి; లోహితాస్యుడు; కాలకౌశికుడు; వీరబాహుడు; రాజభటుడు.]

మాతం : అయ్యా! హరిశ్చంద్రమహారాజా! మేము గాయనులము. నాట్యవిద్యాపారంగతలము. మావిద్య మీయందు వెలిపి తమ దయ పడయ నేతెంచినారము.

హరి : లతాంగులారా! మీరెవరు?

మాతం : మహారాజా! మేము విశ్వామిత్రమహర్షి కూతం త్రము. కులముచేత మాతంగకన్యలము. మీ యౌదార్యము, మీ పాండిత్యము విని మీదర్శనార్థము వచ్చినారము. మహారాజా! మీ కీవనము నకే నిచ్చేయుట మా యదృష్టము. వ్యయప్రయాసల కోర్చి మీ అయోధ్యాపురికి మే మెట్లు రాగలము? ఒకవేళ వచ్చినను మేము మాతంగకన్యలమని మమ్ము మీసభలోనికే రానియ్యరు.

హరి : ఓ లతాంగులారా! మీరు మాతంగకన్యలని మీరు చెప్పిననే తెలియవలయును. బ్రహ్మర్షి యైన విశ్వామిత్రుని బిడ్డలుట మీ మహిమను చెప్పుచున్నది. ఓహో! మీ సౌందర్యము అప్సరస్త్రీలను తలదన్నుచున్నది. మీ విద్యాప్రదర్శనము తప్పకుండ జూచెదను. మిమ్ము గౌరవించుట శ్రీ గాధేయులను గౌరవించుటగా నెంచుచున్నాను.

మాతం : దేవర కనుగ్రహము సంపూర్ణముగా గలిగినది. మేము భయలుదేరిన వేళావిశేషము.

(పాట)

కలితమనోహరనవయామినీ
రతిసమయ రసభావగామినీ!
కోర్కెమై పతి చూడకపోవగ తన యౌవనము
కనరాక కప్పె రెక్కల చక్రవాకీ. కలిత.........
చట్టున ల్పచరించి జరుగు పతి గని బాగ
నట్టుగా జీవురాకు నమ్మ వెన్కను శుకీ. కలిత......
మింటిలో పతి వెంటవెంట రాచుక తిరుగ
దంటమబ్బుల తెరల దాగను బలాకీ. కలిత.....

హరి : కన్యలారా! శహబాసు! ఔచిత్యము చెడకుండ మీరు చేసిన వర్ణన మిక్కిలి ప్రశస్తముగ నున్నది. మీగొంతులు శ్రుతిపరమావధులుగా నున్నవి. మీ ప్రయోగము దోషరహితముగా నున్నది. మీ యభినయము భరతాచార్యులు గాంచినచో తమ శాస్త్రము ఫలవంతమైన దని భావింతురు.

మాతం : ప్రభూ! విద్యకొక్క చారితార్థ్యము తమవంటి సునిశితమేధావంతులైన రసజ్ఞశేఖరులయందు ప్రదర్శించుట. ధన్యలము. సెలవు తీసికొందుము.

హరి : అదియేమి! ఊరకే పోవుదురా! మావలన నేదైన బహుమతి గ్రహించిపోవలయును. అట్లు చేయనిచో మమ్ము గౌరవ పరచిన ట్లగునా! విశ్వామిత్రమహర్షి కూతుండ్రేమి! మాకడకు వచ్చి యిట్లు రిక్తచేతులతో దిరిగిపోవుట యేమి!

మాతం : మహారాజా! మీప్రశంసయే మాకు బదివేలు. మరియు మే మేమి యడిగిన మీరిత్తురు?

హరి : మీ రేది యడిగిన నది యిత్తును.

మాతం : మహారాజా! తొందరపడి యేదియు ననరాదు. సత్యము మిక్కిలి చెడ్డది. అన్నమాట తీర్చుకొనలేకపోయినచో మృషాఫలితము వచ్చును. అది జీవునకు ముక్తిహేతువు కాదు.

హరి : అవునమ్మ! నే ననత్య మాడను. ఆడజాలను. సత్య మార్గము నే యవలంబించుచున్నాను. సత్యముగా జెప్పుచున్నాను. సత్యమైన మీకోర్కె యేదైనను తీర్పగలను. అడుగుడు.

మాతం : మహారాజా! ఇది చెప్పుము. సంగీతాభినయములందు మాకంటె నధికులను మీ రెచ్చటనైన జూచితిరా?

హరి : చూడలేదు. యథార్థము.

మాతం : సౌందర్యమునందు మాకంటె నధికులను మీ రీ భూలోకమందు చూచితిరా?

హరి : చూపలేదు, నిజము.

మాతం : మేము కన్యలము. నవయౌవనాభిరామలము. అనన్య లగ్నమానసలము.

హరి : నిశ్చయము.

మాతం : తన తపోమాహాత్మ్యముచేత మరొక స్వర్గము సృష్టించిన విశ్వామిత్రుని తపస్సుచేత మేము రక్షితులము.

హరి : అహో ! మీ భాగ్యము.

మాతం : మా కొక్కటియే కోర్కె యున్నది. అది తప్పక తీర్చుమన్న చో మనవి చేయుదుము.

హరి : నే నెంతవరకు విసుటకేకదా వేచియుంటిని ?

మాతం : చిత్తము. మేము మాతంగకన్యలము ! విశ్వామిత్రుని చేత సృష్టింపబడినవారము. మాయందు కులదోషము లేదు.

హరి : నిజముగా లేదు.

మాతం : ఇట్టి మాకు బలి కాదగినవా డీభూలోకమున లేడు.

హరి : లేడు.

మాతం : కాని, ఉన్నాడు. ఆయన మీరొక్కరే. మహా రాజా ! మాయం దేదోషమును లేదు. మీరు మమ్ము స్వీకరించి మా జన్మలను చరితార్థములను చేయుడు. మే మడిగినాము. ఏది యడిగిన నది యిత్తుమని మీరన్నారు.

హరి : ఓ లతాంగులారా ! నేనన్నాను. నిజమే కాని, నే నేమన్నాను ? సత్యమైన కోరిక కోరవలయు నన్నాను. ఇది సత్య మార్గమునందు లేదు. నేను వివాహితుడను. ఏకపత్నీవ్రతుడను.

మాతం : మా యింతటి సౌందర్యముచేత నీ వాకర్షింపబడుట లేదా ?

హరి : సౌందర్యము నేత్రములతో జూచి యానందింపదగినది. అట్టి శరీరగతమైనది.

మాతం : మహారాజా ! మాశరీరము లెంత యందమైనవో మా మనస్సులు నంత యందమైనవికదా ! మా విద్యాప్రకాశనము నీ విప్పుడేకదా చూచితివి ?

హరి : మీశరీరము లెంత యందమైనవో మీమనస్సు లంత యందమైనవి. మీ మనశ్శరీరములందు శాశ్వత ధర్మము పరాకాష్ఠ నందియున్నది. కాని మీ యాత్మలు ధర్మేతరముగా నున్నవి. నేను వయసుమీరినవాడను. మీరు బాలికలు. నేను గృహస్థుడ. మీ కనురూపులైన భర్తలను వెదకికొనవలయునుగాని—

మాతం : మా మనస్సులు మీయందే తగిలినవి.

హరి : వివాహమునకు మనస్సులు తగులుట కాదు. ఆత్మ తగులవలయును. మనస్సు చంచలము. నేడు తూర్పునకు తిరుగును; రేపు పడమరకు తిరుగును.

మాతం : ఆ యాత్మను గుర్తించుట యెట్లయ్యా ?

హరి : ధర్మముచేత !

మాతం : మా కిది ధర్మమే యనిపించుచున్నది. నీవు మే మేది యడిగిన నది యిత్తునంటివి. అడిగితిమి. నీవు కాదంటివి. నీ వసత్య మాడుచుంటివి.

హరి : సత్యాసత్యనిర్ణయ మీమాత్రమున కాదు.

మాతం : ఏమాత్రమున నగును ?

హరి : అది మహర్షులు నిర్ణయింపదగినది.

మాతం : అదుగో మా తండ్రిగారు. మహర్షులు. బ్రహ్మర్షులు. వారినే చేయనిండు.

విశ్వామిత్రుడు : ఓయి హరిశ్చంద్రుడా ! మాకు తెలిసినది. నే నీసత్యనిర్ణయమును చేయుచున్నాను. నీవు నాకూతుండ్రను పెండ్లి యాడినచో నీ సత్యమార్గమున నేగినట్టివాడవు కావు.

హరి : బ్రహ్మర్షీ ! నీ వాక్కుల మట్టిదేకాని నీమాటయందే యది యసత్యమని స్ఫూర్తియున్నది కదా !

విశ్వా : ఓయీ ! సత్యాసత్యము లట్లుంచుము. ఈ లోకము నందే సౌఖ్యము సంపాదింపదగినది. అర్థకామముల యెంట బరితృప్తి లేనివానికి ధర్మమోక్షములందు బ్రమపాయుజ్యము లేదు. అర్థము నీయందు రాజ్యాధీనమై యెక్కువ పండినది. కామతృప్తి నీకు ఈ నా కూతుండ్రయందుతప్ప వే రెచ్చోట్ల జరుగదు. అందానికా— పుట్టినందము. విద్యకా—చెప్పరానంత విద్య. వినయవతులు. నీ వె పెద్దలంటివారు. ఈ కామసేవ నుపాసింపుము.

హరి : స్వామీ ! నన్ను శత్రువుల కప్పు చెప్పుటెంతు వేమి ?

విశ్వా : అదియేమి ! నా కూతుండ్రు నీకు శత్రువులా ?

హరి : స్వామీ ! కామక్రోధాదు లరిషడ్వర్గము. ఈ యారు గురు శత్రువుల బారి బడక ప్రభూ ! మోక్షమార్గగామినగు జీవుడను నేను. నన్నేల యిట్లు లాగెదవు ?

విశ్వా : ఓరి పిచ్చివాడా ! ధర్మకామమున నీకు జంద్రమతి యున్నది. ఆ బలమున నీ కామము నొకవేళ గెలిచితివే యనుకొందము. తక్కిన యైదుగురు శత్రువుల గెలువ సాధ్యము కాదు. కనుక వీరిని వివాహమాడి శరీరసౌఖ్యమును బూర్తిగా నైవసము చేసికొమ్ము.

హరి : ప్రభూ ! తక్కిన యైదుగురిని గెలువలేముగదా యని గెలిచిన యొకరికిగూడ లొంగిపొమ్మనుట న్యాయమా ?

విశ్వా : నీ యుద్దేశములో నీ వప్పుడే యా కామమును గెలిచి నట్లే అనుకొనుచుంటివేమి ? వీరిని నీవు పెండ్లియాడక తప్పదు. నీమీద నెంత యాస పెట్టుకొనివచ్చిన వీరిని తిరస్కరించుటకు నీకు హృదయ మున్నదా ! నీది మనసా, రాయా !

హరి : స్వామీ ! ఈ విషయములో రాయియే.

౧

లేదా! దారేషణ, పుత్రేషణ, ధనేషణములు. ఇవి యెల్లపుడు సర్వజీవులను ప్రతారించుచునేయుండునుగదా!

విశ్వా: చక్కగా జ్ఞాపకముచేసితివి. ఈ శత్రువు లార్వురు; ముగ్గురను నీవు గెలిచితివి. సమానబలవంతుల మైతిమి. ఎట్లా అను కొనుచున్నావు. అసలు మా బలము తొమ్మండుగురు. నీవు ముగ్గురినే గెలిచినావు. ఇంక మా కార్గురున్నారు. మా బలమే యెక్కువ యున్నది. ఏమి చేయుదువు?

హరి: ప్రభూ! యేమి చేయగలను?

నాకు నీకంటె దిక్కు కంఠస్థకాల
కూట మగు శేజమును మానితోటిదయయు
నఖిలజీవాళిబంధక మైనయట్టి
యీ విరోధి చమూరోధి త్రోవయందు.

మరియు నా స్వామీ! ఇతరసన్యస్తుల దయయు నొకయెత్తు. నాకు నీదయ యొక యెత్తు.

విశ్వా: ఎందుచేత నేమి?

హరి: బ్రహ్మర్షీ! నీవు నా వంశీయుడవు. ఈ శత్రువులను నీవలె గెలిచినవా డెవడు? ఓహో! యేమి గెలుపు గెలిచినాడయ్యా విశ్వామిత్రుడు ఈశత్రువులమీద? ఇతరుల కలభ్యమైన బ్రహ్మర్షిత్వమును సంపాదించినాడు.

విశ్వా: అట్లే సంతోషించుచుండుము. మరి నీకిపుడు రాజ్యము లేదు. ఎట్లు బ్రతుకగలవు? ఊరూర బిచ్చమెత్తుకొని బ్రతికెదవా?

హరి: "ఆయురన్నం ప్రయచ్ఛతి"—ఆయువున్నచో నన్న మదియే దొరకును.

విశ్వా: ఈ భార్య చంద్రమతి, కొడుకు లోహితాస్యుడు వీరి నెట్లు పోషింతువు?

హరి: స్వామీ! నేనెవరను పోషించుటకు! పరమశివునిదయ.

విశ్వా: అడవుల వెంట బడిపోవుచో పులులు, తోడేళ్లు, ఎలుగుబంట్లు, శీతాతపాదిగ్రహములు. వీని వలన మీ కెట్లును నాశన మయ్యెడిదే.

హరి: ప్రభూ! శివుని యాజ్ఞలేక చీమయు కుట్ట దందురు. ఆ ప్రభువునాజ్ఞ యయినచో నేను పట్టి నిలుపదగినదియు లేదు.

విశ్వా: నీవు భార్యాపుత్రులను పోషించవలయునన్న ప్రేమ యున్నవాడయినచో రాజ్యమే వదలిపెట్టవు. నీ గోరి నాకెందుకు? పదియాళ్లలో దిరిపమెత్తుకొను గోల. పో. పో.

హరి: స్వామీ! సెలవు.

విశ్వా: మరి మరచిపోయితిని. వెనుక నేను వచ్చి "నే నొక యజ్ఞమును చేయదలచితిని. దానికి కొంత సొమ్ము కావలె"నని యడిగితిని. నీ విత్తు నంటివి. జ్ఞాపకమున్నదా?

హరి: చిత్తము.

విశ్వా: ఆ సొమ్ముమాట యేమి? నీ వద్ద రాగిదమ్మిడీ లేదే, ఎట్లు తీర్చెదవు? (నవ్వి) చూచితివటోయి, రాజా! ఏమైనా సత్యవ్రతము పాలించు చున్నావు. ఇప్పు డేమైనది? ఆ ధనము నీ వెట్లు నీయలేవు. అందుచే నబద్ధమాడిన ట్లయినది. సత్యవ్రతము పోనేపోయి నది. కనుక నా కూతుండ్రను పెండ్లియాడుము. నీరాజ్య మంతయు నీకు పరణముగా నిచ్చెదను. మహారాజవుగా నుండువుగాని.

హరి: ప్రభూ! నాకొక నెలనాళ్లు గడువిమ్ము. నీ ఋణమును దీర్చెదను.

విశ్వా: ఋణము దినములతో దీరదు. ధనముతో దీరును.

హరి: నా త్రిప్పులు నేను పడెదను.

విశ్వా: నిన్ను నమ్మి వదలిపెట్టుమందువా?

హరి: నా వెంట నెవరినైన బంపింపుడు.

విశ్వా: తా దూర సందు లేదు, మెడ కొక డోలట! నీ పెండ్లము బిడ్డలను పోషించుకొన్న జాలవు. వానిని గూడ నెక్కడ పోషించెదవు?

హరి: మేము పస్తుండినైనను వాని నారగింపజేసెదను.

విశ్వా: సరే. మా కొక శిష్యుడున్నాడు. వానిపేరు నక్షత్రకుడు. బహుసుకుమారి. వానిని నీవెంట బంపెదను. ఒక నెలనాళ్లలో మా సొమ్ము వాని చేతి కిచ్చి పంపింపుము. నా వావులించినచో ప్రేవులు లెక్కపెట్టెడువాడు. వానిని మోసముచేయ జాలకుము. వాడు నీవంటివారికి నందమందికి చదువుచెప్పగలవాడు.

హరి: చిత్తము. మావెంట బంపించుడు.

విశ్వా: నీవు పోవుచుండుము. అతడు దారిలో వచ్చి మిమ్ము కలిసికొనును. నేను పోవుచున్నాను.

హరి: ఆహా! విశ్వామిత్రఋషి వెళ్లిపోయెను. చంద్రమతీ! నావెంటనే వచ్చుచున్నావా!

చంద్ర: వచ్చుచున్నాను మహారాజా!

హరి: బిడ్డా లోహితా! నీవును నావెంట వచ్చుచున్నావా!

లోహి: వచ్చుచున్నాను నాయనగారూ!

హరి: నాయనా! ఆనక్షత్రకు డన్నాయన వచ్చెనా?

లోహి: ఎవరో వచ్చుచున్నారు. ఆయనయే కాబోలును.

నక్ష: నేనేనయ్యా! నక్షత్రకుడను. నీవేనా హరిశ్చంద్రుడవు?

హరి: చిత్తము.

నక్ష: నీవు కామక్రోధలోభములను గెలిచితి వటకదా!

హరి: అది యేమియు లేదు ఋషికుమారా! విశ్వామిత్రఋషి కూతుండ్రు మాతంగకన్యలను నన్ను పెండ్లాడుమనెను. నే నిష్టపడ లేదు. అంతే.

నక్ష : తలమీద దన్నగా నీకు కోపము రాలేదట గదా !

హరి : కోపమా ? యెవరిమీద ?

నక్ష : తన్నినవారిమీద.

హరి : తన్నిన దెవరు ? విశ్వామిత్రఋషి. ఆయనమీద కోపమా ?

నక్ష : నేను తన్నెదను. వచ్చునా ?

హరి : స్వామీ ! నీవు ఆ ఋషివరువారి శిష్యుడయంతటి వాడవు. నీమీదమాత్ర మెట్లు వచ్చును ?

నక్ష : మరి యింకెవరిమీదనయిన వచ్చునా ?

హరి : ఎందుకు రావలయును స్వామీ ! అతలివానికి గోపము వచ్చియేకదా తన్నుట! ఆ కోపము చాలదా : ఒక జీవి కలుషిత మార్గమున బోవుటకు. మరియు నింకొక జీవి యీ కలుషపథమునకే యేల పోవలయును?

నక్ష : అట్లనెడువాడవు నీవు తప్పక యోగ్యుడవు—సరే. కామక్రోధలోభములను గెలువలే దందువేమి ? గెలిచితివి, గెలువ లేదు. అది నా కెందుకు ? నీవు మా గురువుగారికి కప్పమీయవలెనట. నన్ను వసూలుచేసికొని రమ్మన్నారు.

హరి : ఒక నెలనాళ్లు గడువడిగినాను. ఈ నెలనాళ్లు మీరు మాతో కలిసియో, గంజియో త్రావియుండవలయును.

నక్ష : ఈ యడవిలో సద్దికూడ దొరకునా ?

హరి : అంతకంటె మంచివియే దొరకును. అరమగ్గిన ఫలములు, సెలయేటినీళ్లు దొరకును. అంతకంటె గావలసినదేమి ?

నక్ష : నాలుక కొక్క రుచి. అదియుగాక రాజా ! నీవు సర్వభోగము లనుభవించినవాడవు అందుచేత నీకు విరక్తి యడవితిను సం దభిరుచి యేర్పడియుండవచ్చును. మే మెప్పుడు యడవిలోనే యుంటిమి. మాకు రాజభోగములు కావలయు ననిపించును.

హరి : మీ కిష్టము మాతో నొక్కనెలనాళ్లమాత్రమేకదా !

నక్ష : ప్రాణములు పోవుటకు నొక్కనెల చాల యెక్కువయినకాల మది తెలియునా ?

హరి : పరమేశ్వరుని దయ లేనిచో నంతియే స్వామీ !

నక్ష : సరే, చాలదూరము నడచితిమి. ప్రొద్దు క్రుంకినది. ఈ యడవిలో ప్రొద్దు క్రుంకకముందే క్రుంకినట్లయ్యె! ఈ యడవిలో పండుకొనున దెక్కడ ?

హరి : ఈ చెట్టుకొమ్మలు ప్రాలి జేముగా నల్లి యిల్లు కట్టినట్లున్నది. ఈలోపల బాగుచేసెదను మీరు సుఖముగ నిందు నిద్రించుడు. నేను రక్షించుచుందును.

నక్ష : మరి తిండిమాట యేమి చెప్పితివి ?

హరి : ఇదిగో ఫలములు. సుంతదూరాన జలము ప్రవహించు సవ్వడి వినవచ్చుచున్నది. పోయి జలము తీసికొనివత్తును.

నక్ష : ఈలోపుగా మమ్మెపులియైన వేసికొనిపోవుచో ?

హరి : స్వామీ ! పులులు మనుష్యుల జోలికి రావు. వానిని జూచిన మనుష్యుల కెంత భయమో, మనుష్యులను జూచిన వానికి నంత భయము. ఇంతలో వచ్చెదను.

(పెద్ద కేకలు, అరపులు)

నక్ష : అమ్మయ్యో ! దయ్యాలు. భూతాలు. నే నీచెట్టుక్రింద నిదురపోను.

హరి : ఎందు కీభయము ఋషికుమారా !

నక్ష : ఎందుకేమిటయ్యా ! కనులు లేవా ? వాడెవడో భేతాళుడు. అంత కోరలు. అంత కనులు. చేతిలో నంత కత్తి. అమ్మయ్యో!

హరి : నక్షత్రకా ! భయపడకుము. నీవు దయ్యము లను చుంటివి. భేతాళు డనుచుంటివి. నా కెవ్వరును కనిపించుటలేదు.

నక్ష : కనిపించుట లేదా ! నే నబద్ధము చెప్పుచుంటి నందువా?

హరి : శివశివా ! నే నామాట యందునా ! నాయనా, లోహితా ! నీ కాదయ్యములు కనిపించుచున్నవా !

లోహి : నాయనగారూ ! మొదట గనిపించినవి. ఇప్పుడు కనిపించుట లేదు.

హరి : దేవీ చంద్రమతీ! నీ వాదయ్యములను జూచితివా ?

చంద్ర : స్వామీ ! ఈ కుర్రవా డరచుచుండగా దూరదూరాన నేవో వికారాకారములు భాసించి మాయమైనట్లున్నది.

నక్ష : ఓయి హరిశ్చంద్రుడా ! మా ముగ్గురకు గన్పించెను గదా ! నీ కేల కన్పించలేదు?

హరి : ఇది వట్టి మోహము.

నక్ష : అనగా ?

హరి : భ్రాంతి.

నక్ష : అనగా నీవు దయ్యాలు లేవందువా !

హరి : భ్రాంతిమతుల కుండును.

(పాట)

గళదసృక్కణఘాతకంఠాంతరప్రాణ
దళనఘోరమ్ము మద్దంష్ట్రాప్రమాణమ్ము
వక్షోవిమర్దనభ్రష్టాంత్రమాలికా
నిక్షిప్తతీవ్రమ్ము నిస్త్రింశకము నాది
ఋక్షాంగసంచయక్షోదనాపార్శ్వతే
దణ్ణంఘనధ్వానదర్పమ్ము నాగద.

నక్ష : ఓరి బాబోయి ! యీ భేతాళుడు తన కోరలతో, కత్తితో, గదతో నాప్రాణములు లాగునట, నాగుండె క్రుమ్మునట, నాశరీరము చిదుకబొడుచునట.

హరి : వటూత్తమా ! భయపడకుము.

నక్ష : హరిశ్చంద్రా ! నీ కాధూతములు కనిపించలేదు సరే. ఆ భేతాళు డన్న మాటలు నీకు వినిపించవే !

హరి : నాకు వినిపించలేదు.

నక్ష : ఓయిరాజా ! నీకు కను లున్నవా ! చెవు లున్నవా ! నీవు మనుష్యుడవేనా ! నీవు బ్రతికియున్నావా !

హరి : ఓయి బ్రాహ్మణబాలుడా ! నాకు కను లున్నవి, లేవు. చెవులున్నవి, లేవు. బ్రతికియున్నాను, లేను. ఇదియంతయు భ్రాంతి కదయ్యా ! కను లేమి చూచును. చూచునది లోనున్న జీవుడు. బ్రదుకుట యేమి, చచ్చుట యేమి ? ఈశరీరమునుండి జీవుడు తనదారి తాను పోగా చచ్చిపోయె ననుకొందురు. ఎవడు చచ్చిపోవును ? ఇది యంతయు నొక మహామోహము.

నక్ష : అయ్యో ! నాగురువు నాతో నబద్ధము చెప్పెను గదయ్యా !

హరి : ఆయన యేమి చెప్పెను ?

నక్ష : నీవు కామక్రోధలోభములను మాత్రమే గెలిచితి వని చెప్పెను. అయ్యో ! నీవు మోహమునుగూడ గెలిచితివి. ఓయి ! రాజా ! మోహమును గెలిచినవాని కరిమడ్వర్గ జయము సులభము. మదమాత్సర్యములను గెలుచుట నీ కెంతటి పని ?

హరి : తెల్లవారవచ్చుచున్నది. బయలు దేరిపోదమా ?

నక్ష : ఎక్కడకు ?

హరి : స్వామీ ! ఎక్కడకా ? ఎల్ల జీవులు-ముక్తి వాంఛించు నెల్లజీవులు ఎప్పటికి బోదురో అక్కడకు. కాశీక్షేత్రమునకు. అవి ముక్తభూమికి. శ్రీ విశ్వేశ్వర సన్నిధానమునకు.

నక్ష : శివుడు నీకేమైన బాకీయున్నాడా ?

హరి : ఆయన నాకేమియు బాకీలేడు ప్రభూ ! నేనే ఆయ నకు బాకీయున్నాను.

నక్ష : ఈమాట నాకు గురువు చెప్పలేదే. ముందు మా బాకీ తీర్చి తరువాత నాయనబాకీ తీర్చుము. నీవు సంపాదించెడు ధనమంతయు నాయనఋణమునకే సరిపోయినచో నే నేమి చేయగలను ?

హరి : బ్రాహ్మణవటూ ! ఆయనఋణము ధనఋణము కాదు. మాయ యను నొకవస్తువుకాని వస్తువు నా కాయన యిచ్చినాడు. మరల నాయనది యాయన కిచ్చి వేయవలయును.

నక్ష : అయినచో నిన్ను గురించి నే నెక్కువ జాగ్రత్త పడ వలయును. సరేగాని హరిశ్చంద్రా ! ఇదిగోనయ్యా ! కాశికాపురము. అదిగో మందాకినీనది.

హరి : అడుగో శివుడు మహాకాలుడు.

నక్ష : మహాకాలు డనగానేమి ?

హరి : వటూత్తమా ! కాలము ఖండకాలము, అఖండకాలము అని రెండు. సూర్యాదిగ్రహచారముచేత కలుగునది ఖండకాలము. నిత్యమయినది, మార్పు లేనిది అఖండకాలము. పరమేశ్వరుడు తత్స్వరూపము.

నక్ష : దినములు, నెలలు, సంవత్సరములు ఇవన్నియు నబద్ధ మన్నమాట.

హరి : నిజము వటూత్తమా. పరమమైన యసత్యము.

నక్ష : అయినచో నీవు మాగురువు గారి కియ్యవలసిన ధనము వెంటనే యిమ్ము. అసత్యమైన కాలపు గడువు పెట్టి మోసగింపవేయు టకా ?

హరి : కాదు, స్వామీ !

నక్ష : అయినచో వెంటనే యిమ్ము.

హరి : స్వామీ ! నావద్ద నేమి యున్నది ? నాకు మిగిలిన యాస్తి యీ యిద్దరు—నా భార్యయు, నా పుత్రుడును. వీరి నమ్మి నీ ఋణమును తీర్చుకొనుము.

నక్ష : నే నమ్ముట యెందులకు ? నీవే యమ్ముము. నా కిదొక బాధయా ?

హరి : చిత్తము స్వామీ ! నేనే యమ్మెదను.

నక్ష : అమ్మకో ! ఏమని యమ్మెదవు ?

హరి : ఈమెను బానిసగా నిచ్చెదను, కొనుమని యడిగెదను.

నక్ష : ఈమె యెవరు ?

హరి : నా భార్య.

నక్ష : నీ పేరు ?

హరి : నాపేరు హరిశ్చంద్రుడు. నేను పూర్వ మయోధ్యా రాజును. నా రాజ్యము పోయినది. నేను విశ్వామిత్రునికి ఋణపడి యా ఋణము తీర్చలేక నాభార్య నమ్ముచున్నాను.

నక్ష : ఛీ ! ఛీ ! నీవేమిటి ! హరిశ్చంద్రమహారాజు వేమిటి ? ఈమె నీభార్య కాదు. ఎవరినో యెత్తుకొనివచ్చి యిట్లమ్ము చున్నావు. పద, నిన్ను రాజభటుల కప్పగించెదను.

హరి : కాదు స్వామీ ! నేను హరిశ్చంద్రమహారాజునే. ఈయన, యిదిగో, నక్షత్రకుడు. విశ్వామిత్రుని శిష్యుడు. ఆ ముని తన ఋణధన మీయనచేత కిమ్మని నావెంట బంపినాడు.

నక్ష : ఈ దొంగవటువు పిడెవ్వడు ? వీడు నీతో సరికా ! నడువుడు నడువుడు. ఇద్దరును రాజసన్నిధికి నడువుడు.

హరి : ఓయీ నక్షత్రకా ! అందరును ఇట్లే అందురా ! కొంద రెవరో యందురు. నిజముగా హరిశ్చంద్రమహారాజే కావలెనిచో నింత ధైర్యముగా దన భార్యయని యమ్మజూపునాయని.

నక్ష : అటివారేమి, యిటివారు నంటవచ్చును. ఓరీ ! యీ హరిశ్చంద్రు డెంత సిగ్గులేనివాడు ? ఎంత రోషములేనివాడు ? ఎంత లజ్జాభిమానములు చచ్చినవాడు ? ఇంత బ్రతుకు బ్రతికి ఛీఛీ యీ

పనియా చేయుట? ఏమొగము పెట్టుకొని భార్య నమ్ముకుమ అని యయిన ననుకొనలేదేమిరా యని.

హరి : వటూత్తమా! మద మనగా నెట్లుండునో తెలియునా!

నక్ష : ఎట్లుండును?

హరి : సరిగా నీవన్నట్లుండును. నే నింతవాడను, నావద్ద నింతధన మున్నది, నే నింత విద్యావంతుడను, ఇది చేయుట నాకగౌరవమునకు దక్కువ—మదముకలవా డిట్లూహించును.

నక్ష : అనగా నీవట్లూహించ వన్నమాట.

హరి : పూర్వ మెప్పుడో నేను హరిశ్చంద్రమహారాజును. అప్పుడెప్పుడో నాకు రాజ్యమున్నది. రాజ్యమున్నచో భార్యనే అమ్మనక్కరలేదు. రాజ్యము లేనపు డట్లూహింపనేల?

నక్ష : ఇప్పు డట్లూహించుట మదమా, అప్పు డట్లూహించుట మదమా?

హరి : అప్పు డట్లూహించుట మదము. ఇప్పు డట్లూహించుట మదముయొక్క ఆభాసము.

నక్ష : ఆభాస మనగా?

హరి : అదియు నటువంటిదే! అంతకంటె హీనమైనది.

నక్ష : ఆహా! నాకు తెలిసినది.

హరి : ఏమి తెలిసినది వటుసార్వభౌమా!

నక్ష : నీవు మదమునుగూడ గల్పితివని చెప్పుచున్నావు.

హరి : అట్లు చెప్పుట లేదయ్యా స్వామీ! నాకు మద మున్నచో నాగుట యెట్లని మనవిచేయుచున్నాను.

నక్ష : ఓయి బాబోయి! ఇంత డొంకతిరుగుళ్లు నాకు మాటలలో చేతగావుకాని నీభార్య నమ్మి నా ఋణ మామొగాన బారవేయుము.

(శ్రీ త్ర వు)

హరి :

నే హరిశ్చంద్రమహారాజ్
నీరజాతాక్షి యిది సెలత నా కో ప్రజలు-నే హరి-
గాధిజున కే నప్పుపడితిక్
నా ధరిత్రికి వెల్ల కెడితిక్.
మునిఋణము తీర్పజాలను లేక యమ్మకొం
చున్నాను దయచూడు డన్నా ప్రయా ప్రజలు-నే హరి-
గతిమాలితే హరిశ్చంద్రా
మతిపోయెనా తమస్సాంద్రా
అందురా నిజముగా ననదగినవాడనే
సుందరాంగిని వచ్చి చూచి కొను డో ప్రజలు-నే హరి.

నక్ష : మహారాజా!

హరి : ఆ. ఏమి స్వామీ!

నక్ష : ఆ వచ్చుచున్నాడే బ్రాహ్మణుడు. ఆయనను నే నెరుగుదును. ఆయనపేరు కాలకౌశికుడు. ఓరి వాని దుంప : తెగ! వాని యంతలోభి నాడేనయ్యా! వాడు కొన్నునట్లు చేయవలయును. ఎవరినో యొకరిని మోసపెట్టవలయును. లేనిచో నెవరు కొందురు?

హరి : స్వామీ! మోస మెందుకు? నే నాయనను పిలిచి యడిగెదను.

నక్ష : అయినచో బేరము కుదిరినట్లే!

హరి : ఆతలివానిని మోసముచేయబోము. నీవు మోసపడ వచ్చును. నీవు న్యాయముగా నుండుము. ఆతలివాడును నీయందు మోసము త్యజించును.

అయ్యా! కాలకౌశికా!

కాల : ఎవరయ్యా మీరు?

హరి : స్వామీ! నాపేరు హరిశ్చంద్రమహారాజు.

కాల : ఛీ ఛీ! నీవా! నీ మొగము చూడరాదు.

హరి : ఏమి ప్రభూ! ఏమి తప్పు చేసితిని?

కాల : అయ్యో! అంతేకంటెనా! మన ప్రతిష్ఠ మనకంటె ముందే కాశికాపురము ప్రవేశించినది. విశ్వేశ్వరస్వామియాలయములో కేగంటగా మ్రోగుచున్నది.

హరి : అయ్యో! ఇంతమాత్రమునకేనా! గుడిలోనకేక దా ప్రవేశించినది. స్వామిలో ప్రవేశింపలేదు కదా! అట్టి పనినికూడ జేయుచున్నాను. బ్రాహ్మణోత్తమా! ఈమె నాభార్య, పేరు చంద్రమతి. నేను విశ్వామిత్రమహర్షికి ఋణపడ్డాను.

కాల : చదువకు. చదువకు. నాకంతయు తెలియును. మరి యిప్పుడు భార్య నమ్ముచున్నావా!

హరి : చిత్తము.

కాల : చిత్తము. భార్య నమ్ముచున్నావూ! ఓరి ఘటకుడా! నేను వచ్చితినిగనుక సరిపోయినది. కానిచో మాలవానికైన నమ్మెడివాడవే!

హరి : ఏమి విప్రోత్తమా! మాలవాడు మనుష్యుడు కాడా!

కాల : అయ్యో: ఎందుకు కాడు? నీవే యయినపుడు వాడేల కాడు? వాడు నీకన్న వేయి రెట్లు నయము. వాడు పెండ్లాము నమ్మడు.

హరి : అవును స్వామీ! నాకంటె నీ దృష్టిలో వాడు నయము కాడు?

కాల : ఈమెవేల యెంత?

హరి : ఇదిగో ఈ నక్షత్రకునకు తెలియును.

కాల : సరే! ఇంతటి యందకత్తె కెంత యిచ్చిన నీయ వచ్చును. ఇచ్చును. మరి భార్య నమ్ముట యనగా నేమో తెలియునా!

హరి : అదికేమో అదియెందుకోలో నున్నది.

కాల : నీకు తెలియదు. తెలియజేసెదను. ఒసేవు చంద్రమతీ! యిట్లు రా.

చంద్ర : స్వామీ! చిత్తము.

కాల : ఓసి దురాగ్రహరాలా! నీకు బుద్ధిలేదా! నీవు మనిషివా? పసువవా?

చంద్ర : స్వామీ! ఆజ్ఞాపింపుడు.

కాల : ఆజ్ఞాపింపవలయునా! బుద్ధిలేనిదానా! చెప్పకుండ తెలిసికొనలేనట్టి మందమతీ! నా కాలిని మన్నున్నది. తుడువ నక్కరలేదా?

చంద్ర : చిత్తము.

కాల : ఓసి చవటదద్దమ్మ! పైటతో తుడిచెదవేమే! ఓయమ్మ సుకుమారీ! చేతులేమి విరిగిపోయినవా! రోగమా! నడుము వంచలేవా! రాచకూతురయ్య, రాచకూతురు! మహారాణి! పూట కూటికి టికాణా లేదు. నాజూకు పోవుచున్నది. నీవు పనులన్ని చేయరా! ఏమి! తెలిసినదా! మనదగ్గర నీయాటలు సాగవు. కోశెడంత డబ్బు పోసి కొన్నాను. ఇదిగో గడ్డితిను అన్నచో తినవలసినదే. ఈచ్ఛనీచాలు ఇటువంటివి మనదగ్గర లేవు. నాకు ఒకేలు మండినప్పుడు గొడ్డును బాదినట్లు బాదినాసే. ఓసి వక్కా! ఏమిచూపులే. అబ్బో! వంగవాచి రా! మాటంటే పడదు. ఏమి కోపము! కోపమేమిటే! కోపమెందుకు! దమ్మిడీకి అమ్ముడుపోయినదానవు. నేను చేతులార కొన్న సొమ్ము నీయమ్మ మగనిసొమ్మనుకున్నావా! అంతే! ఏమనినను సరే. తక్కిన పని చెప్పి పడియుండవలసినదే. వింటున్నావా! వెన్నుపాము విరుగును. మాడుచెక్క పగులును. చావు. అంతే. ఏమి దయా! నీకునా! దయ యెందుకు? నీవొక పనిముట్టువు. పూచికపుల్లలో పుల్లలాడినచో నెంత దిగులో నీవు దుఃఖపడినచో నా కంత దిగులు. నీవు శ్రమపడినచో నా కంత దిగులు. ఏమిటి! యేడ్చుచున్నావా! నోటిలో గోకలిబంత క్రుక్కెదను. ఏదీ, యేడుపు బయటకు రానీ, చెప్పెదను.

నక్ష : కాలకౌశికా! చాలు లేవయ్య! పట్టపదిక్షణముననే యింత చేయుచున్నావు, ఇంటికి దీసికొనిపోయి యింకెంత చేసెదవో?

కాల : చేయక ముద్దుపెట్టుకొనెదనయ్య! హరిశ్చంద్రమహారాజా! భార్య నమ్ముట యనగా నేమో తెలిసినదా!

హరి : తెలిసినది మహాస్వామీ!

కాల : తెలిసికూడ నమ్మెదవా!

హరి : తెలిసికూడ నమ్మితిని స్వామీ!

కాల : ఓరి బ్రతికి చెడినవాడా! నేను పెంచుచున్న కుక్క నెంతైన నేమైన ననినను లోక మోర్వలేదే! చేసికొన్న భార్యను నేనిట్లు బాధింపగా నీ మొగముకూడ గందలేదు. అకట! యెంతటి మార్దవ్యము లేనివాడవు. మన వస్తువును పెఱవాడు తనదిగా జూచిగా నిరాకరించగా తిరస్కరించగా కొంచెము కాకపోయిన కొంచెమయిన మత్సరత్వము పూననివానిలో ప్రాణమున్నదని చెప్పుటకు వీలులేదు.

నక్ష : ఓయి కాలకౌశికుడా! నీ వింక చంద్రమతిని తీసికొని పొమ్ము. హరిశ్చంద్రా! నే నెంత బుద్ధిహీనుడను.

హరి : ఏమి వటూత్తమా! అట్లనెదవు?

నక్ష : పోనీలే, నా గురువుకన్న బుద్ధిహీనుడను కాలేదు.

హరి : శివశివ! అవి యేమిమాటలు?

నక్ష : సరేలే. నాగురువుయొక్క కనులయెదుటనే నీవు కామక్రోధలోభములను మూడును గెలిచితివి. నా యెదుట మోహ మదమాత్సర్యములను గెలిచితి వనట తప్పేమి? ఆయనకన్నను నే నెంతవాడను! ఆయనకే పారాగరము లేదు, నాకా?

హరి : ఏమి వటూత్తమా! నామీద కోపముగా నున్నదా?

నక్ష : కోపముగా నున్నదా! నెమ్మదిగా నడుగుచున్నాను. సరే. నీ కొమారు డేడీ?

హరి : వాని తల్లి వెంట బడి పోయినాడు.

నక్ష : ఓహో అలాగా? భార్య నమ్మితివా; కొడుకును గూడ నమ్మితివా!

హరి : స్వామీ! నాభార్య నన్ను పరిత్యజించిపోయినదా! నా కొడుకును నాకు వదలిపెట్టి పొమ్మనుటకు?

నక్ష : ఏమిరా? చెప్పవు! ఇంకను నీభార్య నీకు భార్యయని యేనా నీ యూహ?

హరి : స్వామీ! ప్రాణమున్నంతవరకు నా భార్యయే.

నక్ష : అమాత్రమైన నున్నావు. అక్కడనే నాకును.

హరి : సరి నేను సెలవు తీసికొందునా?

నక్ష : సెలవా! విశ్వామిత్రుని బుణము మాట యేమి?

హరి : కాలకౌశికుడు తీర్చునుగదా?

నక్ష : ఇదుగోనయ్యా! నీకు బ్రతికియుండినగాని బ్రపంచ జ్ఞానము కలుగదు.

హరి : బ్రాహ్మణాశీర్వచనము.

నక్ష: అది చాల సమృద్ధిగా నున్నది. దారిక్షేమి? ఆ ధన మంతయు నా భర్త్యపు ఖర్చుక్రింద నేను తీసికొన్నాను. మునిఋణ మట్లే యున్నది.

హరి: స్వామీ! నన్నేమి చేయదలచినావు?

నక్ష: నీవు ప్రతిజ్ఞయు జచ్చినట్లేగదా! చచ్చినవాని నేమి చేయుదురు?

హరి: కల్లు కాటికి జేర్చుదురు.

నక్ష: సరిగా నదియే చేయబోవుచున్నాను.

హరి: చేయుము.

నక్ష: నిన్నమ్మి విశ్వామిత్రుని ఋణధనము సంపాదింతును.

హరి: అమ్ముము.

నక్ష: నాచేత గాదు. నీవే నిన్ను అమ్మిపెట్టుము.

హరి: చిత్తము.

(కీర్తన)

చచ్చెనో బ్రతికెనో జనపాలు డీతండు
వచ్చి జనులు వెల యిచ్చి కొనండీ!
కచ్చపట్టిన మౌని గాధిజు ఋణధన
మిచ్చి జనములు వెలతెచ్చి కొనండీ—చచ్చెనో!
మచ్చర మెఱుగడు మమకార మెఱుగడు
ఇచ్చిన వెల తిరిగివచ్చినట్లే యెల్ల—చచ్చెనో!

నక్ష: హరిశ్చంద్రా! కేకలు వేయుచు నెచ్చటికి వచ్చితిమో తెలియునా? సరిగా శ్మశానమువరకు వచ్చితిమి.

హరి: నీవు కోరినదియు నదియేకదా!

నక్ష: ఈ శ్మశానమునకు నే నొక నామకరణము చేయుచున్నాను.

హరి: మహర్షి శిష్యుడవు. నీ మాట కెవరు కాదందురు?

నక్ష: దీనికి ఏమని పెట్టితినో యడుగవేమి?

హరి: చిత్తము. చెప్పుడు.

నక్ష: హరిశ్చంద్రఘట్టమని

హరి: హరిశ్చంద్రఘట్టమా! కటకటా! ఎందుకయ్యా నన్నన శవము చేయుదువు?

నక్ష: నీ వేమి తక్కువవాడవా! శివునియంతవాడవు.

హరి: కటకటా! నేను దరిద్రుడను. మా యప్పు తీర్చజాల కున్నాను. నన్నెవరును వచ్చి కొనరైరి. మా యప్పు తీర్చ జాలమి నీవు నన్నింత వెక్కిరించుచున్నావు.

నక్ష: ఏమి నీవు శివునియంతవాడవు కావంటివా!

హరి: స్వామీ! నీదయ. నన్నెవరిచేతనైన గొనిపించుము. నా భార్యను గొనిపించితివి. నా ఋణమును నీవే విమోచనము చేయ వలయును.

నక్ష: అయ్యో! నీ కోసమా? నా కోసమే. ఇచ్చట వీరబాహుడని యీ శ్మశానపాలకు డున్నాడు. అతడు కల్లు సారాయము లమ్మి చాల సంపాదించినవాడు. ఇంతకన్న మరియొవ్వ డీయగలడు? ఈ ముక్తిక్షేత్రములో నే నెఱుగనివారు లేరు-తెలియునా!

హరి: సర్వతపోమూర్తిశిష్యుడవు. నీకు ముక్తిక్షేత్రము తెలియదని నే నెట్లనుకొనెదను?

నక్ష: అడుగో వీరబాహుడు.

వీర: ఏందయ్యాది!

నక్ష: ఈయనపేరు హరిశ్చంద్రుడు.

వీర: ఇంకేం? తన గట్టంలోకే వొచ్చాడు.

హరి: నక్షత్రకా! నమస్కారము.

నక్ష: ఎందుకయ్యా!

హరి: ఓయి స్వామీ! నీవు ఋషిశిష్యుడవనుకొన్నాను. నీవు మహర్షివే. నీ సంకల్ప మిట్లు సమకాలమున భూతకోటికి విదిత మగుచున్నది.

వీర: ఏంటంటాడు, అరిచ్చంద్రయ్యా?

నక్ష: ఈయన విశ్వామిత్రఋషికి ఋణపడినాడు. నీ వీయన చాకిరిగా కొని ఆ ధన మీయవలయును.

వీర: దరిద్రపోణ్ణి తెచ్చావు! ఛీ! లేకపోతే ఋణం ఎట్టా తీరుతుంది? పో. దబ్బిస్తాలే. ఇదిగో నంబ్రోయి! దొరగారూ! అరిచ్చంద్రమారాజుగారూ! ఛీఛీ! నీవు నాదానుడవేటి, నిన్ను దొరా యేటి! ఇదిగో అరిచ్చంద్రయ్యా! ఈ కాటికి నీ వింక అతికారివి. దరం దగలేత్తే నాకు రొండుమూడు లొత్తాయి. నీకు దరం మీద సగపీలి కొత్తది. ఒక చోలెడు గింజ లొత్తయి. నాయంగా బతుకుదుమా. నేను మా పెడ్డోణ్ణి. ఎనుడుదిగబొచ్చిందా, మెడకాయమీద తలకాయుంటదేయి! పోతుంటా. ఒళ్లు దగ్గరెట్టుకు బతుకేం! తెలిసిందా!

హరి: చిత్తము. నన్నేలినవాడా!

వీర: సెబాస్. అదీ తరహా! పోతుంటా.

హరి: వటూత్తమా! ఇంక సెలవు. సర్వఋణవిముక్తుడ నయితిని గదా!

నక్ష: అప్పుడే యెక్కడ తీరినది? మునిఋణము తీరినది. మరి క్రొత్తఋణ మేర్పడినది కదా! వీరబాహుని సేవాఋణము. అది యీగవలయును.

హరి: స్వామీ! దీనిని నా శరీరముతో నీగెదను.

నక్ష: ఓయి శ్మశానవాసీ! నీ శరీర మెవరికి గావలయు నయ్యా! పోయి మా గురువుతో జెప్పెదను.

హరి: ఏమని?

నక్ష: మన ఋణము మాత్రము తీరినదని.

హరి: నా కర్మమునట్లు లేదు.

నక్ష: దరిద్రుని కర్మమెట్లుండును? సంపూర్ణ మే యగును. నేను పోవుచున్నాను.

హరి: ఆహా! నక్షత్రకుడు వెళ్లినాడు. ఇది చిత్రముగా నున్నది. భార్యాపుత్రులు వెళ్లి కనిపించరేమి. ఈ బ్రాహ్మణవటుతో

నెల్లినా దనిపించుచున్నది. నిజమే, అతడు చెప్పినదానిలో గొంత నిజమున్నది. భార్యావియోగము, శ్మశానవాసము. అందులో గాశీ క్షేత్రమున. ఇది యొక శివయోగము.

మరి కాలకౌశికు డేమన్నాడు?

అకట శివుఁడిడి ప్రోగె నా యప్రతిష్ఠ
నాకు హృదయంబునను ప్రోగు నా ప్రతిష్ఠ
చంద్రమతి యేమి యయ్యెను జంటివాడు
లోహితుం డేమియయ్యె నా లోహితుండు!

ఆ దూరాన నే నెఱుఁగని మంట యొక్కడిది? నాకు దెలియకుండ నెవ్వరైన శవదహనము చేయుచున్నారా! ఓహో! ఎవరు వారు? ఎవరమ్మా నీవు? ఈ యర్ధరాత్రమున నిచట నేమి చేయుచుంటివి? ఇది వీరబాహుని శ్మశాన వాటిక. ఆయనయాజ్ఞ వినా యిచట పురుగు మెదలరాదు. కాటిసుంకము చెల్లించకుండ నిట శవము దహింపరాదు. కాటి సుంకము రెండుమాడలు. నా కొక పోలెడు గింజలు. శవముపైని గుడ్డకూడ నాకే వచ్చును.

చంద్ర: అయ్యా! నేను పరమదరిద్రురాలను. వీడు నా కొడుకు. పాము కఱచి చచ్చిపోయినాడు. నే నేమి చేయుదును?

హరి: నేనుమాత్ర మేమి చేయుదును? అంత దరిద్రురాలైనచో నాకు రావలసినది వదలుకొనెదను. మా యజమానికి పోవలసిన రెండుమాడలు చెల్లించితీరవలయును. అరే! నీకుగాదా చెప్పెడునది? లాగివేసిన కట్టెలు మరల నంటించెద వేమి! ఇదిగో చెప్పుచున్నాను. ధర్మభంగమువలన నాకు గోపము రాగలదు.

చంద్ర: ఏమి, ధర్మభంగమువలని కోపమా! శ్మశానములో నిట్లు మాటాడువా రెవరు?

హరి: ఏమున్నది, అంత యాశ్చర్యము! పరమశివ నిలయము, సర్వధర్మపరమధామమయిన శ్మశానమున ధర్మనిబద్ధత యంత యబ్బురమా!

చంద్ర: అయ్యా! కాదుకాదు. నాదే పొరపాటు. క్షమింపుము. అయ్యా! ఈ బిడ్డతండ్రి యొకనాడు మహారాజు—నే డిట్లయి నాడు.

హరి: ఒకనాడు మహారాజు. నే డిట్లయినాడు.

చంద్ర: రెండు మాడలు తేలేను.

హరి: పోయి నీ భర్త నడిగి తెమ్ము.

చంద్ర: అయ్యా! నా భర్త ఋణవిముక్తికై నన్నమ్మినాడు.

హరి: ఎవరికి?

చంద్ర: ఒక బ్రాహ్మణునకు.

హరి: ఆ బ్రాహ్మణు నడిగి తెమ్ము.

చంద్ర: ఆయన యీయఁడు.

హరి: పాలించుచున్న బ్రాహ్మణు డీయఁడు. పాలింపని కాటినాయకు డిచ్చునా. పో.

చంద్ర: అయ్యో! అంత కఠినత యేలనయ్యా! కొంచెమయిన దయ లేదా!

హరి: నాకా దయలేదు? ధర్మఘ్నునకు దయ లేదు.

చంద్ర: ఇది రెండవ మాట.

హరి: నీ వేమనుమానపడుచున్నావో నాకు దెలియును.

చంద్ర: ఏమనుమాన పడుచున్నాను?

హరి: అనుమానము కాదు. నిజమే.

చంద్ర: ఓయి స్వామీ! కడుపున బుట్టిన బిడ్డమీద దయ లేదా!

హరి: చంద్రమతీ! కొంచెముసేపు మాటాడింపకుము—

మోహాటవి జరించు మనుజుల కుపగిరి
నై లసుత్కులంబున నృత్యమాడు
ఆశామహాశాఖలందు భ్రమించు బు
భ్రులటన్న ఫలముల రుచి మెలంగ
కోయి కపాలి! భిక్షూ! యీ మనస్సన్న
చపలాతిచపలంబు కపివరంబు
భక్తిపేరిట రజ్జుబంధనంబునం గట్టి
నీ యధీనంబున నిలుపుకోవె

బాలచంద్రమఃశేఖర! పర్వతేంద్ర
దుహితృలేఖితకుటుంబి, నిర్ధూతకలుష
పశుపతీ! పల్లు త్రెంచుక పాఱిపోవు
పసుల బందను లంచి కాపాడుమయ్య.

ఏమన్నావు? పిల్లవానిని పాము కఱచినదా!

చంద్ర: అవునయ్యా! మహారాజా!

హరి: శివాజ్ఞ.

చంద్ర: మరి యిప్పు డేమి చేయుదము?

హరి: ఓసి సర్వదరిద్రుని పెండ్లమా! వీరబాహుడు నాకు పాలకుడు. నీవును, నీ కొడుకును నా పాలనములో లేరు. మీ రితరులు, ఇతరుల కొరకు నేను వీరబాహుని నెట్లమ్ముదును? నీవు పోయి కాలకౌశికు నడిగి రమ్ము. దయపుట్టి యిచ్చునేమో!

చంద్ర: ఈయనిచో?

హరి: ఈయనిచో నా! మనము పరమశైవులము. శైవులకీనాటినుండి దహనముకాక ఖననమే ధర్మముగాక.

చంద్ర: పోయి యడిగివత్తును.

హరి: సరే. చంద్రమతి వెళ్లినదా! లోహితుని శవ మిచట నున్నదా! వీడు నాలోనున్న మాయాజీవునకు కొడుకన్న భ్రాంతి కలిపించినవాఁడా! (నవ్వుచుండును).

రాజభటుడు: ఓహోయి! శ్మశానములోని సంతోషీ! నేను రాజభటుడను. ఈ యాజ్ఞ వినుము.

హరి: నీవు రాజభటుడవా? నీరాజాజ్ఞతో నాకేమియు సంబంధము లేదు. నేను వినను. వినవలసిన పని లేదు. పో.

రాజ: ఇది రాజాజ్ఞ కాదు. వీరబాహుని యాజ్ఞ.

హరి: శిరసావహించుచున్నాను. చెప్పుము. వెంటనే నిర్వహించెదను.

రాజు : ఓయీ ! యీమె బాలఘాతకి. నగలమీది యాసచేత రాజశిశువును వధించినది. పరమదురాగ్రహులు. రాజప్రాసాదమునకు కన్నము వేసి నిదురవోవుచున్న రాజశిశువు నెత్తుకొనిపోయి వాని కంఠము నులిమి చంపినది. వెంటనే సూర్యోదయాత్పూర్వమే దీని శిరశ్ఛేదము చేయవలయునని రాజాజ్ఞ. వీరబాహుడు నీ కీపని నియమించినాడు. ఇదిగో వధ్యవరాలు. నేను పోవుచున్నాను.

హరి : ఓసీ ధనాశాదూషితురాలా ! రమ్ము. ఈ వధ్యశిల వధిరోహింపుము.

చంద్ర : మహారాజా !

హరి : ఎవరు చంద్రమతీ !

చంద్ర : అవును స్వామీ ! నేనే. పిల్లవానిని పాము కరచినచో నెవరిని నిందింతుము ? ఇట్లన్యాయముగ రాజశిశువధ నామీద బెట్టుట కెవరినో నిందించుటకు ?

హరి : ప్రియురాలా ! నిజమే. ఇది వ్యాజముగ గనిపించును. కాలకౌశికునింటికి బోలేదా ?

చంద్ర : లేదు. దారిలోనే యిది జరిగినది. రాజభటులు నన్ను పట్టుకొన్నారు. రాజువద్దకు నను గొంపోవుటయు, మరణశిక్షయు నిమేషములో జరిగినది.

హరి : చంద్రమతీ ! నీవు కాశిరాజకుహితవు. నిన్ను రాజు గుర్తుపట్టలేదా ?

చంద్ర : ఓయి ప్రభూ ! కాశికాపురి తన కూతు నన్నును, ఆల్లుని నిన్నును బట్టపగలే గుర్తుపట్టలేదు. అర్ధరాత్రియందు రాజు తన సోదరిని గుర్తుపట్టునా ?

రాజు : నీవు చెప్పికొనలేదా !

చంద్ర : స్వామీ ! నీలోనున్న యాంతరవస్తువునకు జీవలక్షణము పోయి లోకజ్ఞానము లోపించినది.

రాజు : నిజమే. ఎట్లు చెప్పికొందువు ?

చంద్ర : మహారాజా ! సూర్యోదయము కాకముందు నా శిరశ్ఛేదము చేయవలయును. లేనిచో ధర్మభంగ మగును.

రాజు : నిజమే. కాని యిది చూచితివా ! ఇది యెప్పటి కప్పుడే క్రొత్తసృష్టి. పుత్రేషణము గెలుచుటకు భగవంతుడు సర్పరూపమున సాయముచేసినాడు. దారేషణము గెలుచుటకు సాధ్యముకాని స్థితి కల్పించినాడు. అట్లే నిన్ను రాజభటులే వధింపక పోయిరి ! నేను చేతులారా వధింపవలయునా ? నిజమే. నా గెలుపు సంపూర్ణమైనది కావలయును. వ్యాజ మేల గావలయును ?

ఇట్లు రమ్ము. ఈ వధ్యశిల నధిరోహింపుము.

ఈ దుఃఖమే మోహము. అవిముక్తభూమియందు మరణించిన నా భార్యాపుత్రులకు శివసాయుజ్యము కలుగును.

విచారించవలసిన పనిలేదు.

ఇదిగో నాకత్తిచివర దారేషణనిరాసము లగ్నమైయున్నది.

శివశివ శంభో మహాదేవ !

విశ్వా : రాజా ! ఆగుమాగుము.

రాజు : ఎవరు నీవు ?

విశ్వా : నేను విశ్వామిత్ర మహర్షిని. శునశ్శేపుని జీవరక్ష చేసినవాడను. త్రిశంకునికొఱకు రెండవ స్వర్గము నిర్మించినవాడను. సర్వదేవతలను తిరస్కరించి బ్రహ్మర్షి నైనవాడను.

రాజు : ప్రభూ ! తూరుపురేక లాడుచున్నవి. కొంచెము తొలగి నిలువుడు. ఈ ధర్మనిర్వహణము సూర్యోదయాత్పూర్వము చేయదగినది. తరువాతి భవత్సపర్యాబుద్ధి నగుదును.

విశ్వా : ఏ ధర్మనిర్వహణము ? భార్యను వధించుటయా !

రాజు : స్వామీ ! భార్య యెవరు ? భర్త యెవరు ? ఇది యొక పెద్ద భ్రాంతి.

ఈ శరీరంబు లేదను మెట్టులుండు
నప్పుడు జీవుడు వాని భార్య యది యెవరు ?
కొడు కారు ? తత్స్వరూపమే కడిది ; దేహ
గత పరిభ్రాంతి కల్పితాగత మఖిలము.

విశ్వా : సర్వధర్మము శరీరస్థితి కల్పితము. నీవు ధర్మమని దేవు లాడుచున్నావు గదా !

హరి : అట్లులేదు. బ్రహ్మర్షీ. సర్వము శివాధీనము. శివకైంకర్యము. శివలీలావిక్రియానిశేషమే. నేను చేయునది లేదను నిశ్చయమే యున్నది.

విశ్వా : మరి యపుడు భార్యను జంపనక్కరలేదు. ధర్మము చేయుచున్నాననుటయు భ్రాంతియే. నీ కొడుకును బ్రతికింతును. నీ రాజ్యము నీకిత్తును. లేచిరా. అంతటి రాజ్యభోగ మేల వదలికొందువు ? నా కూతుండ్రను మాతంగకన్యలను వివాహమాడుము. భ్రాంతియని తెలిసి చరించుటలో భ్రాంతి లేదుగదా.

హరి : ఇది యంతయు సౌఖ్యము కావలయు ననుకొనినగదా కావలసినది. ఈ సౌఖ్యము భ్రాంతిజన్యమని తెలిసినపుడు సౌఖ్యమే లేదు. మరి దేనికోసర మీ సంత.

విశ్వా : నీ వరిషడ్వర్గము గెలిచితివి. ఈషణత్రయమును గెలిచితివి. నీవు జీవన్ముక్తుడవు.

హరి : స్వామీ ! నా కదియేమియు దెలియదు. నేనా ! నేను లేనే. ఓహో యిది యేమి. ఇది శ్మశానము కాదు, కైలాసమా ? ఈ వధ్యశిల నందివాహపురమా ? ఈ చంద్రమతి పార్వతీ దేవియా ? ఈ లోహితుడు విఘ్నేశ్వరుడా ?

విశ్వా : నీవు శివైకదేశమువు.

హరి :

శివోఽహం శివోఽహం శివోఽహం శివోహం
సతోఽహం సతోఽహం గతోఽహం స్థితోఽహం
యదా భ్రాంతిముచ్ఛేతసాఽహం విధూతః
తదా జీవభావాహ మద్వైతవోఽహం.

శుం.

కథానిక

# తొలి చూలు

'శ్రీపతి'

"ఏమమ్మా... అత్తయ్యా... ఏమంటోంది కోడలు? మరిది గారు సర్కీటు వెళ్ళారా... వూళ్ళోనే ఉన్నారా?"

"వాడి కేమే... ఈ కట్టె కదలాడుతూ ఉన్నంతకాలం వాడికి ఇంటిగొడవే పట్టదు. వాడేమో, వాడి ఉద్యోగమేమో! కాస్త ఇంటిసంగతి చెప్పుకుందామన్నా క్షణం ఇంటిపట్టున ఉండడు. ఏం చెప్పినా 'ఆఫీసుజవాను వస్తాడు' అని దులపరించుకుపోతాడు."

"అవునత్తా! మావారూ అంతే. ఏమన్నా అంటే 'నువ్వే పోయి సంపాయించుకురా. నేను ఇంట్లో మహారాజులాగా కూర్చుంటాను. ఆఫీసుకు పోతే ఆగొడవ, ఇంటికి వస్తే ఈ గొడవ! సంపాయించుకువచ్చి పోస్తుంటే సంసారం నడుపుకునే తెలివలన్నా లేదు' అని నానాశాపనార్థాలూ పెడ్తారు."

"ఎంత ఉద్యోగాలు చేస్తేమటుకు- కొంపా గోడూ అక్కర్లేదూ? సీతమ్మకొడుకు చూడరాదూ! వాడు తాసిల్దారట. గడప కదిలివస్తే ఉండడు. సమస్తం సన్లయి అవుతాయి. జీతంకూడా ఎక్కువేట......"

"ఆ మాట అన్నావనే మొన్న నీకొడుకు తింటూ తింటూ ఉన్న విస్తరి వదిలి, కస్సుమని 'అయితే వాణ్నే కట్టుకోలేకపోయావు?' అని అడ్డమైన తిట్లూ తిట్టి, రెండురోజులదాకా కొంపచాయలకన్నా రాలేదు. ఉద్యోగం పెద్దదైతే ఎక్కువ జీతం, ఎక్కువ పనీ ఉంటుందట."

"అవున్లే మన కేం తెలుసు? పాతకాలంవాళ్ళం. ఇప్పుడంతే కొడుకుల్తోబాటు కోడళ్ళూ ఉద్యోగాలు వెలగబెట్టుకున్నారు. అవ్వ ముండలకు ఉద్యోగా లేమిటే అంటే, అటు అవీగా, ఇటు ఈయనా కూడా ధంయిమని లేస్తారు. ఇప్పుడు నీ తోడికోడలు సంగతి చూడరాదూ..."

"ఏమోలే, మన కాలం ఎట్లాగో వెళ్ళిపోతుంది. వాళ్ళోడలు కాపరాని కొచ్చేసరికి కొడుకు ఎక్కడో ఉద్యోగం చేసుకుంటూ ఉంటాడు. వాళ్ళతిప్పలు వాళ్ళు పడతారు. పొద్దెక్కుతోంది. పోరా... ఆఫీసుకు కాస్త ఆలస్యమైతే అన్నంకూడా తినకుండా పోతారు......"

"పోదువుగాన్లే, రా. బిందెడు నువ్విళ్ళు నేనూ తెచ్చుకోవాలిగా! చదువుకు నేనూ వస్తా. ఎనిమిదేస్తున్నారు. అది ఇప్పటికి మొహమన్నా కడుక్కుంది కాదు. కాఫీ ఇప్పటికి నాలుగుసార్లు వెచ్చబెట్టి లేపితే..."

"వొంట్లో ఏమీ కులాసా లేదు కాబోలు. డాక్టరుగారికైనా చూపించకపోయారూ? పిల్ల మరీ పాలిపోతున్నట్టుంది!........

సుశీలా... ఎట్లా ఉంటోంది? లేచి పెందరాళే కాస్త కాఫీ తాగితే కొంచెం కులాసాగా ఉంటుంది. లే... పాపం అత్తగారు మనిగట్టుకోవడానికి నీకోసమే కనిపెట్టుకుంది."

"నాకేమీ బాగుండటంలేదు అక్కయ్యా. వొళ్ళంతా నొప్పులు. ఏమీ తినా లనిపించదు, తాగా లనిపించదు. నీరసంగా ఉంటుంది. లేచే ఓపికకూడా ఉండదు. పాపం! అత్తగారు ఇటు నా పనితో, అటు ఇంటిపనితో సతమత మైపోతున్నారు."

"పొట్టప్పుడే ఇటు చెంబు తీసి అటు పెట్టలేనిదానవు. ఇక ఇప్పుడు నువ్వేం చేస్తావు? ఇంతకూ అదృష్టం ఉండొద్దూ... కూర్చోబెట్టి కాచిపోసే కోడలే వస్తే మన సంసారం ఇట్లా ఎందుకుంటుంది?... మా అత్తగారు ఉన్నన్నాళ్ళూ ఎంత చేసినా ఇంకా ఏదో ఉందనే చెప్పేది. అప్పుడింత తిడేవాళ్ళం. ఇంత చేసేవాళ్ళం. కాటికి కాళ్ళు చాపుకున్న ముండనైనా నేనే మేడుస్తాను! ఏదో ఆ కాస్తా బయటపడితే అప్పాట వైదిన వేసుకుపోదామని........"

"అత్తయ్యా, మీరు వెళ్ళండి. నే చూస్తా లెండి. సుశీలా... ఇదిగో పళ్ళపొడి. పాపం! మొహం కడుక్కుందుకు వేన్నీళ్ళు కూడా పెట్టింది. చూశావా అత్తయ్య అపేక్ష?......"

"అదంతా నామీదనా యేమిటి? ఆ పుట్టబోయేవాడి మీదే. పెళ్ళికిముందునుంచే మొదలుపెట్టింది... 'చదువుకున్న పిల్లంటుకుంటా... సరిగ్గా కాపరమైనా చేయలేరు. ఉన్న ఆ కాస్త సామాన్లు ఆర్చడానికీ, తీర్చడానికీ తీరిపోతుంది. ఈకాలపు పిల్లలికి కనడమూ చేతకాదు; పెంచడమూ చేతకాదు. అయినా వాళ్ళది ఉద్యోగపు ఫాయా. వాళ్ళతో మనం తూగలేం.' అని కొడుక్కి నూరిపోసింది.

పూర్ణానందం సెలవు పెట్టక తప్పింది కాదు. ఊళ్లో ఉన్న వైద్యుల కేమీ అంతుపట్టలేదు. పెద్దఆస్పత్రినుంచి ఆడడాక్టర్ను తెచ్చి చూపించమని అందరూ అన్నారు. "అక్కర్లేదులే. నిన్ను కడుపులో ఉన్నప్పుడు నాకూ ఇట్లాగే ఉండేది" అని వాళ్లమ్మ వారించింది. సుశీల చిక్కి మొగం వేసుకొని, ఆఖరుగడియలు వచ్చినట్లు, అవసానకాలం సమీపించినట్లు పూర్ణానందంకేసి జాలిగా చూచి కళ్లనీళ్లు పెట్టుకుంది. పూర్ణానందానికి ప్రపంచం ఒక్కసారి గిర్రున తిరిగినట్లయింది. సుశీల అంటే అతనికి పంచప్రాణాలూ. చెప్పిన మాట వినకుండా ఇలా చేశామే అనే పశ్చాత్తాపంతో సుశీలను ఓదార్చి ఆడడాక్టరును తీసుకురావడానికి స్నేహితుడి కారు తీసుకుని వెళ్లాడు.

శేషమ్మగారు మాత్రం చేరిన అమ్మలక్కలతో "ఏముందే... వాడు పిచ్చివెధవ! అని వాణ్ని దానిష్టంవచ్చినట్లు ఆడిస్తోంది. ఏమంత వచ్చిందని వందో ఎంతో పోసి దాన్ని తీసుకురావడానికి? ఈ వూళ్లో సుబ్బి ఎన్ని పురుళ్లు పోసింది! అయినా ప్రపంచంలో ఇంకెవ్వరూ పిల్లల్ని కనటం లేదా ఏమిటి? ఏదో రాకరాక వచ్చింది. అందులోనూ అది కొత్త అర్భకురా లాయెను. చదువు చదువని వొంట్లో ఉన్న జవసత్వాలను చంపుకుంటే మరి ఇట్లాంటివి వచ్చినప్పుడు కష్టమే. కాకపోయినా ఈ కాలం ఏదొచ్చినా ఇంతే. కనలేనని పిల్లల వద్దనుకుంటారుటమ్మా ఎక్కడన్నా? ఇంట్లో నలుగురు పిల్లలుంటేనే కొత్త కళకళలాడుతూ ఉంటుంది"

"నిజమే నవ్వా. పిల్లలు పుట్టకేదని చెట్లకూ పుట్టలకూ, దేవుళ్లకూ దేవతలకూ ప్రాణాచారం పడేవాళ్లు కొందరూ. పిల్లలు పుడుతుంటే అక్కర్లేదని కడుపుతీసుకునేవాళ్లు కొందరూ" అని రాజ్యమ్మ పెద్దకూతురు అనేసరికి "ఎవరే అదీ?...పిట్ట కొంచెం, కూత ఘనంఅన్నట్లే ఉంది......నాకు చూపుకూడా పోతోంది." అని శేషమ్మగారు పరామర్శిస్తుండేసరికి వాకిట్లో కారు హఠాత్తుగా ఆగిన చప్పుడెల్లే వినిపించింది.

"అమ్మా! ఎట్లా ఉందే సుశీల...? తీసుకువచ్చా డాక్టర్ని. ఆస్పత్రిమంత్రసానికూడా వచ్చింది. ఇంక ఫరవాలేదులే..."అంటూ పూర్ణానందం హడావిడిగా ఇంట్లోకి పోయి ఒక కుర్చీ ఎత్తుకొని సుశీలగదిలోకి వెళ్లాడు. డాక్టరు ముందు వెళ్లింది. మంత్రసాని సరంజామా అంతా తీసుకొని అక్కడ చేరినవాళ్లతో తన కాన్పుల అనుభవాలు చెప్పుకుంటూ పోయింది. "కొండ తవ్వి ఎలుకని పట్టిన కేసులు ఎన్నో ఉన్నాయి"అని మంత్రసాని అనేసరికి, మంగలిసుబ్బి "అట్లాంటివి నే పుట్టి బుద్ధెరిగినతరువాత ఈవూళ్లో ఇంతవరకూ ఒక్కటే లే"దన్నది.

అందరికీ ఆందోళన ఎక్కువైంది. డాక్టరు ఏమంటుందో అని అందరూ అటుకేసే చూస్తున్నారు. ఇదంతా చూసేసరికి అంతటి శేషమ్మగారికీ దడ పుట్టుకువచ్చింది. ఏదో పుట్టిమునిగిందని కంగారు పడింది. దీనికితోడు వచ్చిన డాక్టరు ఊళ్లోవున్న డాక్టరుకు కబురు పెట్టింది. ఇద్దరూ గదిలోనుంచి బయటికి వచ్చి అంతా అనుమానంగా ఉన్నట్టు మొహాలు పెట్టి "ఏంచేద్దాం"అని నేలకేసి చూస్తున్నారు. "ఏమైనా సరే ఆపరేషన్ చేయాల్సిందే" అని ఆఖరికి ఆడడాక్టరు అనేసరికి "నిండుచూలాలి కడుపు కోయడం ఏమిట్రా"అంటూ శేషమ్మగారు స్పృహతప్పి పడిపోయింది. ఆ మాటే ఆమెకు ఏదో అవాచ్యంగా తోచింది.

వైద్యులిద్దరూ సంప్రతించుకొని అక్కడే ఆపరేషనుకు అన్నిఏర్పాట్లూ చేశారు. పూర్ణానందంకూడా ఏమనడంలేదన్నమాటే గాని, పాపం నీరైపోయి గది ఇవతల గోడకు ఆనుకొని ఎదురుగా ఉన్న గోడకు తగిలించిన సుశీలపెళ్లి ఫోటోకేసి రెప్పవాల్చకుండా చూస్తున్నాడు.

"అంతా అయింది. కొంచెం హార్లిక్స్ పెట్టి ఇవ్వండి. చాలా బలహీనంగా ఉంది. పాపం, వొంట్లో రక్తంకూడా లేదు" అన్నాడు వూరి వైద్యుడు మెల్లిగా బయటికి వచ్చి. అసలు సంగతి చెప్పడేమని అందరూ కోపంగా చూస్తున్నారు. మూలపడి మూలుగుతూఉన్న శేషమ్మగారు "మనమడా, మనమరాలా?"అని అంటూ లేవబోయింది. పూర్ణానందం పోయి స్టవ్వు ముట్టించి ఇంత హార్లిక్సు కాచి ముందు తల్లికిచ్చి, తరవాత గదిలోకి తీసుకుపోయాడు. డాక్టరు సుశీల తలవైపు కూర్చుని ధైర్యం చెబుతూ ఉంది. పూర్ణానందం భయపడుతూ, గాంతిలో ఏమైనా పడిందేమో, మావెలోగాని ముఖం చూపరాదేమో అనే సంకోచంతో నాకిలివద్దగా ఉన్న బల్లమీద కప్పుపెట్టి బయటికి పోతుంటే "ఫరవాలేదు, రండి" అని డాక్టరు పిలిచింది.

సుశీల పక్కమీద ఒంటరిగానే పడుకొనిఉంది. నాల్గువైపులా చూచాడు. ఏమీ కన్పించలేదు. అసలు కెవ్వుమనే కేకైనా వినిపించింది కాదు. అతనికి దడుపు పుట్టుకువచ్చింది. "భయపడకండి. మీ రనుకున్న దేమీ కాదు" అని సుశీల ఆ నీరసస్వరంలో కూడా తనే గెల్చాననే ధీమా వెళ్లబోస్తూ అన్నది.

పూర్ణానందానికి అర్థమైంది. ఇంత బాధ పడిసా ఇలా అయిందా అని కొంచెం విచారించి తల్లిదగ్గరకు వెళ్లాడు. "అమ్మా, ఏం ఫరవాలేదు లే. సుశీల బాగానే ఉంది. దాని కేం భయం లేదని డాక్టరు చెప్పింది" అన్నాడు. "పిల్లకి బొడ్డుకోశారా, లేదా?" అంటూ లేవబోతూఉండగా మంత్రసాని దోసిట్లో గుడ్డ కప్పి ఏదో తీసుకురావడం చూసింది. ఒక్కసారి ఆవురుమన్నది....పూర్ణానందం గ్రహించి "అది అది మనం అనుకున్నది కాదులే. ఏదో బల్ల పుట్టుకువచ్చిందిట. ఇంకా కొన్నాళ్లుంటే మరీ ప్రమాదం అని డాక్టరు అంది" అని తలకాయ వంచుకొని వాళ్లమ్మచెయ్యి పట్టుకొని ఏదో చెప్తున్నాడు.

అలా అంటుండగానే కాళ్లూ, చేతులూ చల్లబడినట్లయింది. డాక్టరును పిలిచాడు. డాక్టరు వచ్చి, నాడి చూసింది. గుండె పరీక్ష చేసింది. మూసిన కళ్లు అడుగు రెప్ప కిందికి లాగి చూసింది. వెంట వెంటనే నాలుగు ఇంజక్షన్లు ఇచ్చింది...మళ్లీ నాడి చూచి..."షాక్...సెరిబ్రల్ హెమరేజ్...పాపం"





# వసంతలక్ష్మి

వలపుల పూవుదోట నడిబాటకు గ్రేవల తమ్మిపూల క్రొం
గొలకులలో గుమంగుమల గ్రొవ్విన క్రొవ్విరికల్వతేనెసో
నలు తనివార ద్రావి, అళినాథకులమ్ములు వంత చేయ, కో
యిల యెలుగెత్తి పాడి పరువెత్తెను పండిన దొండపండ్లకున్.

నవసుమనోవికాసముల నవ్వులు నాణెము లొల్కబోయ, తా
వి వలపువాసనల్ దెసల బై పు వహింప, విలోలషట్పద
ప్రవరవినీలకుంతలతరంగము లొప్ప, కనత్ క్వణద్విహం
గవలయులై వసంతలతికాయువతుల్ విలసిల్లి రవ్వనిన్.

వలగొని గంధలోభమున పైపయి మూగు మిళిందబృంద మూ
ర్పుల గదలించు మావిచివురుల్ దిని కేకిసలాడు గండుకో
యిలల వినేయమండలికి నేర్పడ నేర్పుచు నున్నవాడు పూ
విలుకుని శాస్త్రమర్మముల నేర్మి వసంతగురుండు తోటలోన్.

లలితరసాలపల్లవములం దిని, మత్తిలి, కూరుచుండి కొ
మ్మల దరి పాటపాడు పికమండలికిన్, మధురస్వరమ్ముతో
బలిసి మిళిందబృందములు వంతలు పాడ దొషంగె పూలగు
త్తులపయి నూగుచున్ కలల దోగు వసంతుని నిండుకొల్వులోన్.

క్రోలుడు శుద్ధపాత్రముల కుత్తుకబంటి మధుద్రవంబులన్;
తేలుడు ప్రేయసీమణుల నెయ్యము తియ్యముగా రసాబ్ధి; నీ
హాలిని గోలుపోవకు; డనంతము గాదు వసంత; మంచు లో
కాలకు చాటి చెప్పె కలకంఠముతో పికరాజు పెద్దగాన్.



ఎక్కడి చందమామ? మరు డెక్కడివాఁడు? వసంతు డెక్కడో?
ఎక్కడి చల్లగాలి? పువు లెక్కడి? వెక్కడి గండుతుమ్మెదల్?
ఎక్కడి కోయిలల్? చిలుక లెక్కడి? వి ట్లివియెల్ల నేకమై
ఒక్కెడ గూడె బ్రహ్మన, వియుక్తుల పాపము గాక, కేళికో?

క్రొవ్విన యీ కదంబముల గుత్తులయంతగ తక్కినట్టి ఏ
పువ్వులుగూడ నన్ను వెత ముంచవు ప్రల్లదనంబు మీఱఁగా,
అవ్విరివిల్తు డీ దివసములందు మహాగుటికాధనుష్ము తా
ద్రెవ్వని మచ్చరమ్మున ధరించి చరించుచు నున్నవాఁడుగా!

ఏమియు కార్యరూప మగుపింపదిచో ఎలమా తోటలో
ఏమని మూగునే గళము లెత్తుచు మత్తసుమాంధ రూపళుల్?
వ్యోమము నంటివచ్చు తలలున్ మెలిసుళ్లను గ్రమ్మగా మహా
ధూమము లెట్టు లుప్పతిలు తోయ్యలి! నిప్పు పొసంగకుండినన్?

మదనమహాధనుర్ధరుడు మచ్చర మెచ్చగ పూలబాణముల్
పదనులు పెట్టి దాడి వెడలన్ భువనమ్ములపైని, వాని వా
ర్త దెలియఁబంచె ముందుగ ప్రధాని వసంతుడు దిగ్విదిక్కులన్
కొదకొని భీషణమ్మయిన కోకిలకూజిత ఘోషణమ్ములన్.

తనివున తేనెపానకము త్రావగ నిత్తును రండురండు మీ
రని పువుదీవబోండ్లు మధుపావళినిం దలిరాకుచేతులన్
పనిగొని పిల్తురా? రసపిపాసమెయిన్ రసికుల్ తమంత దా
మనయము గోరివత్తు; రది యంతయు తత్ప్రిబలస్వభావమా.

— గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి



# పరిశుభ్రతకు పూచీ

తాము తయారుచేసే సరకుల్లో అతి అమితమైన పరిశుభ్రత ఉండేటట్లు చూడటం పెప్పర్ మింట్లు వగైరా తయారుచేసే ప్రతివారికీ విధి. స్వీట్సు అపరిశుభ్రంగా ఉంటే, హాని చేస్తవి. స్వీట్స్ ఎక్కువగా తినేది చిన్నపిల్లలు. అందువల్ల తమ సావరిన్ స్వీట్స్ ప్రతిదీ కూడా అమితపరిశుభ్రంగా ఉంటుందని కె.సి.పి.వారు గట్టిగా చెబుతున్నారు.

దేశమంతా ఆదరించబడిన

## సావరిన్ స్వీట్స్

కె. సి. పి. తయారీ

KCK 5T6



విపినవిహారి

# రాజా సితాబ్ రాయి *

శ్రీ దిగవల్లి వేంకటశివరావు

భారతదేశము నేకచ్ఛత్రముగ నేలిన మొగలాయి చక్రవర్తులలో కడుసమర్థుడైన ఔరంగజేబు క్రీ. శ. ౧౭౦౭ లో చనిపోయెను. ఆయనసంతతివారు బలహీనులైనందువలన వివిధప్రాంతములనేలు సుబేదారులును, రాజప్రతినిధులును స్వతంత్రులై నవాబులుగ పరిపాలింపజొచ్చిరి. ఆ సమయమునందే మన దేశములో వర్తకము చేసికొనుచుండిన ఫ్రెంచివారును, ఇంగ్లీషువర్తకసంఘముల వారును ఈ యవకాశమును కనిపెట్టి మెల్లమెల్లగా రాజులను, నవాబులను త్రోసిరాజనసాగిరి. ఈ మార్పుదలకాలమున, మొదట మొగలాయిప్రభువుల దగ్గరను, తరువాత ఇంగ్లీషుప్రభువుల దగ్గరను ఉద్యోగముచేసి పేరుపొందినవారిలో రాజా సితాబ్ రాయిగా రొకరు. వీరి కాపురస్థలము 'షాజహానాబాదు' అని ఆకాలమున వ్యవహరింపబడిన ఢిల్లీనగరము. వీ రొక క్షత్రియకుటుంబమునకు చెందినవారు. ౧౭౧౯ మొదలు ౧౭౪౮ వరకును భారతదేశమునకు చక్రవర్తిగా నుండిన మహమ్మదుషాపాదుషాగారి మంత్రియైన ఖాన్ దౌరాన్ గారి ఖానిసగా నుండి గొప్ప పలుకుబడిని, గౌరవమును సంపాదించిన ఆగా సులేమాను అను నొక జార్జియాదేశీయుని దగ్గర సితాబ్ రాయిగారు మొదట నొక చిన్నగుమాస్తాగా ప్రవేశించిరి. తరువాత ఆయన తన యజమానికి తలలో నాలుకవలె నుండి విశ్వాసపాత్రుడై క్రమక్రమముగా గొప్ప యుద్యోగములను సంపాదించి పైకి వచ్చినాడు

ఢిల్లీ (షాజహానాబాదు)లో రాజకీయకల్లోలములు కలుగగా నిక నక్కడ నుండుట క్షేమకరము కాదని యెంచి, చక్రవర్తిగారి దర్బారులో తనకు కొందరు స్నేహితు లున్నందువలన వారి ప్రాపకమువలన ఆకాలమున 'అజీమాబాదు' అని పిలువబడుచుండిన పట్నానగరమునందు 'దివాన్' అను పన్ను వసూలుచేయు ఉద్యోగమును, చక్రవర్తిగారి మంత్రియైన ఖాన్ దౌరాన్ గారికి వంగరాష్ట్రమునం దుండిన జాగీరుల నజమాయిషీ చేయు నుద్యోగమును సంపాదించెను. వంగరాష్ట్రము మొగలాయీ సామ్రాజ్యములో నొక భాగము. దానిని సుబేదారు డను రాజప్రతినిధి పరిపాలించుచుండెను. క్రీ. శ. ౧౭౦౭ లో మహాసమర్థుడైన ఔరంగజేబుచక్రవర్తి చనిపోవగా ఆయనసామ్రాజ్యములోని సుబేదారులు బలవంతులై, పేరునకు మాత్రము మొగలుచక్రవర్తికి లోబడి దేశమునకు స్వతంత్రనవాబు లైరి. వంగరాష్ట్రనవాబైన అలీవర్దీఖాను తరువాత ౧౭౫౬ లో నవాబైన సురాజఉద్దౌలా చాల చిన్నవాడు. అతని యుద్యోగులు స్వార్థపరులు. సురాజఉద్దౌలా ఇంగ్లీషువర్తకుల పైని కోపించి వారిని దండింపవలెనగా నతని బంధువుడును, మంత్రియు నైన మీర్జాఫరు అతనిపట్ల ద్రోహముచేసి ఇంగ్లీషువారితో చేరెను. అంతట ౧౭౫౭ లో జరిగిన ప్లాసీయుద్ధములో నవాబుసైన్యము లోడిపోయెను. మీర్జాఫరు సురాజఉద్దౌలాను వధించి, ఇంగ్లీషువారి సహాయముతో వంగరాష్ట్రమునకు నవాబయ్యెను.

మీర్జాఫరు నవాబై ఇంగ్లీషువారి వశవర్తి యయ్యెను. క్రొత్త నవాబు అజీమాబాదు (పట్నా)కు వచ్చిన సమయమునందే మన సితాబ్ రాయిగారు కూడ అక్కడకు వెళ్లిరి. సితాబ్ రాయిగారు కొంత ధనముతోను, పరివారముతోను అక్కడికి పోయినందున ఆయనకు త్వరలోనే కొంత గౌరవము, పలుకుబడియు కలిగెను. అప్పటి కాప్రాంతములో ప్రముఖుడుగా నుండిన హైందవోద్యోగి రాజా రామనారాయణుడు. సితాబ్ రాయిగా రాయనను దర్శించి, ఆయనయనుగ్రహమును సంపాదించినాడు. క్రొత్త నవాబును కూడ దర్శించినాడు. అయితే వీరు తన యుద్యోగమును ఖాయపరతురని అతనికి నమ్మకము కలుగలేదు. అందువలన ఆ సమయమున వంగరాష్ట్రప్రభుత్వమున గొప్ప పలుకుబడి కలిగి మన దేశములో క్రమక్రమముగ బలవంతు లగుచున్న ఇంగ్లీషు వర్తకకంపెనీవారి సేనానాయకుడైన క్లైవు నాశ్రయించినయెడల చాలలాభము కలుగునని యెంచి సితాబ్ రాయి వంగరాష్ట్రమునకు రాజధానియైన మూర్షిదాబాదుకు పోయి ఇంగ్లీషుసేనానికి బహుమతుల నిచ్చి, ఆయన అనుగ్రహమును సంపాదించి, తాను చక్రవర్తిగారివలన సంపాదించుకొనిన ఉద్యోగములను ఖాయపరుపవలసిన దని మీర్జాఫరుకు సిఫారసులు తీసికొనివెళ్లెను.

* ఈవ్యాసము గులాంహుస్సేన్ ఖాన్ గారు పారశీభాషలో రచించిన 'సియర్ ముతా ఖరీన్' అను ఒక చరిత్రగ్రంథముయొక్క ఇంగ్లీషు తర్జుమా నాధారపరచుకొని వ్రాయబడినది.

పిమ్మట నతడు వంగరాష్ట్రనవాబుగారియొక్కయు, రామ నారాయణునియొక్కయు అనుగ్రహము నతిసులభముగ సంపాదించి, అప్పటి రాజధానీనగర మయిన మూర్షిదాబాదులో గౌరవముగను, సుఖముగను కాపురముచేయసాగెను.

సితాబ్‌రాయి ఇంగ్లీషువారి స్నేహమునకు పాత్రుడై, చక్రవర్తియైన షాఆలం పాదుషాతో వారు జరిపిన రాజ్యతంత్రమునందు వారి రాయబారిగా పోయి వారికి చాల సహాయము చేసెను. తరువాత అయోధ్యనవాబైన షుజా ఉద్దౌలాదగ్గర ఉద్యోగమునకు కుదిరి వారితో రాజీ కుదిర్చెను. చక్రవర్తి యీయనను బీహారుపరగణాకు దివానుగా నియమించెను. ఇంగ్లీషుసేనాధిపతియైన కార్నకుతోడి స్నేహాంకితముగా అజీంగర్, జాక్‌పూర్ల దగ్గర సాలుకు లక్ష రూపాయలు రాగల జాగీరు నొకదాని నతని కిచ్చిరి. చక్రవర్తితో రాయబారము జరుపుటకై క్లైవు ౧౭౬౫లో అలహాబాదుకు పోవునప్పు డీతనిని వెంటబెట్టుకొనిపోయెను. ఇతడు క్లైవుకు అంతరంగికు డయ్యెను. అజీమాబాదులోని ప్రజలకు సౌకర్యములు కలిగించుట కొఱకు పరిపాలనావిధానమునుగూర్చియు, ఫిర్యాదుల విచారణను గూర్చియు కొన్ని కట్టుబాటులు చేసి రామనారాయణునితో కలిసి పరిపాలింపసాగెను. కలకత్తాలోని కార్యాలోచనసభవారు సితాబ్‌రాయిని అజీమాబాద్ పరగణాకు ముఖ్యపరిపాలకునిగ నియమించిరి. తరువాత ౧౭౭౨లో వంగరాష్ట్రమున కంపెనీవారి ప్రధానదేశీయాధికారిగ నుండిన రెజాఖానుతో పాటు సితాబ్‌రాయినికూడ కంపెనీవా రనుమానించి పట్టుకొనిరి. రెజాఖాను చాల అన్యాయములు చేసినట్లు బయల్పడెను. సితాబ్‌రాయియందు దోషము లేదనియు విచారణవలన తెలిసెను. అంతట వా రతనిని వదలివేసి అతని యుద్యోగము వారతని కిచ్చిరి. ఆయనకీ విచారణవలన చాల మనఃక్లేశము కలిగినది. అతనికి ప్రపంచముమీదనే రోత కలిగెను. అతడంతట విరక్తుడై, కొలది కాలములోనే మరణించెను.

సితాబ్‌రాయి ఆ కాలమునాటి దేశీయమంత్రులలో చాల సమర్థుడు. వ్రాతకోతలయందు ఆయన చాల నేర్పరి యగుటయేకాక పరిపాలనయందు సమర్థుడును, యుద్ధములందు ధైర్యసాహసములు కలవాడును, గొప్ప కార్యసాధకుడు నై యుండెను. ఆయనను ఫకీరులు, చక్రవర్తులు ఆశ్రయించుచున్నను ఆయన గర్విష్ఠి కాలేదు. గొప్ప విద్యావంతులుగాని, గొప్పవంశీయులుగాని ఆయనదగ్గరకు వచ్చినపుడు అతడు వారిని చాల మర్యాదచేయును. ఎవరైన విన్నపము చేయవచ్చినచో వారు చెప్పుకొనుదానిని సావధానముగ విని వారు కోరిన కార్యము తనకు సాధ్యమైనచో వెంటనే చక్కబెట్టి పంపును. తనకు సాధ్యముకానిచో తా నేమియు చేయలేనందుకు చాల నొచ్చుకొని వారి నోదార్చి, చాల మర్యాద చేయును.

సితాబ్‌రాయిగారు నిర్వహించవలసిన రాజకార్యము లనంతములుగ నుండెను. కార్యభారమువలన నాతని కెప్పుడును విధి విరామము లేని పని యుండును. ఉదయము మొదలు మధ్యాహ్నము వఱకును, రాత్రిమొదలు తెల్లవారుఝామున మూడుగంటలవఱకును అతడు విధి విరామము లేక వచ్చువారికి దర్శన మిచ్చుచునే యుండును. అతడెన్నడును, ఎవ్వరిని తిట్టిగాని, అవమానించిగాని యెఱుగడు. అతడు మంచి ప్రపంచజ్ఞానము కలిగినవాడు. అన్నివస్తువుల ధరలను బాగుగా నెఱిగినవాడు. అనవసరముగ బేరములు చేసి వర్తకులను బాధింపడు. ఎవరికైనను బహూకరింపదలచినపుడు పొదుపు నాలోచించడు. అనవసరమైన వ్యయము చేయడు. తనకు కావలసిన వస్తువులనెల్ల చౌకగా నమ్ము చోటులనుండి వరుసగా తెప్పించుకొనును. అతడు చాల భోగి. ఆయనయింట నుండువా రందరికి నాతడు సకలసౌఖ్యములు కల్గించును. ఆయనవారి కే పెద్దమనుష్యులు వచ్చినను, వారి హోదానుబట్టి రకరకముల పిండివంటలు, పండ్లు, ఆహారపానీయములు వారికి పంపి గౌరవించును. తనయింట చేయు విందులలో మొగలాయిప్రభువుల ననుకరించి అతిథిసత్కారమును చేయుచుండును.

సితాబ్‌రాయి చాల మర్యాదను, గౌరవమును పాటించు నరుడు. ఆయనకు 'రాంజో'యను ఉంపుడుకత్తె యుండెను. ఆమెపై నాతనికి చాల ప్రేమ. ఐన నామెతో నాతడెప్పుడు మాటలాడునో ఎవ్వరికిని తెలియదు. అతడెన్నడు నామెతో బహిరంగముగ సరసమాడియెఱుగడు. అతడు జనానాలోనికి పోవుట యెవ్వరు చూడలే దని చెప్పుట యతిశయోక్తి కాదు. అతని ధర్మపత్ని ఒక క్షత్రియస్త్రీ. ఆమెవలన నాయనకు ఇరువురు కుమాళ్లు కలిగిరి. అతడామెకొఱకు ప్రత్యేకముగ నొక మేడ కట్టించెను. అతడు సంవత్సరమునకు రెండుమూడుమారులు మాత్రము ఆ మేడకు పోయి హిందూగృహస్థులు శాస్త్రప్రకారము జరుపవలసిన ఆచారధర్మములు నెరవేర్చుచుండును.

సితాబ్‌రాయిగా రెవ్వరికిని అపకారము చేయడు. కాని యాతనికిని కొందరు విరోధు లుండిరి. అయినను అతడు వారి నెన్నడు నగౌరవపరచి యెఱుగడు. పైగా వారి కాపద వచ్చినపు డడ్డుపడి రక్షించుచుండెను. తన స్వగ్రామమైన షాజహానాబాదునుండి ఎవ్వరైనను వచ్చిరని తెలియగనే సితాబ్‌రాయి వారి కన్నివిధములైన సహాయములు చేయుచుండెను. అతడు సర్కారుధనమును ముట్టుకొనువాడు కాడు. అందువలన నెంతకైన నేరైన సహాయము చేయ దలచినయెడల వారి కేదో యుద్యోగము నిచ్చుచుండెను. అది సాధ్యముకానిచో వారిని పిలిపించి ఏదో బహుమానము నిచ్చి తాను సహాయము చేయలేకపోయినందులకు విచారమును తెలుపును.

ఇస్లాముమతముకొఱకు ప్రాణములను బాసిన మహానుభావుడైన షెహ్ సయ్యదు మహమ్మదుగారి వంశీయుడైన షెహ్ షెరీఫ్

ఉద్దీక్ మహమ్మదుగారు అరబ్బీదేశములోని పవిత్రమైన యూఫ్రటీస్ నదీతీరమున గల పుణ్యభూమిలో నివసించు నొక ముదుసలి విద్వాంసుడు. ఆయన చాల యోగ్యుడును, పుణ్యపురుషుడును. ఆ పుణ్యభూమిలో మహమ్మదుగారి యల్లుడును, ఇమామును, షియా మతస్థుల కత్యంతగౌరవపాత్రుడు నైన అలీగారి గోరీ యున్నది. ఇది షియాశాఖ వారికి పవిత్రస్థలము. ఈ పుణ్యపురుషునికి కొన్ని చిక్కులు కలిగి దారిద్ర్యమున బడెను. అంతట నతడు హిందూదేశము పాడిపంటలతో తులతూగు దేశ మనియు, అక్కడ ముసల్మాను రాజ్యమునందు గల ధనవంతులును, ప్రభువులును అరబ్బీదేశములోని విద్వాంసులను, పుణ్యస్థలములకు యాత్ర పోయివచ్చిన వారిని ఆదరింతు రనియు విని, అక్కడికి ప్రయాణమై వచ్చి తన ఏనుబదవయేట ఢిల్లీలోను, ముర్షిదాబాదులోను కాలక్షేపము చేసెను. వంగరాష్ట్రమున కప్పుడు ముబారకుద్దౌలా నాజీము (సహాయ పరిపాలకుడు)గాను, మహమ్మదు రజాఖాను ప్రధానపరిపాలకుడుగాను ఉండిరి. వీ రిరువురును చాల ధనవంతులైన ముసల్మానులు. వారి తాబేదారులు కూడ గొప్ప ఐశ్వర్యము ననుభవించుచున్న వారే. అయినను వా రెవ్వరును ఈ ముదుసలివిద్వాంసు నాదరింపరైరి. అందువలన నీతడు తన జీవనాధారమునకై ఇంకొక చోటికి పోవలెనని అయోధ్యనవాబు షుజాఉద్దౌలా రాజధాని అయోధ్యలక్నో నగరములకును, షాఅలం చక్రవర్తి నివసించుచున్న అలహాబాదునకును పోయినచో అక్కడ సుఖముగ బ్రదుకవచ్చునని బయలుదేరెను. మార్గమధ్యమున ఆయన అజీమాబాదుకు రాగా 'సియరుల్ ముతాఖరీన్' గ్రంథకర్తయైన సయ్యద్ ఘులాం హుస్సేన్ ఖాన్ గారాయనను దర్శించి, తన మిత్రుడైన సితాబ్ రాయిగారి కాయన గొప్పదనమును గూర్చి చెప్పిరి. అంతట నీ మంత్రిగారు హిందువులైయుండియు, ఈ ముసల్మానుమతాచార్యుని దర్శింప బోయినప్పుడు తన పరివారమును, రాజలాంఛనములను బయటనే వదలి ఒక్కరిద్దరు సేవకులను, తనమిత్రుడైన మిర్ కవం ఎద్దీన్ ఖాన్ గారును తప్ప ఇతరు లెవ్వరును తనవెంట లేకుండనే పోయెను. ఆ పుణ్యపురుషుని సముఖమునకు పోగానే, అనురక్తితోను భయభక్తులతోను సాగిలబడి మ్రొక్కెను. ఈ గొప్ప మంత్రిగారు వచ్చుచున్నారని ఆ యాచార్యు డాయనకొఱ కొక తివాచీ వేసి దానిపైన ఒక పరుపును వేయించి ఎత్తైన ఒక మస్నదు (పీఠము)ను తయారు చేయించియుంచి, ఆయనను దానిపైన కూర్చుండవలసినదని ఎంత బలవంతము చేసినను, సితాబ్ రాయిగారు వలదు వలదని దానిమీద కూర్చుండక మర్యాదతో ఆముదుసలి విద్వాంసుడు కూర్చున్న తివాచికి అంచుచివరనే కూర్చుండిరి. తరువాత నొక గంటసేపాయనతో గడిపి, తన యింటికి దయచేసి తాను చేయు సత్కారము స్వీకరింపవలెనని వారి నెంతో వినయముగ ప్రార్థించి సెలవు పుచ్చుకొని యింటికి వెడలిపోయెను.

ఆ సాయంకాలము సితాబ్ రాయిగారు తమ యింట నొక పెద్ద తివాచీపైన పరుపు వేయించి దానిమీద పట్టుజరీబుటేదారిపని చేసిన కిన్ఖాబు వస్త్రమును పరపించి, తాను గొప్పగొప్ప యుత్సవ సందర్భములందు కూర్చుండునట్లు ఒక గొప్ప 'మస్నదు'ను ఆ విద్వాంసునికొఱకు అతిథిభక్తితో తయారుచేయించి, దానిదగ్గరనే ఒక తెల్లని తివాచీ వేయించి దానిపైన తాను కూర్చుండెను. ఆ సమయమున నితరు లెవ్వరును రాకుండ కట్టడిచేసెను. అంతట సాయంకాలపు ప్రార్థన యైనతరువాత నా ముసల్మాను పుణ్యపురుషుడును, సయ్యదు ఘులాంహుస్సేన్ ఖాను గారును సితాబ్ రాయిగారింటికి రాగా ఆయన తన యింటి ఆవరణమునందు సముఖముదగ్గరకు ఎదురుగా వచ్చి ఆయనకు నమస్కరించి వారిని చేయిపట్టుకొని తీసికొనివెళ్లి మస్నదుపై కూర్చుండబెట్టి ఎంతో భక్తితో అతిథిసత్కారమును చేయసాగెను. ఇంత గొప్పవాడైన యీ హిందూగృహస్థుడు విజాతీయమతాచార్యునిపట్ల నింత శ్రద్ధాభక్తులు చూపుచు గౌరవించుట చూచి ఆ ముదుసలి యాచార్యుడు చాల సంతోషించి "అయ్యా, భగవంతుడు తమకు ప్రసాదించిన సుగుణసంపదలో నొక కొంతయైన నీదేశపు ముసల్మానులకు ప్రసాదించియుండిన నెంత బాగుండును!" అని అరబ్బీభాషలో ననెను. ఈ మాటలను ఘులాంహుస్సేనుగారు సితాబ్ రాయిగారికి తర్జుమా చేసి చెప్పగా ఆయన యింతటి సదభిప్రాయమునకు తాను తగనని మర్యాదగా బదులుచెప్పి ఆయనకు వందనము లర్పించెను. ఆ విద్వాంసుడు వెడలిపోవునప్పుడు సితాబ్ రాయిగా రాయనకు విలువ గల దుశ్శాలువలను, పట్టుజరీతో చేసిన కిన్ఖాబులను అమూల్యాంబరములను సమర్పించెను. అప్పుడు తా నాయనకు ధనము నిచ్చినచో నాయన ఏమైన అనుకొనునేమో యని సందేహించి వారు బసకు వెళ్లినతరువాత నొక నమ్మకమైన సేవకుని కొక వెయ్యి రూపాయలుగల సంచి నిచ్చి, ఘులాం హుస్సేను గారి చేతి కిచ్చి ఆ పుణ్యపురుషునకు సమర్పింపుమని చెప్పి ఇచ్చిరమ్మని పంపెను.

ఒకమారు సితాబ్ రాయిగారి స్వగ్రామమైన షాజహానాబాదులోని యొక పెద్దమనుష్యుడు గయాక్షేత్రమునకు తీర్థయాత్ర చేయుచు షాజహానాబాదులో నున్న చక్రవర్తిగారి ఖలిసాదివానుగారైన నవరత్నల్ గారి కతడు మిత్రుడైనందువలన గయ అజీమాబాదు, లేక పట్నా నగరమునకు మూడుదినముల ప్రయాణములో నున్నందువలన సితాబ్ రాయిగారి కొక సిఫారసు ఉత్తరమును వ్రాసి యీయవలసినదని నవరత్నల్ గారిని కోరెను. అతడు తన హోదానుబట్టి వజీరులతోను, ఉమ్రావులతోను సమానమైన దర్జా కలవాడు. "సితాబ్ రాయిగారు మీకు పరిచితులేకదా? మీరు తీర్థయాత్రకు పోవుచున్నారని తెలియగనే ఆయన మీకు తప్పక సహాయము చేయగలరు. నేను మరల ఉత్తరము వ్రాయుట ఎందులకు? ఇంతకును సితాబ్ రాయిగా రిప్పుడు మహోన్నతపదవిలో నున్నారు. ఆయన నెట్లు సంబోధింపవలెనో నాకు తెలియుటలేదు. ఏమి వ్రాసిన నేమి

కోపమువచ్చునో ? ఆయన పూర్వపు మనుష్యుడా ? నే నేసైన జాబు వ్రాసిన నది మీ కుపకరింపకపోగా అపకారముకూడ చేయవచ్చును." అని వకుర్మిల్‌గా రనిరి. ఆకాలములోని గొప్పవారందరివలెనే సితాబ్ రాయిగారుకూడ చాలసొమ్ము వ్యయముచేసి దేశపు నలుమూలలను ప్రతిదర్బారులోను తనగూఢచారులను నియమించి ఎప్పటికప్పుడాయా చోటులనుండి వచ్చు వార్తలను తూ.చ. తప్పకుండ తెప్పించుకొను చుండెను. అంతట షాజహానాబాదులో జరిగిన సంభాషణ యావత్తు తనికన్న ముందుగనే అజీమాబాదు చేరెను. ఆ పెద్దమనుష్యుడు సితాబ్‌రాయిగారిని దర్శించగనే ఆయనప్రధానమంత్రిగానైన వకుర్మిల్‌గారిచేత నొక ముక్క వ్రాయించుకొనివచ్చిన నెంత బాగుండును అనిరి. "అయ్యా, నేను మిమ్ము స్వయముగ నెరుగుదు నని ఆయనకూడ నెరిగియున్నందున నే నాయనవలన నుత్తరము వ్రాయించుకొని రాలేదు." అని యాపెద్దమనుష్యు డనెను. "అదికాదు లెండు" అని యాసంగతి యంతయు తమకు తెలిసినట్లు సితాబ్ రాయిగారు మాట్లాడగా నప్పు డక్కడ నున్న పెద్దమనుష్యునకు సంగతి యర్థముకాక ఆ రాయనను గ్రుచ్చిగ్రుచ్చి యడుగగా సితాబ్ రాయిగారు జరిగిన సంగతియంతయు చెప్పి "దేవుడు మేలుచేసిన యెడల నాసంగతి మీ యనకు త్వరలోనే తెలియగలదు" అనెను. దీని యంతరార్థ మెవ్వరును గ్రహింపలేకపోయిరి. సితాబ్‌రాయిగారు ఆ వచ్చిన పెద్దమనుష్యునకు తగిన సహాయము చేసి ..డు తిరిగిపోవు నపుడు వకుర్మిల్‌గారి కీయవలసిన దని యొక జాబు నిచ్చెను. ఆయన వలన తనకు కావలసిన పని యేమియు లేకపోయినను సితాబ్ రాయిగా రాయనను నెంతో మర్యాదగ సంబోధించుచు, దూరమున నుండు తమశ్రేయోభిలాషియందు వహించవలసిన ప్రేమభావమును సూచించుచు, మీరు నాయం దనుగ్రహించి వ్రాసిన జాబునకు కృతజ్ఞుడ ననియు, దూరమున నుండి మీ యనుగ్రహము కోరువారిపట్ల మీ సహృదయత్వము చూపి వారి కానందము కలిగించుట మీ మంచి స్వభావమునకు తార్కాణమనియు వ్రాసి పది పదునైదు వేల రూపాయల విలువగల బహుమానములను వకుర్మిల్ గారి కివ్వవలసిన దని ఆయన కిచ్చెను. వంగదేశమున కూడ ఎత్తుకు ౨౪ ఎత్తుల వెండికి విక్రయించు విలువయైన యగరును, వంగ రాష్ట్రములో మాత్రమే తయారగు 'మల్‌మల్' అనుపేరుగల నలువలు (ఢాకా మజలిన్లు), దంతముతో చేసిన మంచిపుల్లోళ్లను, ఐరోపానుండి దిగుమతి చేయబడిన గోడగడియారములు, జేబుగడియారములు, స్ఫటికమువంటి గాజుతో చేసిన వంగలదీపముల అత్తరులు (Sconces), పెద్దపెద్ద అద్దములు, ఐరోపా చీనా దేశముల వింత వస్తువులు మొదలైన విలువగల సామానులను సితాబ్‌రాయిగారు వకుర్మిల్ గారి కివ్వగలందులకు తన పరముగ నివ్వగా నాపెద్దమనుష్యు డాశ్చర్యపడి తాను గయకు పోయి యింటికి చేరునప్పటి కాలస్యమగునని, ఆ బహుమతుల నెల్ల ముందుగనే షాజహానాబాదుకు పంపించెను. సితాబ్‌రాయి గారి యుత్తరమును, ఆ బహుమతులను చూచి వకుర్మిల్ దిగ్భ్రమ చెంది ఆయనే నాకు తగినట్లు బుద్ధిచెప్పినాడని సిగ్గుపడి అనేక క్షమాపణలతో ప్రత్యుత్తరము వ్రాసిపంపెను.

సితాబ్‌రాయిగారి దయాదాక్షిణ్యములు క్రీ. శ. ౧౭౭౦లో వచ్చిన మహాక్షామములో వెల్లడి యయ్యెను. ఈ కఱవు వంగరాష్ట్రమును పీనుగుపెంటలతో నింపివేసెను. అన్నవస్త్రములు లేక ప్రజ లల్లాడుచుండుట చూచి సితాబ్‌రాయిగారి హృదయము కరగి బీదవారికిని, కన్నులు కాళ్లు లేని వారికిని, ముసలి వారికిని, దిక్కు లేని వారికిని అన్నవస్త్రము లిచ్చి కాపాడుట కనేక సదుపాయములను చేసెను. ఇదికాక క్షామనివారణకొరకు కొన్ని చక్కని ఏర్పాటుల నరిదు చేసెను. ఆ సంవత్సరమున బియ్యము కరవై ధరలు విపరీతముగ పెరిగిపోగా వేలకొలది ప్రజలు అన్నము దొరకక మరణింప సాగిరి. ఆ సమయమున కాశిలో బియ్యము చౌకగానుండెను. కాని, దానిని వంగరాష్ట్రములోనికి చౌకగా తెచ్చు మార్గము లేదు. అంతట సితాబ్‌రాయిగారు తన పడవలను, మనుష్యులను కాశికి పంపి, మున్నది వేల రూపాయల బియ్యమును కొని దానిని అజీమాబాదుకు తెచ్చి కాశీబజారు ధరకే యక్కడ విక్రయింప సాగెను. ఆ సంవత్సర మెల్ల ఆయన పడవలను, మనుష్యులను అట్లు త్రిప్పుచు, బియ్యమును దిగుమతిచేసి ప్రజలకు మహోపకారము చేసెను. సరసమైన ధరకుకూడ బియ్యమును కొనలేని బీదలు పక్షులవలె రాలిపోవుట చూచి హద్దులేనిచో నిజమైన దరిద్రుల కన్నమే దొరకదని నిశ్చయించి సితాబ్‌రాయిగారు నాలుగు తోటలకు చుట్టు నావరణగోడ లుంచి అందులోనికి దరిద్రుల నందరిని చేర్చి, వారి కన్నముపెట్టి రక్షింప సాగెను. దానికొరకు కొంతమంది గుమాస్తాలను, సిబ్బందిని కూడ నియమించెను. ఆ దరిద్రులలో ముసల్మానులకు వేరుగాను, హిందువులకు వేరుగాను సౌకర్యములు కలిగించెను. ఇట్లు ప్రతిదినమును వేలకు భోజనము పెట్టుచు యీ దీనజనుల నిరిదు కాపాడు పద్ధతిని చూచి ఇంగ్లీషు వర్తకులును, డచ్చి వర్తకులును కూడ బీదల ననేక ఆవరణల నుంచి పోషింపసాగిరి. రాజధానినగరమైన మూర్షిదాబాదులో నట్టి చక్కని ఏర్పాట్లు జరుగలేదు. అక్కడ కంపెనీవారు మహమ్మదు రజాఖానను క్షామనివారణ పనిచేయు పోలీసుశాఖ కధికారిగ చేసిరి. కాని గింజ దొరకక సామాన్యప్రజలు బాధపడసాగిరి. బీదలపైన పెత్తన మివ్వబడిన మిర్ సులేమాన్ ఖాన్ మొదలైన 'సూపరైజర్లు' స్వార్థపరులై బీదలకై తెచ్చిన బియ్యము నరలేయు తామే హరించివేయసాగిరి. సర్కారువారి బియ్యపు పడవలు రేవులో దిగగానే రజాఖానుగారి యాంతరంగికులు, ఆ బియ్యమును తమ యిండ్లకు తోలించుకొనసాగిరి. ఇట్లు అన్యాయముచేసి బీదలను మాడ్చినవారిలో రాజా అమృత్ సింగ్ ఒకడు. మీర్జాఫరు దగ్గర నొక సేవకుడుగా నుండిన నామెత్ ఒల్లాఖాన్ మహమ్మదు రజాఖాను దగ్గర నొక కార్యకర్త (Steward) యై నమ్మిన బంటుగా

నుండెను. అర డాకాలమున బియ్యము నమ్ముటకు నియమింపబడి చాల అక్రమములు గావించెను. అతడు ౧౦ లక్ష లార్జించినట్లు ప్రతీతి. ఈ యక్రమములను మాన్పువారుగాని, బియ్యము సరియైన ధరకు అమ్మించువారుగాని, అన్యాయము చేయువారిని శిక్షించువారుగాని లేకపోయిరి. పరిపాలనలో రెజాఖాను చేసిన అన్యాయమునకు తర్వాత నతనిని పట్టుకున్నప్పుడు అతనిపైన మోపబడిన నేరములలో నది యొక్కటి.

సితాబ్‌రాయిగారు ప్రతియేటను ఇరాన్ (పారశీక) దేశము నుండి యపూర్వఫలజాతులను తెప్పించి యింగ్లీషు దొరలలో ముఖ్యులైనవారికిని, వంగరాష్ట్రములోని గొప్పగొప్ప ప్రభువులకును, అజీమాబాదులోని గొప్పవారికిని, విద్యాంసులకును బహుమానముగ పంపుచుండును. ఇతడు ఫలజాతుల నమ్ము వర్తకులకు ప్రత్యేకముగ కొంత ధనమును అప్పుగా నిచ్చి వివిధజాతుల ఫలముల విక్రయమును ప్రోత్సహించుటవలన తన పట్టణములోని బజారులలో నపూర్వ ఫలజాతుల నమ్ముటకు కారణమయ్యెను. అదిగాక అతడు దూర దేశములనుండి లాహోరు, ఆగ్రా, కాబూలు నగరములనుండి అనేక ఫలజాతుల మొక్కలను, గింజలను తెప్పించి, తోటలయందు నాటించుచుండును. ఇతడు కస్తూరికర్బూజ (Musk-melon) అను అపూర్వ కర్బూజజాతిని అజీమాబాదులో వ్యాపింపజేసినాడు.

సితాబ్‌రాయిగారు పుట్టుకవలన హిందువుడే యైనను, మతాచారములందు షియాశాఖకు చెందిన ముసల్మానుడే నని సియర్ ముతాఖరీన్ గ్రంథకర్తయైన ఘులాం హుస్సేన్ ఖాన్ గారు చెప్పుచు తమ గ్రంథమునందీ క్రింది యుదాహరణముల నిచ్చియున్నారు. మహమ్మదు ప్రవక్త అల్లుడైన అలీ యవతార పురుషుడని నమ్మి ఆయనమరణమును గూర్చి దుఃఖించుట కేర్పడిన పెద్దదైన మొహరంలో అలీగారు చనిపోయిన దినమైన ౧౧వ నాడు సితాబ్‌రాయిగారు పాలతో వండించిన యన్నపు ముద్దలను, ఇతర మిఠాయిలను, ఆహారపదార్థములను భక్తితో తయారుచేయించి, ప్రార్థన, నైవేద్యానంతరము దానిని నగరమునందు పంచిపెట్టించుచుండును. ఆయన సాధారణముగ 'యా అలీ' అని భగవన్నామ స్మరణ చేయుచుండురు. 'వల్లాబిల్లా'యని దైవముపై నొట్టు పెట్టుకొనుచుండురు. సంవత్సరమున కొకమారు రాజసింహుని (King of Braves) స్మృతిచిహ్నముగ భోజనములు తయారుచేయించి, 'ఫాతెహా' ప్రార్థనము చేయించి, దానిని పంచిపెట్టించుచుండురు. ఒక దినమున దానిని పంచిపెట్టుట లోపల నేదైన నొక మహత్తు కనబడువఱకును వేచియుండుట మంచిదని ఒక పెద్దమనుష్యు డనగా, "అయ్యా, అన్యమతమునకు చెందిన నావంటివాడు అలీగారి మాహాత్మ్యమును చూడ గోరుట విపరీతము. అట్టి మాహాత్మ్యము తలంపగనే నా కాయన దివ్యత్వమునందు నమ్మక మున్నది. పదార్థములు చేయించుటలో శుచి శుభ్రతలు తక్కువైనందువలనగాని, మఱి యే పొరపాటు వలనగాని అట్టి నిదర్శనము కనబడక పోవచ్చును. అంత మాత్రమున దానినిబట్టి హేళనచేయుట కవకాశ మేర్పడును. ఇది సమంజసము కాదు" అని చెప్పెను.

ఒకమారు అతడు జనరల్ స్మిత్తు దొరకు స్వాగత మిచ్చుటకై ఎదురేగుచు పోయి ఒక దేవాలయముదగ్గర గుడారములను వేయుట తలపెంచెను. ఆ మరునాటి యుదయము నాయన పల్లకీలో బయలుదేరుటకు సిద్ధముగ నున్నప్పుడు ఆ దేవాలయపురోహితులు వచ్చి "అయ్యా, ఈదేవాలయము మహాదేవునిది. ఈ దినము పౌర్ణమి. ఇది భగవదారాధనకు ముఖ్యమైన శుభదినము" అని చెప్పి తమ్ము కనిపెట్టుడని వేడుకొనిరి. అంతట నాయన "మీ కేదైన చెప్పవలసినచో దేవుని దర్శింపవచ్చిన భక్తులతో చెప్పవచ్చును. ప్రస్తుతము నాకు మీతో గాని, దేవునారాధనతో గాని పనిలేదు" అని పల్లకి నెక్కి వెడలిపోయెను. హిందూమతము నాయన నిరసించినప్పుడు, ఆయన ఏమియు నివ్వక పోయినను, మహమ్మదీయఫకీరు లర్థించినప్పుడుమాత్రము తప్పక ఒక రూపాయి నిచ్చుచుండును. సితాబ్‌రాయిగారు కలకత్తాకు గాని, వంగరాష్ట్రమునకుగాని పోవుట తరుచుగా తటసించును. అప్పుడు దారిలోని దేవాలయములలోనికి పోయి దేవుని దర్శించిరమ్మని యాయనతో నున్న మిత్రులనగా నాయన వారి కొక్కొక్క రూపాయి లిచ్చి వారిని వెళ్ళి పూజలు చేయింపుడని, తాను మాత్ర మేదో సాకు చెప్పి పోకుండ మానును.

సితాబ్‌రాయిగారు తన కాపురమున కొక దివ్య భవనమును కట్టించుకొనెను. అందులో గృహప్రవేశసందర్భమున బ్రాహ్మణులకు సంతర్పణచేయవలసిన దని దేశీయమిత్రు లాయనతో ననగా, ఈ బ్రాహ్మణులు తన భవనమును పాడుచేయుదు రనియు, కావలసినచో వారికి గంగాతీరమున సంతర్పణ చేయింతుననియు చెప్పి అట్లే గావించెను. ౧౭౭౦ లో వంగరాష్ట్రమును, ఉత్తర హిందూస్థానమును నాశముచేసిన ఘోరక్షామములో ఆయన స్నేహితుడైన మురళీధరుడు, రాయ్ కిట్టుదాస్ మాధ్వసింగ్ మొదలైనవారి కోరికపైన నిష్ఠాగరిష్ఠుడైన ఒక బ్రాహ్మణుడు ఆయనను దర్శించుట తటసించెను. అటు తర్వాత నా బ్రాహ్మణుడు విద్వాంసుడు తఱచుగా సితాబ్‌రాయిగారికి సనాతనధర్మమునందు గట్టి నమ్మకము గలిగింప తలచి ఒకనాడు "మహాప్రభూ, తమ జాతకమునుబట్టి తాము చేయదగిన నామజపమును నిర్ణయించినాము. దాని ప్రకారము తాము తాపళముతో జపము చేయుచుండిన చాల మంచిది" అనెను. అంతట సితాబ్‌రాయిగారు "స్వామీ, నే నిదివరకే వెయ్యినొక్క పేర్ల నామజపముచేయుచున్నాను. అది చాలును" అనెను. అది ఏమని బ్రాహ్మణు డడిగినను, సితాబ్ రాయిగారు చాలసేపటివఱకు చెప్పలేదు. తరువాత 'రహీము', అనగా పరమదయాళుని జపమని చెప్పెను. అంతట నా బ్రాహ్మణుడు "మహాప్రభూ, రామ్ రహీమ్ లను పేర్లు రెండును అద్వితీయుడైన పరమాత్మునియొక్క నామములే కదా ? ఇందు భేద మేమి ?" అని సరిపెట్టజూచెను. సితాబ్‌రాయిగా రందుకొని "కొంచెము భేద మున్నది. రాముని పే రుచ్చరింపగనే దశరథనందనుడని స్ఫురించును. రహీముపే రుచ్చరించగనే జరామరణములు లేని పరబ్రహ్మము మాత్రమే స్ఫురించును" అనెను. ఈ వేదాంతిని తాను మార్చలేనని బ్రాహ్మణుడు సెలవు పుచ్చుకొనెను—అని ఘులాం హుస్సేనుగారు తమ గ్రంథమున వ్రాసియున్నారు.

# ధర్మసమన్వయము

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

తలకొక ధర్మమై యెవరి దారిని వారలు పోయిరేని భూ
తలముఁ దీవ్రఘట్టముల తాఁకిడి కోర్వఁగలేక సంఘమే
కలఁతను జెంది దానను వికారగుణంబులె యుప్పతిల్లి యా
వలఁ జెడు రొంపిలోఁ బడి యవస్థలఁ జిక్కి తపించు నిచ్చలున్.

బ్రదుకుట యొక్కటే యిహపరంబుల ముఖ్య మటంచు నెంచి యె
య్యదనున నైనఁ బ్రాణము రవంతయు జారనిరీతి సంచరిం
చెద రొకకొంద ఱట్టిదె విశిష్టపథంబని ధర్మశాస్త్రముల్
కొందఱకర చెప్పుచుండు; మఱికొందఱ కియ్యది గిట్ట దిమ్మహిన్.

మోసపు వేసముం గొని, విభుండగు కర్ణుని దివ్యశక్తికై
గాసియొనర్పఁగాఁ దవిరి కావఁగఁడైన మహేంద్రుఁ డర్థియై
చేసిన ప్రార్థనంబునకు ఛీ! యనఁ జాలఁడు—దాని కెట్టి సం
త్రాసము చూపఁ డా మహితధార్మికతత్త్వమహత్త్వ మెట్టిదో!

ముందుగఁ దండ్రి భాస్కరుఁడు పుత్త్రుని జేరి సురేంద్రవర్తనం
బందు స్ఫురించు మోస మది యంతయు నొక్కి వచింప దానికిం
గొందల మందఁ డా కొడుకుఁ గుఱ్ఱ; తదీయమనఃప్రవృత్తికిం
జెందిన ధర్మనిర్ణయవిశిష్టత యెట్టిదొ చూడఁగావలెన్.

"తగదు కుమార! యిట్టులు వృథాయొనరింపకు జీవితంబు, మె
ల్పుగ గుణించి యేది శుభముల్ గలిగించునొ దానిమాత్రమే
జగమునఁ జేయఁగావలయు: సర్వము భంగము పొందు వేళ ని
వ్వగ సమకూర్చు త్యాగ మది వ్యర్థముగాదె తలంప నేరికిన్!

చచ్చుట నిశ్చయంబని నిజంబుగఁ దెలిసనాఁడు కీర్తియే
వచ్చిన లాభ మేమి? గుణవంతుఁడు వీఁ డని లోకు లెవ్వరో
నిచ్చలు చెప్పుకొందు రని నీవు తలంచియు లాఁతివానికై
ముచ్చట తీర్తువా? వెనుక ముందఱ యారసి సంచరింపవా?"

అని బతిమాలిన్ దన ప్రయత్నము మానెనె! కర్ణుఁ డాతనిం
గని యిటు పల్కెఁ బ్రేఁగ: "జనకా! భవదీయహితోక్తి యిత్తఱిన్
విన నని యన్యథా పరిగణింపకు మయ్య! మదీయసువ్రతం
బును వినవయ్య! యిందుఁ బొరపొచ్చెము లున్నను సైఁపవే నన్!

ప్రాణము లిచ్చియైనను శుభంబగు కీరితి మూటగట్టి య
ద్దాన ముకంబు నొందుటయె ధర్మముసుమ్ము మహాత్మ! సత్య మ
ద్దానికె వేచియుండునుగదా! యిది నాదు వ్రతంబు; దీని కే
దేనియు విఘ్నముం బొరయునేని సహింపను లేశమేనియున్."

అనియే కర్ణుఁడు పట్టుపట్టెనుగదా! త్యాగంబు గావించు ప
ట్టునఁ బ్రాణంబులుసైత మాతఁ డొకనాఁడుంగాని ముఖ్యంబు లం
చను భావింపఁడు; వాని ధర్మ మది యంచుం గొంత యగ్గింప వ
చ్చునుగాఁబోలు! రహస్య మేమొ? యది యే చూపెట్టఁగాఁబోలదే!

బ్రదుకుటయే ప్రధాన మనరాదు జగంబునఁ గాకిమూఁకలున్
బ్రదుకుచునుండు నెంగిళులు భక్షణ సేయుచుఁ బెద్దగాల; మ
య్యది యొక లెక్కయే? మొనవికైనను బ్రాణ మొసంగి సాహ్యసం
పద గడుఁ గూర్చు భాగ్య మది భవ్యముగా నుతియింపఁజెల్లదే!

అరయఁగ నశ్వరంబగు నాయువుమాట యెఱింగి కాలముం
జరుపుచు సత్ప్రవర్తన మెసంగఁగ- దేహముకన్న మిన్నయై
పరఁగుచు వన్నె తేఁగలుగు భవ్యపథంబు గడింపఁగోరి సం
బరముగ లాఁతివారలకుఁ బ్రాణములైన మహాత్ము లీయరే!

ఒక ధర్మంబును నిర్ణయించుగతి నీ యుక్తిప్రయుక్తుల్ విమ
ర్శకదృష్టిన్ గనుపొంది సత్యమగు సంశంబున్ వెలార్పంగ ను
త్సుకతన్ జూపుట మేలు; దానికొఱకే సుమ్మిట్టి శాస్త్రాలు సా
ధకవర్గంబులుగా గ్రహింపవలెఁ దత్త్యాగంబు గుర్తించుచున్.



ఆంధ్రపత్రిక - సర్వధారి సంవత్సరాది సంచిక ప్రకటన

# నూతన సంవత్సరము

## మీకు సంతోషకరమును, జయప్రదము నగుగాక!








## జామా ఆయిల్

రిజిష్టర్డు ★ ట్రేడ్ మార్కు

ఎంతతీవ్రమైనను, దుర్భరమునగు బాధనైనను ఉపశమింపజేస్తుంది. కొద్దిబొట్లు వేసి బాగుగా మర్దనచెయ్యండి. కొద్దినిమిషాలలోనే మీ ముఖము మందహాస పూరితమగుతుంది. ఎల్లప్పుడూ అవసరానికి చేతిక్రింద ఒకసీసా ఉంచుకోనండి.

## అమర్‌చంద్ శోభాచంద్

హోల్ సేల్ కెమిస్ట్సు అండ్ డ్రగ్గిస్ట్సు,
95, నైనియప్ప నాయక్ వీధి, పి. టి. మద్రాసు.

## మా వ్యాపారములు:



రైస్ హాల్లర్లు, పిండిమిల్లులు, రోటరీ చెక్కు, పింటో చెక్కు, పంపులు, ఎలెక్ట్రిక్ మోటార్లు, ఆయిల్ ఇంజన్లు, బెల్టింగు, బాల్ రింగ్ ఆయిల్ బేరింగ్సు, షాఫ్టింగ్సు... డికార్బి కేటర్ షీట్సు, ఆస్‌బెస్టాస్ షీట్సు, నూలుత్రాళ్ళు, పగ్గములు మొదలైనవి.

## నీలర్క మెషినరీ మార్టు,

2/11, ఎర్రబాలు చెట్టివీధి, జి. టి. మద్రాసు.

# నవ్యాంధ్రవ్యాకరణనిర్మాణము

శ్రీ చిలుకూరి నారాయణరావు

మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, డాక్టరు, ఎమ్. ఏ., పి. హెచ్. డి., ఎల్. టి.—చూచినారా, ఎంతెంతలేని బిరుదులో! నేయి లేని నేతిబీరకాయలు, బంగారము లేని బంగారపు పిచికలు, నిజము లేని నిజాములు! నవ్యాంధ్రవ్యాకరణము వ్రాయ తలపెట్టి నాయంతటి అజ్ఞాని మరొక్కడు లేడని కనిపెట్టగలిగినాను. ఆంధ్రభాష నా సొమ్మని నాకు చెడ్డగర్వముండేది. ఏమేమో పొడిచివేసినా పని ఏతిమీరిన తలతిరుగుడు.

నా స్నేహితు లంటారుకదా—"మీరు గిడుగు రామమూర్తి పంతులుగారి శిష్యులు. ఆయన నవ్యాంధ్రభాషాపితామహు డయితే మీరు నవ్యాంధ్రభాషాజనకులు. ఆయన బయలుదేరదీసిన ఉద్యమము లోకములో వ్యాపించి. వేళ్లు నాటి, కదలించడానికి వీలులేకుండా అల్లుకొనిపోయినది. రామమూర్తిపంతులుగారి ఆశీర్వచనముతో నవ్యసాహిత్యపరిషత్ స్థాపకులయి దాని అభివృద్ధికోసము పాటుపడుతున్నారు. నవ్యాంధ్రవాఙ్మయమేమో వ్యాపిస్తున్నది. కాని, నవ్యాంధ్రభాషాస్వరూపమేమో తెలియజేసే వ్యాకరణము లేకపోవడ మొక పెద్దలోపముగా ఎంచి కొందరు మహనీయులు నవ్యాంధ్రము పాఠశాలలలోను, కళాశాలలలోను ప్రవేశించకుండా చేస్తున్నారు. మీ రొక నవ్యాంధ్రవ్యాకరణమును వ్రాసివేస్తే ఆ ఆటంకము తీరిపోతుంది. నవ్యాంధ్రభాషోద్యమానికి సంపూర్ణవిజయము కలుగుతుంది. అట్టి వ్యాకరణము వ్రాయడము మీ కొక పెద్ద పని కాదు" అని.

అవును, అంతటివాడనే కాబోలు ననుకొన్నాను. ఇ దెంతపని, తెల్లవారేసరికి గీకిపారేద్దా మని ఊటకలమునిండా సిరా పోసి, కాగితము దస్కుమీద పెట్టి కలము చేతబట్టవలె ననుకొనేసరికి, ఎక్కడలేని దిగులూ పట్టుకొన్నది. అర్జునునికి యుద్ధారంభములో కలిగినంత దిగులూ కలిగినది. ఆయనకు 'గాండీవం స్రంసతే హస్తాత్' అయితే, నాకు 'లేఖనీ స్రంసతే హస్తాత్' అయినది. ఆపళంగా ఆ కలాన్ని దస్కుమీద పెట్టి ఆలోచనానిమగ్నుడ నైనాను.

నవ్యాంధ్రభాష! ఏది నవ్యాంధ్రభాష? గ్రంథస్థభాషా, వాడుకలోని భాషా? గ్రంథస్థభాష అయితే భారతానుకరణాల నుంచి ఇప్పటి అభ్యుదయరచనాలదాకా గ్రంథా లున్నవి. వీటిలో ఒక గ్రంథానికీ, మరొక గ్రంథానికీ గల భేదాలు స్థూలదృష్టికే అనంతముగా కనిపిస్తున్నవి. పూర్వాంధ్రవ్యాకరణము వ్రాయాలంటే పూర్వకాలపు వ్యవహారభాషకు గల నిదర్శనాలు చాలా తక్కువగా ఉన్నవి. పూర్వకాలపు గ్రంథాలుకూడా నశించిపోగా వైయాకరణుల అదృష్టవశమున కొంచెముమాత్రమే ఉన్నవి. వాటి కేదోవిధముగా వ్యాకరణము వ్రాయవచ్చు. వ్రాయలేనప్పుడు "శేషం" డాబునా, ముకాయింపునా "పూరయేత్" చేయవచ్చు. ఎవరయినా ఆక్షేపించవస్తే "భారతములో ప్రయోగ మున్నది చూడుకో" అని దబాయించవచ్చు. కాని, నవ్యాంధ్రమువిషయములోనో? దీనిలో ఎవనిమట్టుకు వాడే పండితుడు. ఎవనికి వాడే అథారిటీ, అంటే అధికారి. లక్షణమును సాధ్యమైనంతవరకూ సరిగానే ఏర్పాటుచేసినా సూత్రాలకంటే అపవాదాలే ఎక్కువగా ఉంటవి కాబట్టి, అది అపవాదాల వ్యాకరణ మవుతుందిగాని సూత్రవ్యాకరణము కాజాలదు. అందుచేత తెగబడి వ్రాస్తే కాకులలాగు నాలుగువైపులనుంచీ దుయ్యబట్టుకొంటారు. అయితే ఏమి చేయడము? ఊరుకోవలసినదేనా?

ఇట్టి ఆలోచనాపరంపరలో పడినకొద్దీ విశ్వరూపం కనిపించిపోయింది. భగవద్గీత పదకొండో అధ్యాయములోని అర్జునుని అవస్థలో పడ్డాను. అయినా, ఆ అనంతకోటిరూపాలతో కనబడిన ఆ విరాట్ స్వరూపముమధ్య నిరంతరముమ్ము భాసిస్తూఉన్న ఒకానొక కల్యాణమూర్తివలెనే నా కళ్లకూ నవ్యాంధ్రభాషావిశ్వకల్లోలినీమధ్యమున సహస్రారపద్మసంవాసినియై, వీణాపుస్తకపాణియైన సుహాసిని, సుమధురభాషిణిగా నవ్యాంధ్రభారతీస్వరూపము పొడగట్టినది. నాకు కొంత ధైర్యము కలిగినది. దిటవు తెచ్చుకొని కుదుటపడ్డాను.

* * *

వ్యాకరణనిర్మాణము కష్టమైనదే. దానిలోని కష్టనిష్ఠురములను కొంచెము మచ్చుకు చూపుతాను.

వ్యాకరణ మంటే విశదీయడము. సంపూర్ణభావము సంపూర్ణవాక్యములో వ్యక్త మవుతుంది. అట్టి సంపూర్ణవాక్యము లనేకములు కలిసి ఒక మహావాక్యమయి గ్రంథరూపమును పొందుతుంది. ఆ మహావాక్యములోని అన్ని చిన్నవాక్యములును అర్థవంతములయి

పరస్పరసంబంధము గల సమర్థపదముల కూడికలుగా ఉంటవి. వాక్యములోని పదములను విడగొట్టి వాటి పరస్పరసంబంధమును తెలుపడమే వ్యాకరణము చేసే పని.

వ్యాకరణనిర్మాణవిధానమును తెలియజేయడానికి క్రింది మహావాక్యమును విడగొట్టి దానిలోని పదముల సంబంధమును నిరూపించ ప్రయత్నిస్తాను.

## మహావాక్యము

(నా 'అశ్వత్థామ' నాటకము, పుట ౫౧. అశ్వత్థామస్వగతము-)

"ఉహ్! (నిట్టూర్పు విడుస్తున్నాడు.) అంతే? మహారాజా! నీఋణము తీర్చుకోలేనా? ఎంత కృతఘ్నుడను! ఈ విల్లు, ఈ అమ్ములు ఎందుకు? మోతదండుగేనా? అయినదీ? కౌరవుల పేరు ఈలోకములో సరా!... అయ్యో! లోకమంతా నిద్రపోతున్నది. నే నొక్కడనే మేలుకొని ఉన్నాను. ఎంత విచిత్రమయినది ఈ లోకము! పుట్టితే ఒక్కసారి నవ్వుతారు. జీవి అభివృద్ధిపొందితే చూచి, ఏడ్చి, అసహ్యించుకొనేవాళ్లే ఎక్కువమంది. వృద్ధిలో ఉన్నంతసేపూ అంటిపెట్టుకొని ఉండేవాళ్లయినా స్వలాభం మీదకేవరకే. పడినవాని వైపు చూడనైనా చూడరు. నవ్వి, మరికొందరు రాళ్లు విసరుతారు. బ్రతికి ఉన్నన్నాళ్లూ చెడ తిని, చస్తే, 'అయ్యో! మరి కొన్నాళ్ల లాభము ఉండెడిదే' అని ఒక్క ఏడ్పు ఏడ్చి, ఊర్పుపార వేస్తారు. ఆ తరువాత ఒకసారి తలచుకోనయినా తలచుకోరు. ఆపదలో సహాయపడనివాడు బంధువు అయితేనేమి, మిత్రుడు అయితేనేమి? నా [illegible]... నా ప్రభువు నెట్లు సంతోషపెట్టగలను? ఏమీ తోచదే! (ముందుకు మీదికి చూస్తున్నాడు.) ఓహో! ఈ చెట్టుమీద ఎన్ని పక్షులు నిద్రపోతున్నవి! నిర్విచారము! మనుష్యునిది ఒక పక్షిబ్రతుకయినా బాగుండేది. ఆశా, పాశా లేదు. ఏమో! వీటికిమాత్రము ప్రేమ, ద్వేషము, శత్రుత్వము, మిత్రత్వము ఎందుకుండవు? ఏమది! ఆ చెట్టుమీదికి చప్పుడు చేయకుండా ఎలా వస్తున్నదో ఆ పక్షి! ఎంత భయంకరంగా ఉంది! కన్నులవెంట నిప్పులు రాలుస్తున్నది. ఆఁ! ఆఁ! ఆరంభించినది. పీకలు కొరికివేస్తున్నది. ఎన్ని పక్షులో! ఓహో! నిద్రమత్తుమీద లేచినవి. ఎంతెంత కాళ్లు! ఎంతెంతేసి గోళ్లు! వేలకొద్ది పక్షులు గిలగిల కొట్టుకొని క్రిందపడుతున్నవి. పారిపోతున్న వాటినికూడా విడువకున్నదే! వెంబడించి వెంబడించి, రెక్కలతో కొట్టి కూల్చుతున్నది. బళే! సంహారము! సంపూర్ణసంహారము! శత్రునిశ్శేషము! ఓ ఉలూకమా! నీవు నాకు గురువవు. మంచి మిత్రమవు సుమా! మనుష్యమాత్రుడు చేయలేని ఉపదేశము చేసినావు. మామను లేపుతాను. మామా! మామా!!"

పై మహావాక్యమును వ్యాకరించి చూపుతాను. దానికోసము అందులోని పదముల నెంతెంతవరకు అర్థము చెడిపోకుండా విడగొట్టగలమో అంతవరకు విడగొట్టినాను. అట్లు విడిపోయినపదాలలో ఏకరూపత, ఏకవిధనిర్మాణము, ఏకజాతి గలవాటిని ప్రత్యేకవర్గములుగా మొట్టమొదట ఏర్పాటుచేస్తే ఈక్రింది వర్గాలేర్పడినవి:

### I సంధి

౧. ఉత్వసంధి: నేను + ఒక్కడనే = నే నొక్కడనే; పక్షిబ్రతుకు + అయినా = పక్షిబ్రతుకయినా; లోకము + అంతా = లోకమంతా; వాళ్లు + అయినా = వాళ్లయినా.

౨. అత్వసంధి: ఉన్న + అంత = ఉన్నంత; ఉన్న + అన్ని = ఉన్నన్ని.

౩. ఇత్వసంధి: ఏమి + అది = ఏమది; సరి + ఆ = సరా; అయినది + ఈలోకము = అయిన దీలోకము; ఏమి + ఓ = ఏమో.

౪. కొన్ని శబ్దములు ద్రుతాంతములు: అయితేఁ; దండుగేనా; అంతేనా; తలచుకోఁ.

౫. ఇతరసంధులు: నిడు + ఊర్పు = నిట్టూర్పు.

### II తత్సమ, తద్భవములు

(అ) తత్సమములు:—సం-ఆపద్, తె-ఆపద; సం-ఉపదేశః, తె-ఉపదేశము; సం-ఉలూకః, తె-ఉలూకము; సం-ఋణమ్, తె-ఋణము; సం-కౌరవాః, తె-కౌరవులు; సం-జీవిన్, తె-జీవి; సం-ద్వేషః, తె-ద్వేషము; సం-పక్షిన్, తె-పక్షి; సం-ప్రభుః, తె-ప్రభువు; సం-ప్రేమన్, తె-ప్రేమ; సం-బంధుః, తె-బంధువుడు; సం-భయంకరమ్, తె-భయంకరము; సం-మనుష్యః, తె-మనుష్యుడు; సం-మహారాజః, తె-మహారాజు; సం-మనుష్యమాత్రః, తె-మనుష్యమాత్రుడు; సం-మిత్రత్వమ్, తె-మిత్రత్వము; సం-మిత్రమ్, తె-(మహద్వాచకము) మిత్రుడు; సం-లాభః, తె-లాభము; సం-లోకః, తె-లోకము; సం-విచిత్రః, తె-విచిత్రము; సం-వృద్ధిః, తె-వృద్ధి; సం-కృతఘ్నః, తె-కృతఘ్నుడు; సం-శత్రుత్వమ్, తె-శత్రుత్వము; సం-సంహారః, తె-సంహారము; సం-స్వలాభః, తె-స్వలాభము.

పైవాటిలో ఉపదేశ, ఉలూక, ద్వేష, మనుష్య, మనుష్యమాత్ర, లాభ, లోక, కృతఘ్న, సంహార, స్వలాభశబ్దములు సంస్కృతములో అకారాంతపుంలింగశబ్దములు.

ఋణ, మిత్రత్వ, మిత్ర, శత్రుత్వ—ఇవి అకారాంత నపుంసకలింగ శబ్దములు.

వృద్ధి—ఇకారాంత స్త్రీలింగము.

ప్రభు, బంధు శబ్దములు ఉకారాంత పుంలింగములు. బంధుశబ్దము బంధువు అని మాత్రము తత్సమరూపము కావలసి ఉండగా, వ్యవహారములో బంధువుడు అనే తత్సమరూపముకూడా ఏర్పడినది.

ప్రేమ శబ్దము సంస్కృతములో అన్నంత నపుంసకలింగము.

జీవి, పక్షిశబ్దములు ఇన్నంత పుంలింగములు.

భయంకర, విచిత్రశబ్దములు అకారాంతవిశేషణములు.

(అ) తద్భవములు:— తె-అమ్ము, సం-అంబకః; తె-ఎక్కువ, సం. ఏక్ + క్ర; తె-ఏడ్పు, సం_విలాపః; తె-చప్పుడు, సం_శబ్దః; తె-చెట్టు, సం_శైత్యకః (చల్లదనమునిచ్చేది); తె-దంతుగ, సం-దండః; తె-నాడు=దినము, సం_నాడికా; తె-నిప్పు, సం-అగ్ని, ప్రాకృతము-నిఉ అ, ఒరియా- నియా; తె-పేక=గొంకుగ, గొట్టము; చూ. ఇంగ్లీషు-పైప్; తె-పీనుగు, సం_వ్యాపకః=ప్రాణముపోయినది (వి + ఆప + కః); తె-పేరు, సం-యశస్=ఎసస్=కన్న-హెసర్ పెసర్, తమి- పెయర్, తె_పేరు; తె-మంచి, సం_మాన్య; తె-మత్తు, సం_మత్తా, మదః; తె_మంది, సం. బృంద, బృందికా; తె-మ, సం_భూమః; తె_మీద, సం-మస్త; తె_ముంత, సం_ప్రరతః; తె-మోత (మోయుట), సం_క్రీడ్; తె_రాయి, సం-లోష్టికా=లోష్టి, లాతి, రాతి, రాయి; తె_రెక్క, సం_రక్షా=రక్షా=రెక్క (రక్షించునట్టిది); తె_పర(వు), సం_పౌర; తె_సరి, సం-సదృశ; తె_సారి, సం_సారికా.

## III విభక్తి వచనములు

(అ) ప్రథమాబహువచనము:— పక్షులు (పక్షి); నిప్పులు (నిప్పు); వాళ్లు (వాడు); రాళ్లు(రాయి); గోళ్లు (గోరు).

ద్వితీయైకవచనము: ప్రభువును, మామను.

తృతీయాబహువచనము: రెక్కలతో.

షష్ఠ్యేకవచనము: మీదికి, ముంగుకు, ఆపదలో, లోకములో, వృద్ధిలో.

షష్ఠీబహువచనము: కన్నుల, కావపుల.

సప్తమ్యేకవచనము: తరువాత, మీద, చెట్టుమీద, మత్తుమీద.

సంబోధనప్రథమ: ఓలాకమా! మామా!

(ఆ) ఔపవిభక్తికములు: తరువాత (తరువాయి); మీద (మీదు).

విచ్ఛేకావవిభక్తికము: ఎంత విచిత్రము! ఎంతటి విచిత్రము!

---

* ఈధాతువు స్వరూపము తమిళ మళయాళకన్నడము లలో చాలాప్రచారములో ఉన్నది. తెలుగులో మరుగుపడి నది. 'ఇరు'లోని రేఫమునకు 'ల'కార మాదేశమయి, 'ఇలు'నుంచి ఇలని (లేని); ఇలక (లేక); ఇలదు (లేదు); ఇలరు (లేరు); ఇలదు (లేదు); ఇలవు (లేవు)-మొదలయిన వ్యతిరేకార్థకరూపము లేర్పడి ప్రచారములో ఉన్నవి. కన్నడములోని 'ఇల్ల', తమిళమళయాళముల లోని'ఇల్లై'అనే వ్యతిరేకార్థకరూపాలుకూడా 'ఇరు'ధాతువునుంచి పుట్టినవే. ఈ అన్నిభాషలలోని వైయాకరణులు, పూర్వభాషా శాస్త్రపరిశోధకులు, అందరూ ఈ విషయమును గ్రహింపలేక వాటు కలో ఎక్కడా లేని 'ఇల్' అనే ధాతువొక టున్నదనిన్ని, అది వ్యతిరేకార్థకధాతు వనిన్ని చెప్పినారు. ఈ ప్రతిపాదనము తప్పని మొదట కనుగొన్నవాడను నేను.

(ఇ) కారకము: అభివృద్ధి పొందితే; ఉపదేశము చేసినది; ఏడ్పు ఏడ్చి; పికలు కొరికి వేస్తున్నది—వీటిలో ద్వితీయకు ప్రథమ వాడబడినది.

## IV సర్వనామములు

(అ) పురుషసర్వనామములు:

ఉత్తమపురుషము: నేను, నా, నాకు.

మధ్యమ పురుషము: నీవు, నీ.

నిర్దేశార్థక విశేషణములు: ఆ (గట్టు); ఆ (పక్షి); ఈ (చెట్టు).

('అతరువాత'లోని 'అ' నిర్దేశార్థకసర్వనామ మవుతుందా? లేక 'అటు' అనే అవ్యయమునకు రూపాంతరమా?)

ప్రథమపురుషము, దూరార్థము, పుంలింగము: వాడు, (సహాయ పడని)వాడు; (పడిన) వాడి; వాళ్లు.

సమీపార్థము, పుంలింగము: వీనివల్ల.

ప్రథమపురుషము, దూరార్థము, అమహద్వాచకము: అది, వాటిని.

ప్రథమపురుషము, సమీపార్థము, అమహద్వాచకము: వీటిని.

(ఆ) సంఖ్యావాచకములు: ఒక (నడపీనుగు); ఒక (పక్షి బ్రతుకు); ఒక (సారి); ఒక ఏడ్పు; ఒక్కసారి; రెండురాళ్లు; వేలకొద్ది—ఈ సంఖ్యావాచకపదముల అర్థవిశేషములను గమనింప వలెను.

(ఇ) పరిమాణవాచకసర్వనామము: (చిన్న) అంత; ఎంత (కాళ్లు); ఎంతలేసి గోళ్లు; ఎంత భయంకరము; ఎంత విచిత్రము.

(ఈ) సంఖ్యా ప్రశ్నార్థకము: ఎన్ని (పక్షులు).

(ఉ) ప్రశ్నార్థకము: ఏమి.

## V సమాసములు

(అ) సంస్కృతసమాసములు: నిర్విచారము, మనుష్య మాత్రుడు, మహారాజు, శత్రునిర్మూలనము, సంపూర్ణసంహారము.

(ఆ) ఆచ్ఛికసమాసములు: ఎక్కువమంది, కొరవులపేరు, నడపీనుగు, నిద్రమత్తు, పక్షిబ్రతుకు, మోతిదంతుగ, సహాయపడనివాడు.

(ఇ) జంటపదములు: అరూ బోరూ.

(ఈ) ద్విరుక్తి: వెంబడించి వెంబడించి; కొట్టి కొట్టి; ఆఁ, ఆఁ!; మామా! మామా!

## VI (అ) ధాతువులు, వాటినుండి కలిగిన ఇతరరూపములు

అను (కాక, అయిన, అయినా, అయితే);-సహాయకక్రియ: విచిత్రమను; అంటు (అంటిపెట్టుకొని ఉండు, అంటిపెట్టు, అంటిపెట్టుకొను);-అను (అని) అసహ్యించు (అసహ్యించుకొను); అరంభించు;—*ఇరు=ఉండు.

—ఈడేరు (ఈడేరే); ఉండు (చేయకుండా, బాగుండదు, ఉన్న, బ్రతికి ఉన్న, ఉండే); ఏడ్చు (ఏడ్చి); కలు (గు), కల ('కల' అనే విశేషణానికి మూలము 'కలు' అనే ధాతువుండవలెను. ఇప్పుడది లేదు. 'కల' అనే విశేషణము మాత్రమే మిగిలినది. తక్కిన సందర్భాలలో 'కలుగు' ధాతువే ప్రచారములో ఉన్నది.) కూల్చు; కొను (సహాయకక్రియ), ఆస్వాదించుకొనే; కొట్టుకొని, తలచుకొను, తలచుకోక, తీర్చుకొనే, పెట్టుకొని, మేలుకొని; కొట్టు (కొట్టి); కొరుకు; చచ్చు (చస్తే); చూచు (చూడక, చూచి); చెడు (చెడితిని); చేయు (చేయకుండా, చేయలేని, ఉపదేశము చేయు); తిను (చెడతిని); తీర్చు (తీర్చుకోక); తోచు; నవ్వు (నవ్వి); పడు (పడిన, సహాయపడని); పారు (పారిపోతున్న, పారవేయు); పుట్టు (పుట్టిగే); పెట్టు (సంతోషపెట్టు); పొందు (అభివృద్ధి పొందు, పొందితే); పోవు (నిద్రపోతున్న, పారిపోతున్న); రాల్చు (నిప్పులు రాల్చు); లేచు, లేవు; వచ్చు; విడుచు (విడువక); విసరు; వెంబడించు (వెంబడించి వెంబడించి); వేయు.

(అ) సంపూర్ణక్రియలు :

### వర్తమానకాలము

ఉత్తమపురుషము :—ఉన్నాను, మేలుకొని ఉన్నాను, సంతోషపెట్టగలను.

ప్రథమపురుషము : మహద్వాచకము :— చూస్తున్నాడు, విసుస్తున్నాడు.

అమహద్వాచకము : ఏకవచనము :—ఉన్నది, ఉంది, కూల్చుతున్నది, నిద్రపోతున్నది, కొరికివేస్తున్నది, రాలుస్తున్నది, వస్తున్నది, వేస్తున్నది.

బహువచనము : నిద్రపోతున్నవి. పడుకున్నవి.

### భూతకాలము

మధ్యమపురుషము : ఏకవచనము :—చేసినావు.

ప్రథమపురుషము : ఏకవచనము:—అయినది, ఆరంభించినది.

,, బహువచనము:—లేచినవి.

### భవిష్యత్కాలము

ఉత్తమపురుషము : ఏకవచనము :—లేపుతాను.

ప్రథమపురుషము : మహన్మహతీ బహువచనము :—నవ్వుతారు, పారవేస్తారు, విసరుతారు, వేస్తారు.

'బాగుండది' అనే రూపమున కర్తృశేష మున్నది.

(ఇ) వ్యతిరేకక్రియలు :—

ఉత్తమపురుష : ఏకవచనము :—తీర్చుకోలేను.

ప్రథమపురుషము : మహన్మహతీబహువచనము :—చూడరు, కొనరు, తలచుకోరు.

అమహత్తు : ఏకవచనము :— ఉండదు, తోచదు, లేదు.

,, : బహువచనము :—ఉండవు.

'విడువకున్నది' అనే వ్యతిరేకరూపనివృత్తిలో విశేషమున్నది.

(ఈ) ఇతరక్రియలు:—ఒక్కడను, వ్యర్థమను, మిత్రమవు, నురుకవు.

## VII అవ్యయములు

(అ) ఎట్లు ; ఎంత (భయంకరము) ; ఎంత (విచిత్రము) ; ఎందుకు ; ఎలా ; ఏమి ; క్రింద ; గిలగిల ; మరి (రెండు) ; మరి (వీనివల్ల లాభము లేదు) ; (వీటికి) మాత్రము ; ముందుకు.

విశేష్యవిశేషణములమీద అనుధాతుజన్యమైన 'గా' చేర్చడము వల్ల అవ్యయాలేర్పడుతవి—భయంకరంగా.

(ఆ) ఆశ్చర్యార్థకములు : అయ్యో ! ఆఁ ! ఆఁ ! ఉహూ ! ఓహో ! బలే !

(ఇ) కొన్ని ఏకాక్షరకావ్యయముల విశేషార్థములు :—

ఆ (ప్రశ్నార్థకము) : సరా ? దంచుగేనా ?

ఆ (సముచ్చయదీర్ఘము) : అంతా ; సందేహార్థకములు : అయినా ; చూసినయినా చూడరు ; అంటిపెట్టుకొని ఉండేవాళ్లయినా ; తలచుకోవయినా తలచుకోరు.

అ : చేయకుండా. ఇందులోని దీర్ఘమున కర్థమేమి ?—కూడా.

ఈ : ఏమిరా ; వేలకొద్దీ ; అయినదీ ?

ఊ : ఉన్నవాళ్లూ ; ఉన్నంతవేపూ ; తీర్చుకోలేరూ ?

ఏ : విశేషణచిహ్నము—ఉండే, ఈడేరే.

ఏవార్థకము : వరకే, ఒక్కటనే, వాళ్లే.

ఉండదే! తోచదే!—వీటిలోని అర్థవిశేషమును గమనించాలి.

అంతే ? (దీనిలో 'ఏ' ప్రశ్నార్థకము.)

ఓ : సందేహార్థకము; ఏమో!

(ఈ) స్వరవిశేషముచేత ఆశ్చర్యబోధ—ఎంత విచిత్రమైనదీ లోకము ! సంహారము ! సంపూర్ణసంహారము ! ఎన్ని పక్షులు నిద్రపోతున్నవి ! ఎంతెంత కాళ్లు ! ఎంతెంతలేని గోళ్లు ! ఎంత భయంకరంగా ఉంది ! కూలుస్తున్నది ! అయినది ! ఆరంభించినది !

ఈ (౧) స్వరమే భాషకు ముఖ్యప్రాణము. దీనికితోడు (౨) 'శైలి'; (౩) యాస; (౪) పదముల పౌర్వాపర్యము; (౫) ప్రకరణము—ఈ అయిదున్ను పంచప్రాణములు. వీటిని గ్రహించి నిరూపించడము చాలా కష్టము. ఇప్పటి కెవ్వరున్ను నిరూపించలేరు. నిరూపించలేరు. చైతన్యమనిర్భాష్యము, అనిర్వాచ్యము గదా!

ఇంతవరకూ ఒక చిన్న గ్రంథములోని చిన్న పరిమిత భాగమును మాత్రము శోధించి, అట్లు శోధించగా వచ్చిన ముక్కలను కొన్ని వర్గముల క్రిందకి తెచ్చినాము. అట్లే ఆ గ్రంథము నంతటినీ, లేదా నవ్యాంధ్రగ్రంథముల నన్నిటినీ ఆ విధముగానే చేస్తే, ఇంతకంటె కొన్ని వేలరెట్లు ముక్కలు ప్రోగుపడి, మరికొన్ని రూపాలు, మరికొన్ని వర్గాలు, మరికొన్ని విశేషాలు ఏర్పడి, మన మేర్పరిచే ప్రతివర్గములోను ఎన్నో ఎక్కువ ఉదాహరణాలు చేరుతవి. కాని ఏర్పడిన వర్గముల సంఖ్యమాత్ర మెంతో ఎక్కువగా పెరుగదు.

అయితే గ్రంథస్థమైన భాష చాలా పరిమితముగదా. ఏ రామాయణమో, భారతమో, భాగవతమో, కథలో, పద్యాలో, పాటలో—ఇవి అన్నీ ఏవో కొన్ని కథలను, జీవితములోని కొన్ని ఘట్టములను మాత్రము తెలియజేసే భాషలో ఉంటవి. నిత్యజీవితములోని భాష అనంతవిషయముల, అనంతసుఖముల, అనంతభావలోకమై ఉంటుంది. దాని నంతటినీ ఒకచోట చేర్చుట యసాధ్యము. గ్రంథస్థమైన దసలు భాషే కాదేమో అనిపిస్తుంది. ఎందుచేతనంటే, గ్రంథకర్త ఉన్నదాని నున్నట్టుగా గ్రహింపక, దానికి తన సంస్కారము కొద్దీ, శక్తికొద్దీ వన్నెలు, చిన్నెలు దిద్దుతాడు. లోకములో ఉండే ఆ పలుకుబడుల ఒకప్పుడు అందాలను గ్రహించలేక పోతాడు. వాగ్రూపముగా ఉన్నదే భాష. ఆ భాష ఉత్త గాలి. ఆ గాలి గాలిలో ఎప్పటికప్పుడు కలిసిపోతూ ఉంటుంది. అది ఇతరమనుష్యుల మెదడులలోని కెక్కితే అక్కడ కొంతకాలము నిలుస్తే నిలువవచ్చును. కాని శీఘ్రకాలముననే విస్మృతము కావచ్చును. లేదా, ఆ మనిషి అంతరించగానే ఆ భాషాజ్ఞానముకూడా అంతరించవచ్చును. అట్లంతరించకుండా, తానే మరొకకాలములో స్మృతికి తెచ్చుకొనడానికీ, తనకు దూరముగా ఉన్నవానికి తన భావమును తెలుపడానికీ, దేశకాలములలో మనకు దూరస్థులైనవారికి మన అభిప్రాయాలను తెలుపడానికీ, వారి భావాలను తెలుసుకొనడానికీ ఒక్కొక్క భాషను మాట్లాడేవారు తాము ప్రత్యేకముగానో, లేదా ఇతరులనుంచి ఎరువు తెచ్చుకొనే వ్రాత అనే దాని నేర్పాటుచేసుకున్నారు. ఈ వ్రాత ధ్వనుల నన్నిటినీ సరిగా నిరూపించలేక పోవచ్చును. నిరూపించలేదు కూడాను. ఏదో స్థూలముగా నిరూపించినా దానిలోని సొగసులను, మూర్ఛనలను, ఒత్తులను, నొక్కులను, చిన్నచిన్న మర్మములను తెలుప సమర్థము కాకపోతుంది. జీవితపుభాషలో ప్రతినిత్యమూ తాండవమాడుతూ ఉన్న వైచిత్ర్యమును, స్వరము, యాస, పదరచన, రచనలోని వైవిధ్యము, తారళ్యము—వీటి నన్నిటిని వ్రాత తెలుపలేదు. అట్లు తెలుపలేని వ్రాత చాలా పరిమితప్రయోజనము కలిగి ఉంటుందని వేరే చెప్పవలెనా ?

మరొక విషయము. లోకములోని భాష అంతా ఒక్కటే విధముగా ఉండదు. మండలములనుబట్టి, వృత్తులనుబట్టి, సంస్కారమునుబట్టి, చదువునుబట్టి, పరిసరములనుబట్టి, ఎదుట మాట్లాడేవారిని బట్టి, వయస్సునుబట్టి, మాట్లాడేవారి తాత్కాలిక శారీరక మానసిక తత్త్వమునుబట్టి, అవస్థనుబట్టి, ఇంకా ఎన్నో ఎన్నో విషయాలనుబట్టి మారిపోతూ ఉంటుంది. అందుచేత వ్రాతలో పట్టుబడిన భాషను శోధించి, వర్గీకరింపగలిగినట్లు కేవల వాగ్రూపభాషను చేయలేము. ఏ మూలలో, ఏ సంఘములో, ఏ కుటుంబములో, ఎవరెట్లు మాట్లాడుతున్నారో గమనించి, ఒకచోట చేర్చి, శోధించి, ఎవరు శాస్త్రమును, సంపూర్ణ శాస్త్రమును వ్రాయగలరు? ప్రపంచ భాషలలో అట్టి పనిని చేయడానికి సంస్కృతభాషలవిషయమున పాణిని, పతంజలి, వరరుచు లనే మునిత్రయమువారు ప్రయత్నించారు. కాని వారి ప్రయత్నమైనా సంపూర్ణముగా నెరవేరలేదు. ఆ మాటను వారే ఒప్పుకున్నారు. సంస్కృతభాషావ్యాకరణములో వైదికభాషా సంప్రదాయాలూ, లౌకికభాషాసంప్రదాయాలూ చేరేసరికి ఉక్కిరిబిక్కిరి అయిపోయింది వారికి. ఆ సంగతిని గ్రహింపగలిగిన మహాశాస్త్రవేత్త కాబట్టి పతంజలి తన మహాభాష్యములో—

"ఏవంహి శ్రూయతే, బృహస్పతి రింద్రాయ దివ్యం వర్ష సహస్రం ప్రతిపదోక్తానాం శబ్దానాం పారాయణం ప్రోవాచ—నాన్తంజగామ"

బృహస్పతి ఇంద్రునికి వేలకొద్దీ దివ్యవర్షములు ప్రతిపదోక్త శబ్దముల పారాయణము చెప్పినాడుగాని, వాటిని చెప్పడము పూర్తి కాలేదట. పరిమితగ్రంథసామగ్రి గల గ్రాంథికభాషావ్యాకరణమును నిర్మించడమే ఇంత కష్టమైతే, అనంతమైన, అగ్రాహ్యమైన, తరళమై తప్పించుకొనిపోయే జీవద్భాషకు వ్యాకరణము వ్రాయడ మెంత కష్టమైన పనో ఊహించుకోవచ్చు.

కాని, శాస్త్రకారుడు నిస్పృహ చెందనక్కరలేదు. ఎందుచేతనంటే, ప్రతిపదోక్తములైన శబ్దముల సంఖ్య అనంతమే అయినా, అవి అన్నీ విడిపోయి ఏర్పడే సజాతీయవర్గముల సంఖ్యమాత్రము కొంచెమే. ప్రతివర్గములోని ప్రతిపదోక్తశబ్దములున్ను ప్రత్యేక లక్షణములు గలిగి సామాన్యసూత్రగ్రథితములు కావడానికి యోగ్యములుగా ఉంటవి. అందుచేత వైయాకరణుడు చేయవలసిన పని (౧) సాధ్యమైనంతవరకూ ప్రతిపదోక్తశబ్దజాలము నేర్పరచడము, (౨) వాటిని వర్గములుగా విడదీయడము, (౩) ఒకొక్క వర్గములో చేరిన ప్రతిపదోక్తశబ్దముల సామాన్యలక్షణమును, లేక లక్షణములను గుర్తించి వాటికి సూత్రములను కల్పించడము, (౪) ఆయా సూత్రములలో ఇముడక నిలిచిపోయిన వాటి నాయా సూత్రముల కపవాదములుగా నిరూపించడము.

ఇది చాలా సులభముగానే కనబడుతున్నది కదూ! కాని, ఆ పనిని చేయడముమాత్రము మాటలతో చెప్పినంత సులువైనది కాదు. దానికి పరిభ్రమణము, పరిశ్రమము, పరీక్షణము, పరిమార్గణము,

పర్యాలోచనము, పరిశోధనము, పరిశీలనము, పరిప్రశ్నము, పరిజ్ఞానము—ఇన్నీ పరిపరి విధముల కావలెను. అప్పుడే సాధ్యమైనంత సంపూర్ణ, సమగ్రవ్యాకరణము లభిస్తుంది.

న్యాయముగా ఆలోచిస్తే, ఒకొక్క మండలభాషకు, ఒకొక్క సంఘమునకు, ఒకొక్క వ్యక్తిభాషకున్ను ప్రత్యేకవ్యాకరణ మేర్పడవలసినదే. ఆ అన్ని వ్యాకరణములలోని సామాన్యసూత్రముల నొకచోట చేర్చి ఆ సూత్రముల కపవాదముల నా సూత్రములక్రిందనే చూపిస్తే ఒక మహావ్యాకరణము తేలుతుంది.

పైని నా 'అశ్వత్థామ' నుంచి ప్రత్యేకించి వ్యాకరించిన ఆ చిన్న భాగమును చూడండి. దానిని చేయడానికి రెండు దినములు పూర్తిగా పట్టింది. కాని ఇంకా సూత్రరచన కాలేదుగదా. అయితే భాష అంతటికీ సూత్రరచన చేయవలెనంటే ఎంత కాలము పట్టుతుంది? ఒక జీవితకాలము చాలుతుందా? నావంటి ఒక్క సామాన్య వ్యక్తికలన అవుతుందా?

ఇంతా చేస్తే నా 'అశ్వత్థామ' లోని భాష నిత్యవ్యవహారస్థ భాష కాదు సరేకదా, నా నిత్యభాష అయినా కాదు. పాండవ కౌరవులకు గురువాచార్యుడయిన ద్రోణుని కొడుకు, బ్రాహ్మణుడు, వేదవేదాంగాధ్యయనసంపన్నుడయినా వేదజడుడయిన చాదస్తుడు (ఛాందసుడు) కానివాడు, మహావీరుడు, ఆత్మవిశ్వాసము కలవాడు, సాహసౌదార్యపూరితుడు, సౌహార్ద్రప్రేరితుడయినవాడు అయిన అశ్వత్థామ ఆ ప్రకరణములో ఎట్లు మాట్లాడిఉంటాడో ఆ భాషను నేను ఊహించుకొని నేనయి కల్పించినది కాని, అశ్వత్థామ మాట్లాడుతూ ఉండగా రికార్డుచేసినది కాదు. అశ్వత్థామ అసలు సంస్కృతములో మాట్లాడేవాడో, తన చుట్టుప్రక్కలవారివలె తన దేశప్రాకృతములో మాట్లాడేవాడో నా కేమి తెలుసు? వ్యాసాదులయిన సంస్కృతకవు లతనిచేత సంస్కృతభాషలో మాట్లాడించినారు. ఇతరభాషాగ్రంథరచయితలు అశ్వత్థామచేత మాట్లాడించవలసిన సందర్భము వస్తే తమ గ్రంథాలలో తా ముపయోగించుకొనడానికి తాము కల్పించుకొన్న భాషలనే మాట్లాడించినారు. అట్లే నేనున్ను అతనిచేత ఆంధ్రభాషలో మాట్లాడించినా ననుకొని తృప్తి పడుతున్నాను. కాని, నిత్యవ్యవహారములో నా నోటినుంచికూడా అటువంటి భాష రాదు. దానిని వ్రాసేటప్పుడు ఒకవిధమైన నాటకరంగము, ఒక సంస్కారము గల ప్రేక్షకులు, శ్రోతలు, ఒకవిధమైన ఆవరణము, ఒకరీతి విమర్శకలోకస్థితిజ్ఞానము, కావ్యరసదృష్టి, మనోవ్యాపారవిజ్ఞానము—ఇన్నిటినీ మనస్సులో ఉంచుకొని—

"దేశము నెంచి, కాలమును దృష్టి లగించి, తెగించి, యాత్మ సందేశవిధాన మెంచి"

ఇంకా ఏమేమో చేసి, భాష కొకవిధమైన గౌరవము, ఔన్నత్యము, మర్యాద, శక్తి, మాధుర్యము, రీతి, శయ్య, పాకము, ధ్వని, మూర్ఛనలు, ఇంకా ఏవేవో కలుగవలెనని మననము చేసి, నా సంస్కారము, నా చదువు, నా రసికత్వము, నా ఆత్మప్రీతి, పాండిత్యముల కనువుగా నా భాషను సంస్కరించి, మాటలు పేర్చి, చేర్చి, కూర్చి, ఆ వాక్యములను వ్రాసినాను. ఆ వాక్యములు కేవలకల్పితములు. కాని కృత్రిమములు మాత్రము కావు. ఎందుచేతనంటే—ఆ వాక్యములలోని పదములను నేను సృష్టిచేయలేదు. అవి లోకము లోనివే. ఆ పదముల స్వరూపమునుకూడా నేను సృష్టిచేయలేదు. ఆ రూపములుకూడా లోకములో నేకదేశమున కాకున్నా ఎక్కడనో ఒకచోట శ్రుతిగోచరము లయ్యేవే. కాని, ఆయారూపములలో ఒకొక్కదానికిన్ని మండలభేదమును బట్టిన్ని, వృత్తి మొదలయిన భేదములనుబట్టిన్ని రూపభేదము లుండవచ్చును. అయినా అట్టి అనేకరూపములలో అశ్వత్థామనోటివెంట ఆ ప్రకరణములో వెడలడానికి యోగ్యము లని నేను తలచిన రూపములను మాత్రము నేను స్వయముగా, బుద్ధిపూర్వకముగా ఏర్చి కూర్చిన వాక్యములు కాబట్టి ఒక విధముగా వాటికి కావ్యత్వసిద్ధి కలిగినది.

అశ్వత్థామ బ్రాహ్మణుడు కాబట్టి అటువంటి మాటలు పలికిస్తేనే ఆ పాత్రమునకు గౌరవము కలుగుతుందని అభిప్రాయపడి అట్లా వ్రాసినాను. కాని, ఆ అశ్వత్థామకాక గంజాము, విశాఖపట్టణముల లోని ఒక బ్రాహ్మణేతరవిశేషు డట్టి ప్రకరణములో నెట్లా మాట్లాడి ఉంటాడోకూడా వ్రాయవచ్చును గదా. అట్లా వ్రాసి చూడాము:

"ఏఁ...ఏఁ! అంతా? మారాజా! నీ యప్పు తీర్సుకోనేనా? యంత పనిమాలినోణ్ణి! ఈ యిల్లూ, యీ బాణాలూ యాల! పెద్దంపెగో! కౌరవులోళ్ళ పే రేటిమియాద కసుట్టింవా? అయ్యో! అందరూ గుర్రెట్టి నిద్దరోతున్నారు. నా నోణ్ణే తెలిగసున్నా. శాబాసు! యంత యిసిత్రం యీ నోకం. పుట్టినప్పుడు మాత్తర మోసారి నాతారూ? ఎత్తిరిల్లి తే యాడుత్తారూ? తిన్నన్నాళ్ళూ తిని, సత్తే, అయ్యో! యీడివోళ్ల నాటం నేనే అని సుద్దులుపుకోని యవరిమా నాళ్లు నెసుత్తారూ? యీక్కి పోశేత్తారూ? అది తొలోకపోలి యాదికి తెస్సుకోనేనా తెస్సుకోరూ? కట్టకాలానికి కానోడు సుట్టమైతేనేఁ, నేతమైతేనేఁ—సచ్చినోళ్లలోనే నెక్కు. ఈన నా రాజు. తన నేనాను సంతోసపెట్టనం? యాడీ తోసజే! ఒహో హో! ఈ పిట్టమీా చిన్నిపిట్టలు నిద్దరోతున్నారో! నిమ్మళంగా యిశారం నేకుండా ఉన్నాయి. మనిసి దొక పిట్టబతుకయినా బాగుండేది గద్రా. ఆరూ, పోరూ ఉండదు. యామో? యీటికి మాత్తరం కోపం, తాపం, ఒంటెత్తులేనం యాల ఉండవు? ఆ కొట్టుమీది కొలా వోత్తున్నదో ఆ పిట్ట! బయ పేత్తున్నది. కళ్లెంట నిప్పులు రాలుత్తున్నది. ఆఁ! ఆఁ! మిందకెట్టింది! పీకలు కొరికేత్తున్నది. యన్ని పిట్టలో! నిద్దర మత్తుమీద పెగిసినాయి! ఓలబ్బో! ఆకార్లు! ఓలమ్మో! ఆగోళ్లు! రెక్కలు గిలగిలా కొట్టుకో గింజకో పడి సత్తున్నాయి. పారిపోతున్నా దొద్దె!

దొంటబె ట్టింటబెట్టి, తరిమీ తరిమీ రెక్కలతో కొట్టి కూలుస్తున్నాది. వహ్వా, వహ్వా! సంపేసె! అన్నిట్నీ సంపేసె. నో గుడ్లగూబోవ్! నువ్వు నాకు గురువ్వెహ్యాక్! మాంచి నేత్తాని వహ్యావ్! మనిసై కోడు మప్పలేని బుద్ధి మప్పినావ్. మావేని నేపుతాను. మావాః! మావాః!"

పై వాక్యములకున్ను, నేను నాటకములో వ్రాసిన దానికిన్ని అభిప్రాయములో ఎట్టి భేదమున్ను లేదు. కాని, మాటలలో ఎంతో భేద మున్నది. కొన్ని భేదాలు పైకే తెలిసిపోతున్నవి. (౧) సంస్కృత పదాలు తక్కువగ ఉన్నవి. తెనుగుపదా లెక్కువ అయినవి. (౨) ఉన్నది, ఉన్నవి మొదలయిన క్రియారూపాలలో మధ్యనున్న అచ్చుకు దీర్ఘముకలిగి ఉన్నాది, చేస్తున్నాది మొదలయిన రూపాలు వచ్చినవి. ఉన్నవి అనడానికి ఉన్నాయి అని రూపము కలిగినది. 'నేను' కు నాను! (౩) లేదు, నేదు; లేపు, నేపు; లెను, నేను మొదలయిన వాటిలో లకారమునకు నకారాదేశము కలిగినది. (౪) ఓలమ్మో! ఓలబ్బో! అనే ఆశ్చర్యార్థకములు. (౫) తరిమీ తరిమీ; మావాః మొదలయిన అనునాసిక్యోచ్చారణములు—ఇటువంటి వింకా భేదాలను గుర్తించవచ్చును. ఇట్లే తెలంగాణపు భాష, రాయలసీమ భాష, కోలాదుభాష, దాక్షిణాత్యభాష—మొదలయినవాటిలో ఎన్నెన్నో మాటతీరులు బయలుదేరుతవి. వాటి నన్నిటినీ ఒకచోట చేర్చి వ్యాకరించడము సామాన్యమైన పనికాదు. నాలుగు మొగముల బ్రహ్మ అయినా, వేయినోళ్ల అనంతుడయినా ఆ పనిని చేయలేడనే మాట సత్యము. అయితే యేమి చేయాలి? చేతులు ముడుచుకొని కూర్చోవలసినదేనా? సాధ్యమయినంతమట్టుకు ప్రయత్నింతాము. మనము వ్రాయబోయే వ్యావహారికనవ్యాంధ్రవ్యాకరణము సర్వాంగ సంపూర్ణ మాతుందనుకొనడ మసందర్భమే. కాని, మన మా వ్యాకరణము వ్రాసే పద్ధతులు శాస్త్రపద్ధతులైతే, లోపలి పూర్ణమును తరువాత వచ్చే పండితులు వారివారి ఓపికకొద్దీ పూర్తిచేసుకుంటారు. ఈ ఉద్దేశముతోనే నవ్యాంధ్రవ్యాకరణమును వ్రాయ సాహసిస్తున్నాను. పండిత ప్రకాండుల, పెద్దల ఆశీర్వచనబలమువల్ల చేపట్టిన కార్యము కొంతవరకైనా నెరవేరకపోతుందా? నెరవేరకుంటే పోనీ. ప్రయత్నించినపని అంతా లోకములో వెంటనే సిద్ధిస్తుందా? కాల మనంతము; 'విపులా చ పృథ్వీ'.





బౌద్ధభిక్షువు

చిత్రకారుడు : శ్రీ అడవి జానకిరామ్.

# అర్ధభాగాలలో భిన్నహృదయాలు

'మీరిలా యేడుస్తూ కూర్చుంటే యెలాగండీ? ఆయనకేం, పుణ్యాత్ము లయ్యారు!'

'..................'

'నాలో దుఃఖం లేదా? నేను మీ కంటే హెచ్చుగా యేడవవలసింది!'

'..................'

'అబ్బాయి యేడుస్తున్నాడు. పాలది యింకా పాలు తీసుకరాలేదు. ఒక్కసారి వెళ్ళండి...'

'ఆ చావు నాకైనా వచ్చింది కాదు. యీ సంసారబాధలన్నీ యెవరు పడ్తారు?'

'రామరామ! అవేం మాటలండి. పోనీ, కమలాన్నే పంపిస్తాను లెండి.'

'వీధిలోకి పంపకు; నలుగురూ నవ్వుతారు'.

రుక్మిణి మరి మాటాడలేకపోయింది. వంట యింట్లో కూర్చున్న కమలం కారుతున్న కన్నీటిని చీరకొంగుతో తుడుచుకొంటోంది.

'యీ కర్మ యెలా చేసేది...?'

'అందుకేనా అంతగా విచారిస్తున్నారు? మామయ్యగారు బ్రతికినంతకాలం ధర్మంగా పోయారు. అంత పెద్ద నౌకరీ చేసినా ఒక్క కానీ లంచం పుచ్చుకోలేదు. అందుచేతనే యే బాధాలేకుండా స్వేచ్ఛగా మరణించారు. ఆయనకర్మకు ఆయనే డబ్బు సమకూరుస్తాడు. ధైర్యం చెప్పవలసిన మీరే అలా యేడుస్తూ కూర్చుంటే... చూడండి. పిల్లాడు పాలు లేక యెలా యేడుస్తున్నాడో! చూశారా! వంట యింట్లో మీ చెల్లెమ్మ—మీ కడుపే కాదు, అందరి కడుపులూ దహించివేస్తున్నాయ్. కాని చచ్చేవారితో మనం చస్తామా! అన్ని విషయాలూ మీకు తెలుసు. ధైర్యం తెచ్చుకోండి...'

'సరే, ఆ పాలచెంబు యిలా తే' అంటూ మంచంమీదనుంచి చిరాకుగా లేచాడు కిష్టయ్య. కమలం పాలచెంబు తెచ్చి అందిచ్చింది. అన్నయ్యదగ్గరకు రావటంతోనే ఆమెదుఃఖం పొంగిపొరలింది.

శ్రీ బలివాడ కాంతారావు

'ఈ పాడుయింట్లో ఆడబిడ్డనై యెందుకు పుట్టానమ్మా? ఆ మాత్రం మా బాధ్యతను తీర్చుకోలేకపోయాం...' అంటూ కిష్టయ్య చేతితో తన నుదురు పట్టుకొని గబగబా వీధిలోకి నడిచాడు.

రుక్మిణమ్మ మాట్లాడుదామన్నా పెదిమలు కదలలేదు. కమలానికి తామంతా ద్రోహం చేశారు. పెద్దమనిషై ఆరు సంవత్సరాలైంది. యింకా పెండ్లంటూ చెయ్యలేదు. 'నేనే చక్రవర్తినైతే వరకట్నాలు పుచ్చుకున్నవాడికి పదేళ్ళు కఠినశిక్ష వేసేస్తునురా కిష్టయ్యా!' అన్న మామమాటలు యింకా రుక్మిణిచెవులలో మారుమోగుతూనే వున్నయ్. అంత శాంతపరుడైన మామగారికి యీ కమలంసంబంధంకోసం వచ్చినవారు అడిగిన వరకట్నాలవిషయమై అంత చిరాకూ, కోపం వచ్చినై. 'పెద్ద శిరస్తాదారు పనిచేశాడే! అరవైరూపాయలు పింఛను పుచ్చుకుంటున్నాడు. కొడుకో నలభై రూపాయల జీతం తెచ్చుకుంటున్నాడు గదా. ఆమాత్రం వెయ్యిరూపాయల కట్నం యీయలేడేం! యెందరున్నారని యింకా—యీ ఒకేఒక కూతురే కదా!' అన్నవారే ప్రతీవారూనూ. మొత్తంమీద కమలం పెండ్లికోసం చివరిరోజులలో పరితపించి పరితపించి చివరకు పెండ్లి చెయ్యకుండానే స్వర్గస్థుడయ్యాడు రామయ్య.

రామయ్యగారు వున్నప్పుడు కిష్టయ్యకు కుటుంబబాధ్యత తగలలేదు. ఉద్యోగం చెయ్యటం, జీతం తెచ్చి తండ్రిచేతులలో పెట్టటం, వేళకు యింటి భోజనం చెయ్యటం—ఇదే ఆయనపని. కుటుంబభారమంతా అరవైయేండ్లు నిండినా రామయ్యనెత్తినే వుండేది. కిష్టయ్య నలుగురు పిల్లల తండ్రి అయినప్పటికీ చాలా స్వేచ్ఛగా తిరిగాడు.

తన బావుటా దిగ్విజయంగా యెగిరేటప్పుడు రామయ్య అందరినీ ఆదరించాడు. అందరూ మావారే అన్నాడు. వచ్చే జీతమంతా బంధువుల ఆదరణకే వినియోగించాడు. ఆర్జించిన దేమీ లేదు. యేమున్నదో—పెండ్లికాలమందు రుక్మిణమ్మమెడలో వేసిన పదిహేనుతులాల బంగారంగొలుసు మిగిలివుంది. తను పింఛను పుచ్చుకున్నతరువాత తన పింఛనూ, తన కొడుకుజీతమూ వచ్చిన చుట్టాలక్రిందా, సంసారం సాగటానికీ సరిపోయేది. 'రామయ్య మావాడే, మా అల్లుడు చిన్నవాన్ని తాత మనుమడు' అని యిలా రకరకాల వరసలు కల్పించి తిష్ఠ వేసేవారు మూడునాలుగురోజులు. కిష్టయ్యకు సంసారంగొడవే వుండేది కాదు. రుక్మిణి మామగారు యెలా అంటే అలా. ఆమెకు తండ్రయినా, తల్లయినా రామయ్యగారే. రామయ్యగారు రుక్మిణిని బంధుజనాదరణలో అందెవేసినచెయ్యిని చేశారు. సంసారపు ఒడుదుడుకులను రుక్మిణి అవగాహన చేసుకొని ధైర్యంతో మెలగగలిగేది.

రామయ్యగారు చనిపోయేవరకూ మాట్లాడుతూనే వున్నారు. కూతురు కమలాన్ని చేరదీసి 'అమ్మా, నీనాన్నను క్షమించు...అన్నిటికీ మహాయిల్లాలు నీ వదిన వుంది...'అన్నాడు. యింకా యేవో మాట్లాడబోయాడుకాని పెదిమలు కదలలేదు. దుఃఖం ముంచుకొచ్చింది. ఆయన నాలుగుహంసలూ చూసుకొని కమలను మంచియింట్లో వేద్దామని వుబలాటపడ్డాడు. కాని ఆ కట్నం యెక్కడనుంచి తేవటం? రుక్మిణమ్మ తన గొలుసు అమ్మడానికి సిద్ధపడింది. కాని రామయ్య సమేమిరా ఒప్పుకోలేదు. ఒకవేళ అమ్మినా అది ఆ రోజుల్లో వెయ్యిన్నూటపదహార్ల ఖరీదు చెయ్యదు.

శ్రాద్ధభోజనానికి కులంవారంతా తినేవాళ్ళే 'యేమోయ్ కిష్టయ్యా! రామయ్యగారు పోయి వారంరోజులైనా యింకా పప్పులూ, వుప్పులూ యేమీ సమకూర్చుకోలేదేం? చాలా ఘనంగా బ్రతికాడాయన వినా వాస్తు. అలాంటి మహానుభావుడి శ్రాద్ధం మా ఘనంగా చెయ్యాలోయ్...' అని యిలా మని షాకలా తన్ను తిక్కుతింటుంటే కిష్టయ్యకు యెక్కడలేని దుఃఖమూ పొంగిపొర్లేది. తండ్రిచావువలన కలిగిన దుఃఖంకన్నా, యీ కొంపంతా యెలా నెరవేర్చటమా అనేదే హెచ్చుదుఃఖాన్ని కలిగించి చిన్న పిల్లవిమల్లే యింటిదగ్గర యేడ్చుకొంటూ కూర్చునేవాడు.

మామగారు చనిపోయాక రుక్మిణమ్మ భర్తకు సంసారంగోడవ అంటకుండా చూడడానికి చేతనైనంతవరకు ప్రయత్నించేది. కాని వీథిలోకి ఆమె యెలా పోగలుగుతుంది? యింట్లో బొగ్గులబస్తా ఆఖరు—బియ్యం కూడానూ. డబ్బిచ్చినా కిష్టయ్యకు 'బజారుకు వెళ్ళండి' అంటే చిరాకు. గొణుక్కుంటూ గొణుక్కుంటూ వెళ్ళేవాడు. బేరం తెలిసేది కాదు. వాళ్ళెంతంటే అంతే. భర్త యెలాంటివస్తువులు తెచ్చినా రుక్మిణమ్మ పల్లెత్తు మాట అడిగేదికాదు. 'చాలా చౌకగా తెచ్చారే' అనేది. ఆయన మనసుకు చీకాకు పరచడం ఆమెకు యిసుమంతైనా యిష్టంలేదు. పోనీ, కమలాన్నే బజారుకు పంపిస్తామా అంటే పని పోమాటగా గొణుక్కుంటారని భయం. అంచేత కిష్టయ్యనే బజారుకు పంపించవలసి వచ్చేది. రామయ్య కమలానికి ఒక్క పెళ్ళి తప్ప, మిగతావిషయాల్లో ఏమీ అన్యాయం చెయ్యలేదు. ఫోర్తుఫారంవరకు చదువు చెప్పించాడు; సంగీతం నేర్పించాడు. దేవుడిచ్చిన అందం ప్రకాశిస్తూనేవుంది. కమలం సుగుణరాశి. వదినగారి మాట ఆమెకు వేదవాక్కు. ఆమెహృదయం అమృతభాండం.

రామయ్యగారు చనిపోయారని పరామర్శకు యితరప్రదేశాలనుంచి వచ్చిన చుట్టాలు రెండుమూడు రోజులు పూర్వంలా తిష్ఠ వేసేవారు. వీరందరినీ చూస్తుంటే కిష్టయ్యకు అసహ్యం. 'యిన్నాళ్ళ వరకెందుకు? భామ్మనలేక పోయావా?' అని భార్యను గదమాయించేవాడు. కాని రుక్మిణమ్మ భర్తను మంచిమాటలలోనే శాంతింపజేసేది. వచ్చినవారు తిని వుత్తగా పోయేవారు కారు. నాలుగు నిందలు పరోక్షంగా మోపి మరీ యిల్లు కదిలేవారు. 'మామయ్య చావటం దీనికి యిష్టమేమో? మొగుడు గోల పెట్టుంటే, యిది పెద్దగోల పెట్టదేం? రామయ్య కండ్లుమూసి వారంరోజులు కాలేదుగాని, యింట్లో బంధువులను యెంత నిరాదరణతో చూస్తున్నారు!' యిలా ఊరిలో, కులంవారిలో చాటుతూ పోయేవారు.

వుత్తచెంబుతో తిరిగివచ్చాడు కిష్టయ్య. చెంబును క్రిందపడవేసి 'అమ్మో! అబ్బా...' అంటూ మంచంపై చేరబడ్డాడు. 'పాలు దొరకలేదాండీ?' అని ప్రశ్నించిన రుక్మిణి వేపు దీనంగా చూస్తూ 'ఇరవై రూపాయలు యివ్వాలటగా...ఆ డబ్బు యివ్వంది పాలెలా యిస్తుంది...?' అన్నాడు. భర్త నేత్రాలు అశ్రుపూరితాలు కావడం రుక్మిణమ్మ గమనించకపోలేదు. రుక్మిణి ఆ చెంబు తీసుకొని వీథిలోకి వెళ్తుంటే వింతగా చూస్తున్నాడామెవేపు కిష్టయ్య.

'మీకేనండీ కిష్టయ్యగారు — డాక్టరుగారు బిల్లు యిచ్చారు' అంటూ ఒక మనిషి గుమ్మందగ్గర నిలబడ్డాడు. వాడివేపు పెద్ద కండ్లతో చూస్తున్నాడేగాని, యేం మాట్లాడాలో తోచింది కాదు. కమలం వంటయింటి గుమ్మందగ్గర నిలబడి ఇది చూస్తోంది. 'యేమండీ మాట్లాడరు?' అని మరల ఆ మనిషి అన్న పలుకులు విన్న కమలం వడిగా వచ్చి 'యేదీ బాబూ ఆ బిల్లు...?' అంటూ తీసుకొని చూసి 'యాభై రూపాయలే!' అంది ఆశ్చర్యంగా అన్నవేపు చూసి. ఇంతలో రుక్మిణి వచ్చి, విషయం తెలుసుకొని 'బాబూ,' రేపు తప్పక యిచ్చేస్తామని చెప్పండి' అంటూ ఆయనను పంపించివేసింది.

'పాలెక్కడివి? నీళ్ళ పాలులా వున్నాయే...' అద్దాలలో వేసి కొడుక్కి పాలుపడుతున్న రుక్మిణివేపు చూస్తూ కిష్టయ్య అన్నాడు హీనస్వరంతో.

'ప్రక్కయింటివారిని అడిగి తెచ్చాను. తల్లి ప్రేమతో పోస్తే నీళ్ళయినా పాలకంటే హెచ్చుబలాన్ని యిస్తాయిలెండి'

'ఛీ! అయ్యకులవాళ్ళయింటి పాలెందుకు తెచ్చావ్?'

'కులంకులమై మహాసుఖం అనుభవించాం! కులంలో యేం వుంది? కష్టకాలంలో చేరి చూపిన వారే కులంవారైతే నేం, మాదిగ జాతే లెండి.'

ఈ మాటలు విన్న కిష్టయ్య ముఖం రెండోవేపుకు తిప్పాడు. కమలం ఆశ్చర్యం చెందింది—నిన్నటివరకు అంత నిష్ఠానియమాలతో వున్న వదిన యిలా మాట్లాడిందేమని.

పిల్లాడు నిద్రపోయాడు. వాడిని మంచంపై పడుకోబెట్టి భర్తదగ్గరకు వచ్చింది రుక్మిణి.

'యేమండీ! మీమనసును అనవసరంగా కష్టపెట్టుకోకండి. పుట్టించినవాడు అన్నంపెట్టకపోడు...'

'రుక్మా! శ్రాద్ధం చెయ్యకపోతే...'

'యెంత మాట అడిగారండి...'

'యీమందలో తక్కువగా చేసుకోలేమే? వ్యవధికూడా లేదు. యింతకూ ఆ తక్కువగానైనా చేసుకోడానికి యేముందని?'

'నేనూ యీ విషయమే మాట్లాడుదామని వచ్చాను. నలుగురిలోనూ మన కా చిన్నతనం యెందుకు? నా గొలుసు తీసుకవెళ్ళి యెక్కడైనా ఒక మూడువందలకు తాకట్టు పెట్టండి. పాలవాడికి, డాక్టరుగారికి మిగతా, చిల్లర బాకీలకూ ఒక వంద పోగా మిగతా రెండు వందలతో యెలాగో కానిద్దాం...'

'ఆ గొలుసు తాకట్టుపెట్టితే వడ్డీ పెరగడమేకాని లాభం లేదు. అమ్మి యిలా యీకార్యానికి తగలేస్తే కమలం పెండ్లి యెలా చేస్తాము? రుక్మా! నామాటకు యిక అడ్డుపెట్టకు. ఆ గొలుసు యిలా తే. చెయ్యవలసిందేదో నేనే చేస్తా'నని గొలుసు తీసుకొని వీథిలోకి నడిచాడు కిష్టయ్య.

భర్త యిలా ధైర్యంగా మెలగటం చూసి రుక్మిణి ఆశ్చర్యపోయింది. మామగారి ఆత్మ అనే వెలుగు యిలా ఆయనకూ ధైర్యాన్ని ప్రసాదించి వుంటుంది అని నమ్మింది. కండ్లు మూసింది. మామయ్యగారిని ఆ చీకటిలో చూడగలిగింది. కన్నీరు చెక్కిళ్లమీదినుంచి కాలువలా ప్రవహించింది. తన తండ్రికన్నా హెచ్చుగా చూశారు మామయ్యగారు. అసలే అధైర్యానికి ఆహుతైన భర్తగారికి ధైర్యం చెప్పటానికని ఆమె గుండె రాయి చేసుకుంది. కాని అప్పుడప్పుడూ పశోతుంగా కన్నీరు కార్చకుండా వుండలేకపోయింది.

'వదినా!...' అన్న కమలంపలుకు చెవిని పడగానే చీరకొంగుతో వడిగా కన్నీటిని తుడిచివేసి వెనుతిరిగి 'ఏం కమలం—!' అంది.

'వదినా...'

'నీ అన్నయ్యను చూచి నీవుకూడా యేడుస్తూ కూర్చోకమ్మా. నా కెవరున్నారు? తల్లా, తండ్రా? అంతా మీరేకదా! యిద్దరం ధైర్యంగా వుండి ఆయనను ధైర్యంగా వుంచాలి...'

'వదినా! ఒక విషయం చెప్దామని వచ్చాను...'

'చెప్పమ్మా, చెప్పు'

'మరేమీ లేదు. నా పెళ్ళివిషయమై మీరు బెంగపెట్టుకోకండి. నాకు యెవరినీ పెండ్లాడాలని లేదు. యేదైనా వుద్యోగం చేసి అన్నయ్యకు కాస్త సహాయం చేద్దామని వుంది...'

'అయ్యో! పిచ్చితల్లీ! ఉద్యోగం చేస్తే యింక వీధిలో నడవనిస్తారా? యీ వూర్లో వుండనిస్తారా? ఇప్పుడు యింట్లోనైనా కూర్చుంటున్నారా? నిన్న వంటయింట్లోనే మాట్లాడుతున్నావని నాలో నేను కుమిలి పోతూంటే—'

'వదినా, మీ రలా అనుకోకండి. నాతల్లి కంటే మీరు హెచ్చుగా చూస్తున్నారు...' ఇంకా యేదో మాట్లాడబోయింది కమలం. ఇంతలోకే శాస్త్రిగారు రావటంవలన ఆపవలసివచ్చింది.

'అవునమ్మా, ఇదేం బాగుందా? అంతటి మహానుభావునికి మీరు పుట్టగతులు లేకుండా శాశ్వతనరకంలోకి పంపిస్తున్నారు!'

'బాబూ, మీమాటలు నా కర్థంకావటంలేదు.

'యెలా అవుతాయ్? కులంలో ఘనంగా బ్రతికేవాళ్లా వద్దా? అమ్మాయికి పెళ్ళి చెయ్యలేదని యిప్పటికే నలుగురూ వెక్కిరిస్తుంటే యీ వేషంకూడా యేమిటి?'

'బాబూ, మీకాళ్ళపై పడ్డాను. ఆ విషయమేదో చెప్పండి యెలా...'

'ఇంకేమిటి—అదే. శ్రీజగన్నాథంలో శ్రాద్ధంచేస్తే యెవరు వస్తారని? అక్కడ చెయ్యడమేమిటి? చచ్చిన యింట్లోనే చెయ్యాలని వేదాలు ఘోషిస్తుంటే! కిష్టయ్యకు మతిపోతే నీక్కూడా మతిపోయిందా అమ్మా!'

'శ్రీజగన్నాథంలో చేస్తానన్నారా? యెప్పుడు చెప్పారు మీతో?'

'ఇప్పుడే. బజారులో. ఆమాట విన్నాక నాశరీరం అంతా తేళ్ళూ, జెర్రులూ పాకుతున్నాయ్. అంత గౌరవకుటుంబాన్ని డబ్బుకాశించి నాశనంచేస్తాడా అని. ఒక్క యెనిమిదివందలరూపాయలకై తప్పలై పోతుంది. మీ మామయ్యగారు పెద్ద సిరస్తాదారుపని చేశారని మాత్రం మరచిపోకండి.'

'బాబూ! యీ విషయంలో నే నేమీ మాట్లాడలేను. అంతా ఆయనయిష్టం—'

'అయ్యో! వెర్రితల్లీ! మొగుడు తప్పు చేస్తే దిద్దటానికి భార్యకు సర్వాధికారం వుందని శాస్త్రాలు ఘోషిస్తుంటే...'

'బాబూ! మీ కోనమస్కారం. మా అన్నయ్య యెలా అంటే అలా నడవవలసినవారం. దయచేసి మమ్మల్ని కష్టపెట్టకండి' అని మధ్యను కలుగజేసుకొని వినయంగా అంటున్న కమలంవేపు యెర్రగా చూస్తూ 'నీక్కూడానా... చూస్తానుగా. మీ రెలా యీవూర్లో శ్రాద్ధం చెయ్యరో నే చూస్తాను. నా తడాకా చూస్తారుగా!' అంటూ చేతికర్రను నేలమీద కొట్టి గుమ్మం దాటాడు శాస్త్రిగారు. రుక్మిణీ, కమలం ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

బజారునుంచి కిష్టయ్య వచ్చాడు. 'అమ్మయ్య! కాస్త మనసు కుదుటపడింది.' అన్నాడు భార్యవేపు చూస్తూ. 'రుక్కూ! ఇదిగో ౮౦౦ రూపాయలు. గొలుసు అమ్మివేశాను. యీ గోముఖవ్యాఘ్రాలక్రింద డబ్బు తగలేసేబదులు శ్రీజగన్నాథం పోయి, అక్కడి పేదలకు నాన్నగారి పేరు చెప్పి యింత దానం చేస్తే ఆయన స్వర్గానికి పోతారు.'

'సంఘంలో బ్రతుకుతున్నాం. కమలం పెళ్లి చెయ్యవలసి వుంది. ఆలోచించండి.'

'యీ డబ్బు వాళ్లక్రింద తగలేద్దామనా నీవుద్దేశం?'

'.........................'

'మాట్లాడవేం? యీ డబ్బుతో పెళ్ళి కూడా చెయ్యొద్దు.'

'పెండ్లి అంత తక్కువలో అయిపోతుందా?'

'రుక్కూ! అన్నిటికీ లోకానికి జడిసే యింకెవరికూ తెచ్చాడు నాన్న. అన్నిటికీ పరోపకారం అంటూ ఘోషించే మమ్మల్ని తగలేశాడు. యీ విషయంలో మరి యెవరు మాట్లాడకు—'

'మామయ్యగారిని దూషించకండి. ఆయన మహాత్ముడు. ఆయన చేసిన పరోపకారమే అదే పుణ్యం—మనను, మన తరతరాలవారిని రక్షిస్తుంది. అన్నీ మీకు తెలుసు. నే నేం చెప్తాను?'

డబ్బు భార్య చేతికిచ్చి వీధిలోకి పోయాడు కిష్టయ్య. అప్పటికప్పుడే శాస్త్రిగారు వీధిలో ఢంకామీద దెబ్బ కొట్టి యీ విషయం చాటుతున్నారు. యీ శ్రాద్ధంలో అన్నము తెండుకందల రూపాయలైనా సుంజాకుంటా మనుకున్నారు. కాని ఆయనఆశలు అడియాసలయ్యాయి. 'రామయ్యగారి పుచ్చెబుట్టా' అన్న దూషణలు అప్పుడే రేగుతున్నాయి.

చిరాకుగా కిష్టయ్య యింటికి వచ్చాడు. భార్యతో మాట్లాడలేదు. పరుపుపై వాలాడు. రుక్మిణి చంటిపిల్లాడిని యెత్తుకొని, భర్త యేం చెప్తారో అని మంచం దగ్గరగా నిలబడింది. అప్పుడే బడినుంచి వచ్చిన పదేండ్ల కుమార్తె సరళా, యేడేండ్ల కొడుకు రామం 'అమ్మా! రేపు మాకు సెలవే' అంటూ వచ్చి అమ్మదగ్గర నిలబడ్డారు. రుక్మిణి పిల్లలను చేరదీసింది. అమ్మా, అమ్మా అంటూ నాలుగేండ్ల మోహనుడు కమలాన్ని విడిచి దగ్గరకు వచ్చాడు. నలుగురు పిల్లలనూ, వదిననూ వంటి యింటి గుమ్మందగ్గరే నిలబడి చూస్తూ కమలం మురిసిపోయింది. దుఃఖాన్ని మరిచి పోయింది.

'నాన్న పడుకున్నారేం అమ్మా!' అని సరళ అడిగింది.

'అమ్మా, అమ్మా! తాతయ్య యెప్పుడు వస్తాడే!' అంటూ యేడేండ్ల రామం అమ్మ ముఖంవేపు చూస్తూ అడిగాడు.

కొడుకు మాటలను విన్న కిష్టయ్య ప్రాణంలో లేక మండం చేసి మోహనుని ఎత్తుకొని ముద్దాడి రామారావ్ని చేరదీశాడు. 'అమ్మా! కమలం! కాసిన్ని మంచినీళ్లియమ్మా' అని కేక వేశాడు. కమలం మంచినీళ్లు తెచ్చింది. త్రాగి 'అమ్మయ్య!' అన్నాడు.

'రుక్మా! శ్రీజగన్నాథానికి రేపే ప్రయాణం. ఇప్పుడు ఇంకా వుంటే ఏ శ్రేమైనా చేస్తారు. రైలుబండి నడవకుండా చేస్తారేమో అని భయంగా వుంది'

'అయితే, వెళ్లటానికే నిశ్చయించారా? ఆ మాత్రం పొదుపుగా యిక్కడే చేసుకుంటే?'

'సరి, మొదటికే వచ్చావ్! రెండు వందలు శాస్త్రిల్లుగారికీ, అయిదువందలు శ్రాద్ధభోజనానికీ ఖర్చుపెట్టినా చెప్పు—నాకేం అభ్యంతరం లేదు. వీళ్లంతా మనం చెడిపోతే చూస్తూ నవ్వుతారే గాని ఒక్క దమ్మిడీ యిస్తారా? మోహనుకు యూఫాయిడ్ రూపాయలిస్తే గాని శవం కదలలేదు. చచ్చిన వారి ఆత్మశాంతికి వారు చూపించిన మార్గాన్ని అనుసరిస్తే చాలు. పందొమ్మిదివందలనాన్న ఈలో యిా ధనవంతుల భోజనాల నింపేబదులు ముసలమూడై పేదవాని కడుపుకు గంజి పోస్తే నాన్నకు శాంతిస్తుందిలే...' అన్న కిష్టయ్య మాటలు విన్నాక రుక్మిణి మరి మాట్లాడలేకపోయింది. అరోజు పాతసంత్రం పాలవాడికి, డాక్టరుగారికి ఇవ్వవలసింది, మిగతా చిల్లర బాకీలూ తీర్చివేసింది.

పొరుగింటి ఆయన కులంచేత అయ్యరకల వాడు కాని వారి యిల్లు చాలా శుభ్రంగా వుంటుంది. ఆయన డివిజనల్ ఆఫీసులో గుమాస్తాగా పని చేస్తున్నారు. ఆయనభార్య తో రుక్మిణి 'యింటిని చూస్తుండ'మని చెప్పిన మీదట తెల్లారగట్ల నాలుగ్గంటలకు పూరీ పోయే ప్యాసింజరులో అంతా బయలు దేరారు.

రెండు వందలతో శ్రాద్ధం చెయ్యటం అయి పోయిందని కిష్టయ్య సంతోషించాడు. యింకా రెండువందలకు పైగా వున్నాయి. అవి జాగ్రత్తగా వుంచి నెల నెల కేమైనా జీతంలో మిగిలేసి ఒక పేదయింట్లోనైనా చెల్లెమ్మను పడవేస్తా ననుకున్నాడు.

౨

పూరీనుంచి తిరిగి వచ్చేటప్పటికి పూరిలో మనిషోమాట, మనిషో కూత! శాస్త్రిలు తిరగవేస్తున్నారు—కిష్టయ్య జగన్నాథం వెళ్లిన నాటినుంచీ. 'వీడిని జాతిలోనుంచి వెలివెయ్యవలసిందే' అని శాస్త్రిల్లుగారు పట్టుపట్టారు.

పూరీ అడంగులు యెవరు వచ్చి యేమన్నా రుక్మిణమ్మ మౌనం దాల్చేది. చుట్టాలు రావటం మాత్రం తగ్గలేదు. వచ్చి రెండేసి నాలుగేసి రోజులకు తక్కువ కాకుండా మకాం వేసి, కడుపు నిండా తిని, నాలుగు నిష్ఠూరాలు విడిచి పెట్టిపోతూనే జరుగుతున్నది. ఉన్న డబ్బులో యూఫాయిడ్ రూపాయలవరకూ భర్తకు తెలియకుండానే రుక్మిణి ఖర్చుపెట్టింది. 'వారందరూ యింకా మన సంసారాన్ని నాశనము చెయ్యాలనే! పొమ్మనలేక పోయావా?' అని అప్పుడప్పుడు రుక్మిణిని మందలించేవాడు. చుట్టాలను యెలా పొమ్మన గలుగుతుంది? భర్తకోపాన్ని శాంతి వచనాలతో చల్లార్చటానికి ప్రయత్నించేది రుక్మిణి.

శాస్త్రిల్లుగారి ప్రచారమూ, పోటీలూ రాను రాను హెచ్చిపోతున్నాయి. 'చెల్లెలికి వీడు పెండ్లిచేసి యేడ్చాడు! దాని బుద్ధి మంచిదైతేగా...!' ఇలా విమర్శలు సంఘంలో కిష్టయ్యకుటుంబంమీద నాటుకమే ఆయన విధిగా ఎంచుకున్నాడు. ఆఫీసులో తన తోటి గుమాస్తాలు కొందరు ఎప్పిపొడిచేవారు. దానికి తగ్గట్టు పనికూడా హెచ్చుగానే ఉండేది. వీధిలోంబడి తలెత్తి నడవటానికి భయం. కొందరు ఆయనను చూచి తుప్పుమని క్రింద వుమ్మి వూసేవారు. కోపం వచ్చేది. కాని యేం చేస్తాడు? తన్నెప్పుడు ఆ విషయం తలచుకొని విచారించేవాడు. తాను చేసింది మంచి పనే అని సంతృప్తిపడి ప్రజల నిరాదరణను మరిచిపోవడానికి ప్రయత్నించేవాడు. ఒక్కొక్కసారి యెవరైనా తనవిషయాల్లో అనవసర ప్రస్తావనతెస్తే కోపం వచ్చి, వారిని నాలుగు చీవాట్లు పెట్టేవాడు; నాలుగు తినేవాడు. చిరాకుతోనైనా ఆఫీసుపని చెయ్యక విధిలేదు. చేస్తే తప్పులు వచ్చేవి. ఆఫీసరు పెట్టే చీవాట్లుకూడా తినవలసివచ్చేది. ఇంటికి పెద్ద ఫైళ్లకట్ట మోసుకొని వచ్చేవాడు. పనిచెయ్యటానికి విసుగుపుట్టేది. ఆయన తలలో తిరిగేది కమలానికి యెంత వేగంగా పెండ్లిచేసి సుఖిద్దామనే. ఆఫీసులో పని, యింట్లో సంసారంగొడవ, కమలం పెండ్లి కోసం తిరగటం, పూరిలో కులంవారు పురి పిస్తున్న దూషణలు భరించటం—ఇవి ఆయనకు విసుగు కలిగించేవి. విసుగుతో కోపంకూడాను. కిష్టయ్య సంసారపుగొడవ తాకకుండా చేయటానికి రుక్మిణి వీలైనంత వరకు ప్రయత్నించేది.

ఆరోజు ఆఫీసునుంచి చిరాకుతో వచ్చాడు. నాన్నా, నాన్నా అంటూ పిల్లలు ముగ్గురూ చుట్టూ మూగారు. ఆ ఫైళ్ళ కట్ట టేబిలుపైన పారేసి 'అమ్మయ్యా!' అంటూ చాపమీద కూర్చుండబడిపోయాడు. రుక్మిణి వచ్చింది. 'రుక్మా! అగ్రకులంలో యెందుకు పుట్టాం?' అన్న భర్తమాటలు విన్న రుక్మిణి 'మీరు విచారించకండి. ధైర్యంతో వుంటే యేకార్యమైనా నెరవేర్చగలుగుతాం!' అని ఓదార్చింది.

'రుక్మా! పేదవాళ్ళకు కూడాను కట్నాల పిచ్చేనే! పోనీ, ఈవూరునుంచి పోదామా అంటే అప్లికేషన బదిలీ చెయ్యరు!'

'తప్పు. ఒకరిని తిట్టడ మెందుకు? కమలం పెండ్లి గూర్చి మీమనసు కష్టపెట్టుకోకండి. కమలం యెవరినీ పెండ్లాడదట.'

'రుక్మా! నీకూ మతిపోయిందా? మన యిాస్థితినిబట్టి కద్దనక యేమంటుంది!'

రుక్మిణి 'నిజమే' అన్నట్లు మౌనాన్ని సూచించింది. 'రాఘవయ్యగారి కూతురు పెండ్లికి అందరినీ పిలిచారటగా—మనలను తప్పించి!' అన్నాడు కిష్టయ్య. 'పోనీలెండి' అని సమాధాన మిచ్చిన రుక్మిణి వేపు చూస్తూ 'కమలం పెళ్ళి చెయ్యాలి, నేను నిద్రపోవాలి రుక్మా! మనకు డబ్బు అధికం ఖర్చు కాదు. పిల్లలకినీ పెండ్లి! పిలవ నవసరంలేకమా?' అన్నాడు.

అమరుసటిరోజు ఆఫీసరుచేత వడచీవాట్లు తిన్నాడు. ఆ ముందురోజు పోవలసిన ఆఫీసు కాగితాలు పంపలేకపోయాడు. ఇంట్లో పని చెయ్యాలని కొన్ని ఫైళ్లు తీసుకవెళ్ళేవాడు. కాని కమలాన్ని చూడడంతోనే దుఃఖం ముంచుకువచ్చి కాగితం ముట్టుకోలేకపోయేవాడు. ఆఫీసులో తోడిగుమాస్తాలు కొందరు ఆయనను వెలివేసిన ట్లుంచారు.

ఆరోజే కమలం పెండ్లిచూపులకు యెవరో వస్తా నన్నవారు రాలేదు. కిష్టయ్యగుండె కుంగిపోయింది. వూరంతా గోల—ఆపిల్ల గుణాలు మంచివి కావనీ, అదికాకుండా కిష్టయ్యని కులంనుంచి వెలివేస్తే ఆ పిల్లను యెవరు పెండ్లాడుతారనీ. పిల్లగుణాలు మంచివి కావని నలుగురూ అనుకుంటున్న మాటలు పరోక్షంగా విన్న కిష్టయ్య గుండె

బాధుకొని చిన్నపిల్లాడిమల్లే యేడ్చాడు. లోకంమీద వర్ణించలేని అసహ్యం పుట్టింది. సుగుణవతియైన తన చెల్లెలిని లోకం అలా చూస్తుందంటే ఆ పాడులోకంలో బ్రతికే బదులు చావాలనిపించింది కిష్టయ్యకు. 'యెవరో కిట్టనివాళ్లు ఆడే మాటలు తీసుకోకండి. మీ చెల్లెల్ని మిమ్మల్ని చూసి యేడుస్తోంది. పెండ్లి వసేమిరా వద్దంటోంది. పిల్లలుకూడా యేడుస్తున్నారు. కులం లేకపోతే పోయె. ధైర్యంగా ధర్మంగా మనం వుంటే చాలు...' అని రుక్మిణి యెన్నో విధాల ఓదార్చింది. ఆరాత్రికి భోజనం చెయ్యలేదు. పరుపుపైన పడుకొని ఆ రాత్రంతా కమలం పెండ్లివిషయమే పలవరించాడు.

తెల్లవారింది. 'ఆఫీసులో కట్టలుకట్టలు పడి వున్నాయి. యే బాబూ సహాయం చేద్దామని దయలేదు—వెళ్తా'నంటూ, స్నానం చేసి కాఫీ త్రాగాక ఆఫీసుకు పోవడానికి బయలుదేరాడు. 'పరశను క్యారియరుతో పంపిస్తా, పదిగంటలకి' అంది రుక్మిణి. 'హోటలులో భోంచేస్తాను. అమ్మాయి బడికి పోనీ' అంటూ గుమ్మం దాటాడు.

చీకటిపడింది. భర్త యింకా ఆఫీసునుంచి రానందున రుక్మిణి ఆందోళన చెందింది. ఆ వీధిలో నివున్న ఓ తాలూకాఫీసుగుమస్తాగారి యింటికి పరశను పంపింది. ఆఫీసు సాయంత్రం అయిదుగంటలకే విడిచిపెట్టినట్లు తెలుసుకొని మరీ ఆందోళనచెంది, భర్తకోసం వీధిగుమ్మందగ్గర చంటిపిల్లాడిని యెత్తుకొని నిరీక్షిస్తోంది. 'అమ్మా, నాన్న యింకా రాలేదేమే' అని యేకకంఠంతో రాముడూ, మోహనుడూ అడుగుతున్నారు.

రాత్రి యెనిమిదిగంటలకు వచ్చాడు. కిష్టయ్య. 'రుక్కూ! యెంతసేపటినుంచి అలా కాచుకు కూర్చున్నావ్?'

'చాలాసేపైంది. యీరోజు యింత ఆలస్యంగా వచ్చారేమండీ! పిల్లలు మీకోసం పలవరిస్తున్నారు'

'జగన్నాథస్వామికోవెలలో యెవరో వేదాంతం చెపుతున్నారు. యేమిటో విందామని ఒకాయన పిలిస్తే వెళ్లాను.'

'వేదాంతబోధ అప్పుడే మన కెందుకండీ!'

'అందులో తప్పేముందే? చాలా కమ్మగా వుంది.'

భోజనం చేస్తూ అన్నాడు—'రుక్కూ! యీ సంసారమంతా సంతలోని ఒక వ్యాపారంలాంటిదిసుమా! చూడు. యీ గ్లాసు యీ నీటితో అలా బైటపెట్టు. అందులో ఆకాశం కనిపిస్తుందా లేదా? నీరు పారవెయ్—యే మవుతుంది?'

'యేమిటండీ యీ వేదాంతం? మీకు పుణ్యం వుంటుంది. రేపటినుంచి వెళ్ళకండి.'

'రుక్కూ! తప్పేముందే? నిన్నంతటి దిగులు యీవేళ లేదు. చూశావా? నేను శాంతధైర్యంగా వుండి వుద్యోగం చెయ్యాలంటావా?'

రుక్మిణి భర్తకు జవాబివ్వలేదు. ఆరాత్రి స్వేచ్ఛగా నిద్రపోయాడు కిష్టయ్య. తెల్లవారింది. పరుపుమీద కూర్చుని కిటికీగుండా ఆకాశంవేపు చూస్తున్నాడు. 'యేమిటండీ అంత దీక్షగా చూస్తున్నారు?' అంది రుక్మిణి. 'కమలంపెండ్లి యెలా చెయ్యటమా అని. మనకు యే శుభకార్యాలకూ యెవరూ పిలవలేదు. కులంలోనుంచి వెలివేశామని చాటుతున్నారు ఊరూరా. మన వుసురు ఆ శాస్త్రిగారికి యెలా తగులుందో...' అంటూనే బొటబొట కన్నీరు కార్చేశాడు. ధైర్యాన్ని తెచ్చుకోమని రుక్మిణి యెన్నో మాటలు చెప్పింది. యీ దృశ్యాన్ని చూచిన కమలం వచ్చి 'అన్నయ్యా, నా పెండ్లివిషయమై నీవు విచారిస్తే నీ యింట్లో నేను వుండలేను'అంది. రుక్మిణి ఆశ్చర్యపడింది. కమలం అంత ధైర్యంగా నిలబడి యిదివర కెప్పుడూ అన్నయ్యతో మాట్లాడలేదు.

ఆరోజు ఆఫీసుకు పోతూ 'నేను రావటం ఆలస్యమౌతుంది. బెంగపెట్టుకోకండి' అంటూ రుక్కుతో చెప్పి పోయాడు. ఆరాత్రి వేదాంతబోధ విని వచ్చి భోజనం చేస్తూ, 'రుక్కూ! యెవరైనా చస్తే యేడవటమంత తెలివితక్కువ యింకేమీ లేదు. ప్రపంచంలో ఒక్కమనిషి చావకుండా ఒక్క నిముషం గడుస్తుందా? ఆ చావులన్నిటికీ యేడిస్తే మన కన్నీరు యెప్పటికీ ఆరదు. ఆత్మకు చావు లేదని తెలుసుకున్నవాడు చావుకు జడిస్తే, వాడేమతంవాడైనా యేంలాభం? మాసిన చింకి బట్టలను విడిచిపెట్టి కొత్తబట్టలు వేసుకోవటం మంచిదా కాదా?' అంటూ లేచి చెయ్యి కడుక్కున్నాడు.

నిద్రలో యీ వేదాంతమంతా మరిచిపోయాడు. నడిరాత్రప్పుడు తెలివి వచ్చింది. లేచి, 'రుక్కూ, రుక్కూ! నామనస్సు అదోలావుంది. వుద్యోగం వదిలేసి యే వూరైనా పోతే యీ పోరంటూ వుండదు. అక్కడ కమలానికి పెండ్లి చెయ్యొచ్చు' అన్నాడు. రుక్మిణి నిద్రపోతోంది. వీధితలుపులు తెరిచాడు. యిటూ అటూ చూశాడు వీధిలోకి వచ్చి. రోడ్డుమీద కొంతదూరం ముందుకు సాగాడు. మళ్ళా వెనుతిరిగి చూశాడు. తన భార్య, పిల్లలూ, కమలం యేడుస్తున్నట్లు కనిపించింది. 'నేనున్నాను. యెక్కడికీ వెళ్లిపోలేదు'. అని గొణుక్కుంటూ యింటికి పోయాడు. తలుపులోగడియ వేస్తున్నాడు. రుక్మిణికి తెలివివచ్చింది. 'యెక్కడికి వెళ్లారీ నిశిరాత్రప్పు'డంది. 'రుక్కూ! కమలం పెండ్లి చేస్తేగాని నేను మనిషిని కాను...' అన్న భర్తపలుకులు విని 'మీ రిలా అధైర్యం చెందితే మా గతేంగాను? మామయ్యగారిని తలుచుకోండి. ఆయన చూపిన త్రోవలో నడుచుకోకపోతే యెలా?' అని అంది.

'అవునుగాని, రుక్కూ! చుట్టాలక్రింద యేమాత్రం దబ్బయింది...?'

'యేమాత్రమైతే యేం లెండి? యింక చుట్టాలు మన యింటికి రమ్మన్నా వస్తారా?'

'రుక్కూ! యీజీవితం అంతా ఒక కల. కల చూసి మురిసిపోతా మెందుకో' అన్న భర్తమాట విని రుక్మిణి గజగజ వణికిపోయింది. భర్తమార్పుకు విచారించింది. 'రోజంతా పనిచేశావ్. పడుకో రుక్కూ!' అంటూ పరుపుపై వాలిపోయాడు. రుక్మిణి కండ్లు మూసి దేవుని ప్రార్థించుకొంది. మామగారిని తలుచుకొంది.

వేదాంతోపన్యాసం వినటానికి వెళ్ళటం రుక్మిణి యెంత ప్రతిమాలినా కిష్టయ్య మానలేదు. రానురానూ వుద్యోగంమీద శ్రద్ధ కూడా పోయింది. ఒక నెలరోజులు ఆఫీసుకు సెలవుపెట్టాడు. ఒక్కొక్కసారి యింట్లోచుట్టంలా మెసిలేవాడు.

ఆనాడు ఆదివారం. తనతో సరిగ్గా మధ్యాహ్నం పన్నెండుగంటలకు యిద్దరు సాధులను తెచ్చి 'రుక్కూ, వీరికి అన్నం పెట్టు'అన్నాడు. రుక్మిణి వారికి అన్నం పెట్టింది. వారు భోజనం చేస్తున్నారు. రుక్మిణివైపు చూసి నవ్వుతూ కిష్టయ్య అన్నాడు—'రుక్కూ! నాన్న ఒకసారి నీతో ఏమన్నారు? జ్ఞాపకముందా? నేను వీధి అరుగుమీద నుంచొని విన్నానులే...,

'ఏమన్నారండీ?'

'అమ్మా, కిష్టయ్య సన్యాసిలాంటివాడే. సంసారంగొడవే అవసరం లేదు. నా వూపిరి కాస్తా పోతే యీ చుట్టాలతో మరి పడలేదు. అన్నిటికీ స్వార్థమైన యిల్లాలివి నువ్వు వున్నావులే అమ్మా!—ఆ మాటలు జ్ఞాపకం లేదూ రుక్కూ?'

'ఉన్నాయిలెండి. మీరు భోజనానికి లేవండి' అంటూ రుక్మిణి అక్కడినుంచి లేచిపోయింది.

కిష్టయ్య రోజూ యెవరో సాధువులను భోజనానికి తెచ్చేవాడు. రుక్మిణమ్మ కాదనలేకపోయేది. ఆమెను బంధుజనాదరణ, అతిథి సత్కారాల్లో అందెవేసిన చేయిగా తయారుచేశాడు రామయ్య.

ఒకరోజు తెల్లారఝామున లేచాడు. 'రుక్కూ! ఒక పనిమీద అనకాపల్లి వెళ్లాలి...' అంటూ బట్ట వేసుకున్నాడు. అనుకోకుండా భర్త యీ ప్రయాణానికి అంతట్లోనే సిద్ధపడటం ఆమెను కలవరపరచి 'నేనూ మీతో వస్తా'నంది. 'యెందుకు? సాయంత్రానికి వచ్చేస్తా'నని బయలుదేరాడు. రుక్మిణమ్మ అరుగుమీద నిలబడి చూస్తూ అప్రయత్నంగా కన్నీటిబొట్లు రాల్చింది.

ఒక్క అరగంటలో కిష్టయ్య మరల తిరిగివచ్చాడు. 'యేం? అప్పుడే వచ్చేశారు?' అంది రుక్మిణి. 'నేను వుండటం నీకిష్టం లేదా?' అని భార్యవేపు చూస్తూ కిష్టయ్య అంటుంటే ఆమె దిగ్భ్రాంతి చెందింది. అలాంటి కఠోరమైన మాటలు వినటం అదే మొదటిసారి.

పడుకున్న మోహనణ్ని లేపి ముద్దులాడాడు. చంటిపిల్లాడితో కాస్సేపు ఆడుకున్నాడు. సరళా, రామంలకు కొంతసేపు చదువు చెప్పాడు. కమలంవేపు తదేకదీక్షతో కొన్ని నిముషాలు చూచాడు. కండ్లెంబడి కన్నీటిబిందువులు రాలాయి. గబగబా తుడుచుకున్నాడు. వారంరోజులుగా కమలాన్ని మంచినీరు అడగటమే మానివేశాడు. కమలం అన్నయ్యమార్పుకు దుఃఖించింది.

ఆ మూడవరోజున బజారునుంచి కాషాయవస్త్రాలు తీసుకవచ్చాడు. 'యివి మనకెందుకండీ!' అన్న రుక్మిణితో 'కాషాయవస్త్రాలు పవిత్రమైనవి. మనయింట్లో ఒకమూల వుంటే అవ్వా?' అన్నాడు.

ఈ సంఘటన జరిగిన పదిరోజులవరకు కిష్టయ్య రోజూకు అధమం పలుగురు బైరాగులను భోజనానికి తీసుకవచ్చేవాడు. గృహలక్ష్మి రుక్మిణి భర్తకు సంసారభారం తగలకుండా చూసేది. సిగ్గువిడిచి వీథిలోకి వెళ్ళి అన్ని వస్తువులూ ఆమె తెచ్చుకొనేది. కిష్టయ్యకు మొదటి రోజులలో కాస్త కష్టమనిపించినా, తరువాత తన అశక్తిని తెలుసుకొని వూరుకున్నాడు. వూర్లో కొందరాడంగులీ విషయమై గొణుక్కోకపోలేదు.

## 3

ఆరోజు మంగళవారం. కోడి కూసింది. చంటిపిల్లాడు కావుమని యేడుస్తున్నాడు. గాఢనిద్రచెందిన రుక్మిణికి తెలివి వచ్చింది. పరుపుమీద కిష్టయ్య లేడు. కేకలు వేసి పిలిచింది. సమాధానం లేదు. ట్రాంకులో కాషాయవస్త్రాలు లేవు. స్టేషనువేపు పరుగెత్తింది. రైలు అప్పుడే వెళ్ళిపోయింది. వదిన వెఱ్ఱిదానిలా పరుగెత్తిపోవడం చూచి కమలం నిర్ఘాంతపోయింది. చంటిపిల్లాడిని యెత్తుకొని కన్నీటితో ఓదారుస్తోంది.

తెల్లవారింది. రుక్మిణి యింట్లో కాలుపెట్టింది. వరదలై పారుతున్న కమలం కన్నీటిని చూచింది. 'అమ్మా, కమలం' అంటూ కమలాన్ని పట్టుకొని యేడ్చింది. నిద్రపోతున్న పిల్లలనందరినీ లేపి తనచుట్టూ కూర్చొబెట్టుకొని యేడ్చింది. వదిన యేడుపుతో కమలంయేడుపు మరీ హెచ్చయింది. యిరుగుపొరుగువారంతా వచ్చారు, యేమైంది—యేమయిందని. యేమని యెవరు చెప్తారు? శాస్త్రులుగారు ఆ త్రోవను పోతూ దయచేశారు. 'అయ్యిందీ? అనుకున్నంత పనీ అయ్యిందీ! శాస్త్రాలకు వ్యతిరిక్తంగా నడిస్తే సంసారి సన్యాసి కాక యేమౌతాడు? నేనెంత నుండె బాదుకొని చెప్పాను! నా మాటలు విన్నావా రుక్మిణీ...!' అంటూ గబగబా నిష్క్రమించారు. యీ పలుకులు ఆమె హృదయంలో ములుకుల్లా నాటాయి.

'అమ్మా! కిష్టయ్య వుత్త అమాయకుడు. సంసారం చెయ్యలేడు. అన్నిటికీ నువ్వే వున్నావు. సత్యం, శాంతి, సహనాలతో మెలగి ధర్మంగా నువ్వు నీ విధిని నిర్వర్తించావంటే యే కష్టాలైనా సుఖంక్రిందే భావిస్తావు. భగవంతుడొకడున్నాడనీ, ధర్మమే ఆయన స్వరూపమనీ గుర్తించు తల్లీ. కష్టం, సుఖం రెండూ అనుభవించందే యెవరి జీవితమూ పరిపూర్ణం కాదు. నిస్పృహను విడిచి పెట్టి నీ ఆత్మయందు విశ్వాసం వుంచి నిష్కల్మషమైన మనస్సుతో నీ కార్యాన్ని నెరవేర్చు. జయం పొందుతావమ్మా...'—చనిపోయే ముందు మామగారన్న యీ పలుకులు ఆమె చెవులలో మారుమోగాయి.

పిల్లలవేపూ, కమలంవేపూ ఒకసారి చూసింది. వారి రోదన ఆమె హృదయాన్ని కలవరపరచింది. నిలబడి చీరెకొంగుతో కన్నీటిని తుడుచుకొని కమలంవద్దకు వెళ్ళి అంది—'కమలం! నువ్విలా అధైర్యంగా యేడ్చుకొంటూ కూర్చోవద్దు. నా ఆశలన్నీ నీమీదే పెట్టుకున్నా. నీ మూలంగా మీ అన్నయ్య సన్యాసుల్లో కలిసిపోలేదు. కర్మఫలితాన్ని ఆయన అనుభవించక తప్పలేదు!' కమలం యేడ్చుకుంటూ వదినపాదాలపై పడిపోయింది. కమలాన్ని లేవదీసి—'అమ్మా! నువ్వు ధైర్యముగా వుంటేనే యీ పిల్లల బ్రతుకూ, నా బ్రతుకూను. కానున్నది కాక మానదు. ధైర్యంగా, ధర్మంగా పోతే యెప్పటికైనా మీ అన్నయ్య మనలను కలుసుకుంటారు. మామయ్యగారు చనిపోతూ నాతో అన్న సుభాషితాలను జ్ఞాపకానికి తెచ్చుకో అమ్మా. మనకు చంచలలక్ష్మికంటె శాశ్వత ధర్మమార్గాన్ని చూపించి మీ నాన్న చనిపోయారు. అదే మనకు పదివేలు.' వదిన మాటలు విన్న కమలం ఆమెవేపు చూచింది. ఆమెచూపుల్లో ధైర్యం గోచరించింది. యేడుస్తున్న మోహనుని తీసుకొని ఓదార్చింది.

పరామర్శకు వచ్చేవాళ్ళు వస్తున్నారు; కాని అభిమానంచేత కాదు. యెత్తిపొడుద్దామని. నిర్మొహమాటంగానే, యెదురుగా అనవలసిన కట్టిమాటలు అనేశారు. వేయవలసిన నిష్ఠూరాలు వేశారు. వదినను పైవారు దూషిస్తుంటే కమలానికి కష్టమనిపించింది. 'శాంతం భూషణం! తొందరపడి యెదురుమాట చెప్పకమ్మా' అని కమలాన్ని ఓదార్చింది రుక్మిణి.

'మొగుడు బైరాగుల్లో కలిసిపోతే యేడ్చిచావవలసిందే; అలాంటిది యేమిటమ్మా ఆ ధీమా ఆ రుక్మిణికి! దీని పోరూ, గతిలేక స్వర్గానికి పోలేక కాకికడుపులో వున్న రామయ్యశాపమూ మొత్తంమీద, శాంతమూర్తి కిష్టయ్యని బైరాగుల్లో కలిపేసింది. దానిమాట వినే జగన్నాథంలో శ్రాద్ధం చేశాడు' అని యెవరికి తోచినట్లు వారు మాటాడేవారు.

చీకటి పడింది. మధ్యాహ్నమనగా యిల్లు విడిచిన రుక్మిణి 'యిల్లు నోరికిందమ్మా కమలం' అంటూ యింట్లోకి వచ్చింది.

'యే వీధిలో వదినా?'

'పేదవారికి హృదయం వుందమ్మా. వారి గుడిసెలమధ్య మన గుడిసె; వారిలో ఒకరం మనం.'

'ఆ యింట్లోకి యెప్పుడు పోవాలి వదినా?'

'రేపే. నీకు చాలా శ్రమ యిస్తున్నానమ్మా. నువ్వు శ్రమ అనుకోవు. యీ పిల్లలిని రక్షించే పూచీ నీకే వదిలిపెట్టున్నా.'

'.....................'

'అలా తల దించావేమమ్మా? నేను సన్యాసినినై పోతాననా? నా గుండెను మామయ్యగారు తమ బోధనలతో శాస్త్ర దిట్టంగా తయారుచేశారు. నాచేతనైన పని మీఅందరికీ వండి పెట్టడం. నువ్వు ప్రయివేట్లు చెప్పి డబ్బు తేవాలమ్మా'

'ప్రయివేట్లు సంపాదించట మెలా వదినా? వీళ్ళంతా అడ్డుపెడ్తారేమో?'

'పేదలకు హృదయముందని చెప్పలేదా? పదిమంది పిల్లలు మనయింటికే ప్రయివేటుకు వస్తారు. వారికి ప్రయివేటు చెప్తే నెల కో పదిరూపాయలు వస్తాయి. ఆ ప్రక్క వీధిలో నలుగురు నాయుళ్ళ అమ్మాయిలకు సంగీతం చెప్తే వారు నెల కో పదిరూపాయలు యిస్తారు. ఆ యిరవైరూపాయలతో యెలాగో సంసారాన్ని గడపగల మనే నా ధైర్యం.'

మర్నాడు సామానులన్నీ క్రొత్త యింట్లోకి నడిపారు. అక్కడే బాగుంది వారి జీవితం. వారిమధ్య గౌరవంగా బతుకుతున్నారు. పిల్లలు బడికి వెళ్ళివస్తున్నారు. కమలం ప్రయివేటులు జాగ్రత్తగా చెప్తోంది. రుక్మిణి తీరుబడి వున్నప్పుడల్లా యిరుగుపొరుగుపిల్లల బట్టలు, స్త్రీల జాకెట్లూ చేతికుట్టుతో కుట్టేది. కమలం వీధిలోకి వెళ్ళకలసిన మనిషిని దగ్గర వున్న డబ్బులో పాతికరూపాయ లిచ్చి మొదటే చీరలూ, జాకెట్లూ కొంది.

౪

అయిదు నెలలు గడిచాయి. రుక్మిణి అప్పుడప్పుడూ భర్తను తలచుకొని యేడ్చేది. కాని పిల్లలూ, కమలం యెక్కడ అధైర్య పడతారో అని ఆ దుఃఖాన్ని వేగంగా అణుకొనేది. దేవుని నమ్మింది. ఆయనను పూజించేది. కమలం తన శాయశక్తులా కష్టపడుతోంది. ఆమె శాంతస్వభావం, ఆమె తియ్యని పలుకులు, ఆమె అందం యెదుటివారి హృదయాలను ఆకర్షించేవి. రోజుకు అధమం పదిగంటలైనా ప్రయివేట్లు చెప్పటంతో గడుస్తోంది. కమలం నలుగురుపిల్లలనూ తన ప్రాణంకంటే హెచ్చుగా చూసుకొంటోంది. ఆ నలుగురు పిల్లలతోనే ఆమె ఆనందం. వారిలోనే తన జీవితమని మురిసిపోతుంది.

అన్నయ్యకోసం విచారించక పోలేదు. కాని వదిన యెక్కడ విచారిస్తుందో అని ఆమెయెదురుగా యెప్పుడూ దుఃఖించలేదు. అప్పుడప్పుడూ వదినయెదురుగా ధైర్యమైన మాటలు చెప్తుండేది. కమలం నెలనెలా తెస్తున్న నలభైరూపాయలలో వారికి నెలకు పదిరూపాయలవరకు మిగిలేది. నాన్న కోసం వెంబట రెండు మూడు నెలలవరకు పిల్లలు పలవరించారు. కమలం, రుక్మిణీ వారలను ఆటలలోను, పాటలలోను, చదువు లోను పెట్టి రానురానూ తండ్రిని మరపింప జేశారు.

ఆరోజు సంగీతం చెప్పడానికి వెళ్ళిన కమలం వేగంగా వచ్చేసి యింట్లో ఒక మూల కూర్చొని ఒక పుస్తకం చాటుపెట్టు కొని కన్నీరు కారుస్తోంది. రుక్మిణి పెట్టె లోని బట్టలు తీయడానికి వచ్చి యీ దృశ్యాన్ని చూచి కమలాన్ని చేరదీసి అంది: 'యేమమ్మా కమలం... అలా?'

'యేమీ లేదు వదినా' అని వేగంగా కన్నీరు తుడుచుకుంది.

'చెప్పు తల్లీ! నాదగ్గర......'

'వాళ్ళంతా యిప్పటికీ మనలను బ్రతక నిచ్చేటట్లు లేదు.'

'యేమైంది? యెవ రేమన్నారు?'

'యిన్నాళ్ళూ యెవ రేమన్నా పూరు కొనేదాన్ని. యీరోజు శాస్త్రుల్లుగారు రోడ్డుమీద నిలబెట్టి నీ వెవరితోనో తిరుగుతున్నావని నోటికొచ్చినట్లు కూస్తే అందరూ మూగి నన్నొక వింతమనిషిలా చూశారు'

'అయ్యో! నా పిచ్చితల్లీ, అందుకేనా? యే కర్రలో అగ్ని వుంటే అదే కాలుతుంది. నీ ధర్మాన్ని నువ్వు నిర్వర్తిస్తున్నావు. లోకం యెలా అనుకుంటే నీకేం?'

ఇంతలో పిల్లలు బడినుంచి వచ్చారు. సరళ అంది—'అమ్మా! మన పాతయింటికి నిన్న రాత్రి యెవరో బైరాగి వచ్చి వెళ్ళి పోయాడట. రమణమ్మ చెప్పింది బడిలో...'

'హాఁ! వచ్చి వెళ్ళి పోయాడా అమ్మా?'

'వదినా! అన్నయ్య వచ్చి వుంటారేమో? నే వెళ్ళి ఆ పొరుగువారిని కనుక్కుంటాను...యేమైనా చెప్తారేమో?'

రుక్మిణి నిట్టూర్పు విడిచింది. 'వెళ్ళకు వదినా' అంటూ కమల లేచింది. 'వద్దమ్మా వద్దు. మనం వెళ్ళినా లాభం లేదు. ఆయనను కలుసుకున్నా యింటికి రారు. ఆ వచ్చే రోజులు దగ్గరపడలేదు' వదినమాటలు విన్నాక కమలం ఆశ్చర్యంతో 'వదినా, యేం! యెందుకని రారు? నేను అన్నయ్యకాళ్ళమీద పడ్తాను' అంది.

'అమ్మా! నామనసులో వున్నది చెప్తున్నా. నీకు పెండ్లి చేశానని నీభర్తను ఆయనకు చూపిస్తేగాని ఆయన రారు!'

'కులంనుంచి వెలివేశారుగా—' అని అప్రయత్నంగా కమలం అంది.

'పోనీయమ్మా, కులంతో యేముంది? గుణం ప్రధానంగాని'

వదినమాటలు విన్న కమలం తల దించి కాలివ్రేళ్ళ వేపు చూస్తూ దీర్ఘంగా యేదో ఆలోచిస్తోంది. పిల్లలు ఆమెను పిలిచారు చదువు చెప్పమని. 'మధ్యాహ్నంకూడా చదువేనా? భోజనం చేసి చదువుకుందురు గాని' అని రుక్మిణి పిల్లలను భోజనానికి కూర్చోబెట్టింది.

మరో నాలుగు నెలలు సాగిపోయాయి. రుక్మిణి కమలచేత పూజాపురస్కారాలు చెయ్యిస్తూనేవుంది. కమలంపెండ్లి యెలా చెయ్యాలటమా అనే సమస్య ఆమెను కలవరపరచకపోలేదు. దేనికైనా కాలం రావాలనీ, కానున్నది కాకమానదనీ, భగవంతుని నమ్మిన వారికి నాశనం లేదనీ తలచుకొని సంతృప్తి పడేది. ఆ వూర్లోనే వుంటే యెప్పటికైనా భర్తను కలుసుకోటానికి అవకాశం వుంటుందని విశ్వసించింది. లోకంగోలకు ఆయన మనసెలా లొంగిపోయిందో అలాగే పిల్లలను చూడాలనే కోరికకు లొంగిపోతుందని నమ్మింది. ఆ విశ్వాసమే ఆమెను ఆ వూర్లో వుండనిచ్చింది.

ఆరోజు మోహనుడు జ్వరంతో బాధ పడుతున్నాడు. రుక్మిణి బజారుకు పోయింది.

పరశా, రామం బడికి పోయారు. కమలం ఒక్కర్తే యింట్లో వుంది. యెవరో బైరాగులు ముష్టికి వచ్చారు పాడుకుంటూ. కమలం బియ్యం ముష్టి వేస్తూ 'బాబూ, మీ గుంపులో కిష్టయ్య అనే పేరుతో యెవరైనా వున్నారా?' అని అడిగింది.

'తెలీదమ్మా. మీవాళ్లెవరైనా బైరాగుల్లో కలిసిపోయారా?'

'అవును బాబూ. మీకు ఆయనగురించి తెలుసునేమో అని.'

'సాధారణంగా బైరాగులయ్యాక పేర్లు మార్చుకుంటాం. అనకాపల్లిలో మా గురువుగారి పీఠం వుంది. దేశదేశాలూ తిరిగి సంవత్సరానికి ఒకసారి అక్కడ కలుసుకుంటాం. మనిషి యెలా వుంటాడు?'

'మనిషి మీకంటే పొడుగ్గా, చామనచాయగా వుంటారు. యెడమకాలి మోకాలు మీద పెద్ద మచ్చ వుంటుంది. సైకిలుమీది నుంచి పడిపోతే మోకాలి మీద పెద్ద దెబ్బ తగిలి పుండయింది. మానటానికి నాలుగు నెలలు పట్టింది. అప్పటినుంచి సైకిలు త్రొక్కటమే మానివేశారు.'

'యేమో అమ్మా. యెవరో చెప్పలేం' అని సెలవు తీసుకొని వెళ్ళిపోయారు.

మోహనుడు మంచినీరు కావాలని గోల పెడుతున్నాడు. పొరుగింటి మామ్మ వచ్చి 'ఆ సింహాద్రి అప్పన్నను తలచుకొని, పిల్లాడి జబ్బ నయమైతే ఆయనదగ్గర కొప్పు తీయిస్తామని మొక్కుకోండమ్మా' అని చెప్పింది. కమలం మామ్మమాటలు విని మనసులో అలా నమస్కరించుకుంది. మామ్మ కాస్సేపు కూర్చొని వెళ్లిపోయింది.

ప్రొద్దున్న అనగా వెళ్ళిన రుక్మిణి పది గంటలైనా యింకా రాలేదు. మోహనుడు 'అమ్మా, అమ్మా' అని అరుస్తున్నాడు. కమలం ఓదారుస్తోంది. రుక్మిణి చిరునగవుతో యింట్లో ప్రవేశించింది. కమలం రుక్మిణిచిరునగవును చూడటం ఆ యింట్లోకి వచ్చాక అదే మొదటిసారి.

'వదినా! మోహన్ నీకోసం పలవరిస్తున్నాడు. ఇంత ఆలస్యం...'

'నీవల్లేనమ్మా. నీ శాంతగుణం యెదుటి వారి హృదయాలను లోబరచుకోక యేం చేస్తుంది! మామయ్యగారి పేరు నిలబెట్టావు. వచ్చేనెలలో పెళ్ళిముహూర్తంకూడా స్థిరమైంది.'

కమలం మాట్లాడకుండా రుక్మిణివేపు ఆశ్చర్యంగా చూస్తోంది.

'యేం కమలం? అలా చూస్తావేం? నీవు యెంచుకున్న వరుడే—మధుసూదనరావు.'

కమలం తల దించింది సిగ్గుతో. మధుసూదనరావు మునసబుకోర్టులో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. పుట్టకచేత కమలంకులం, కమలంతెగే. మధుతల్లి చదువుకుంది. ఆయన తండ్రి విధవావివాహం చేసుకున్నాడని పాతికసంవత్సరాలక్రితం కులంనుంచి వెలివేశారు. కమలం మధు చెల్లెలకు ఆరునెలల క్రితంనుంచి సంగీతం నేర్పుతోంది. అతనామెను ప్రేమించానన్నాడు. ఆమె నిరాకరించింది. ఆమె శాంతగుణం, అందం రానురానూ ఆయనను పిచ్చెత్తించింది. రుక్మిణి ఒకనాడు కమలంతో 'కులంతో యేముంది? గుణం ప్రధానం' అని అన్న తరువాత ఆమె ప్రేమకై పరితపించే మధుతో యిలా అంది—'నాలో ప్రేమ ఉంది. కాని నేను ప్రస్తుతం మిమ్మల్ని ప్రేమించలేను. మీతల్లిదండ్రులు సంతోషంగా ఒప్పుకొని, యిరువురికీ పెండ్లి చేస్తే అప్పుడే నేను మిమ్మల్ని ప్రేమించగలను. నావదినా, పిల్లలూ వున్నారు. వారిని పోషించే బాధ్యత నాది. అందుచేత ఒకవేళ పెండ్లి అయినా నన్నిలా ప్రయివేట్లు చెప్పుకోనివ్వడానికి మీరు అంగీకరించాలి. అప్పుడే మిమ్మల్ని నేను ప్రేమించగలను'.

తలిదండ్రులతో యీ విషయం చెప్పడానికి మధు మొదట సంకోచించాడు. ఎలాగైతేనేమి చివరకు తల్లికి అన్ని విషయాలూ పూసగ్రుచ్చినట్లు చెప్పి 'కమలం పెండ్లికి యెలాగైనా ఒప్పుకుంటేగాని వీలులే'దన్నాడు. అమ్మ ఒప్పుకుంటే నాన్న తప్పక ఒప్పుకుంటాడని ఆయనకు విశ్వాసం వుంది. మధుతల్లి కమలంలాంటి గుణవతి తన కోడలు కాబోతుందని మురిసిపోయింది కూడాను.

రుక్మిణియింటికి వస్తున్న మధుతల్లి ఆమెను త్రోవలో కలుసుకొని ఆమెను యింటికి తీసుకపోయి పెండ్లివిషయాలు చర్చించటంచేత ఆలస్యమైంది. మోహన్ జ్వరం ఒక పదిహేను రోజులలో నయమైంది. అరసవిల్లిలో దేవుని సాన్నిధ్యంలో కమలా, మధులకు వివాహం జరిగింది. కులంలో వెలివేయబడిన రెండు సాంప్రదాయిక కుటుంబాలు యీ వివాహంవలన కలపబడ్డాయి. రుక్మిణి ఆయింటిని విడిచిపెట్టలేదు. కమలం అత్తవారి యింట్లోవున్నా రోజుకు రెండుసార్లు రుక్మిణిదగ్గరకు వస్తుంది. ప్రయివేట్లు మామూలుగానే చెప్తోంది.

※

ఒకనాడు కొందరు సాధులు 'భిక్షాం దేహి' అంటూ కమలం యింటికి వచ్చారు. వారిని చూడగానే కమలానికి సింహాచలం మొక్కు జ్ఞాపకం వచ్చింది. రుక్మిణితో ఆ విషయం చెప్పి, ఆ వచ్చే శనివారంనాడు రుక్మిణి, కమలం, మధు, పిల్లలూ బయలుదేరారు. కొండ యెక్కుతున్నారు.

ఒక బైరాగి సంసారసాగరంలోని పోటుపోటులను భరించలేక సన్యాసి అయ్యాడు. సంఘంలో మెసలలేక, సంఘనిందలను భరించలేక, యేడ్చి, విరక్తిచెంది, భార్యాబిడ్డలను విడువలేకవిడువలేక చివరకు కష్టంతో యింటినుంచి కదిలాడు. బైరాగి అయ్యాక తన పిల్లలు కనిపిస్తారేమో, నాన్నా నాన్నా అని తన్ను పిలుస్తారేమో అన్న ఆశతో చాలాసార్లు చీకటిలో ఆ యింటిచుట్టూ తిరిగాడు. తాను బైరాగులలో కలిసిపోయాడు. చెల్లెలి పెండ్లి చేయలేకా, సంఘంలో బ్రతకలేకాను. కలిసిపోయాక తనవారంతా జ్ఞాపకానికి వచ్చారు. యేడ్చాడు. తన్ను వేదాంతులూ, బైరాగులూ పాడుచేశారని వారిని తెగ తిట్టాడు. తనవారిని కలుసుకుందామని వుబలాటపడ్డాడు. మరల ఆ సంసారంలో ఆ సంఘంలో తలెత్తి యెలా బ్రతకటం? మరల కుటుంబాన్ని యెలా పోషించటం? కులంనుంచి వెలివేయబడిన తను తన సోదరికి యెలా పెండ్లిచేయటం? దొంగతనం చేసి డబ్బు సంపాదించి తన కుటుంబాన్ని కలుసుకుంటాను, తన పిల్లలకు ముద్దులాడుతాను, తన చెల్లెలి పెండ్లి చేస్తాను అనుకొన్నాడు. కాని దొంగతనానికి ఆయనమనసు ఒప్పుకోలేదు. ఒకవేళ దొంగతనం చేసినా, డబ్బు కూడగట్టుకున్నా కమలాన్ని యే బ్రాహ్మణయువకుడు పెండ్లాడుతాడు అనే యీ నిస్పృహ ఆయనను విరాగిగా ఉంచింది. ఆయన దేవుని ప్రార్థించలేదు. తీర్థయాత్రలు సేవించలేదు. ఆజిల్లాలోనే వివిధప్రాంతాలు తిరిగాడు ఆవేదనతో. తనపిల్లలను యే ముఖంతో చూడగలనని దుఃఖించాడు. ఆశ మొలకెత్తితే ఆయన విరాగి కాడు, సంసారి కావాలని ఆయనహృదయకుహరంలో కోరిక తొందరచేస్తోంది.

తనను వారు చూశారో, లేదో కాని వారిని ఆయన చూసి తల దించాడు. కాషాయ వస్త్రం కప్పుకున్నాడు. తనను దాటుకొని వారు పైకి పోతున్నారు. అదిగో, మొదటి ధార దాటిపోయారు. తలెత్తాడు. తన కండ్లతో తన చెల్లి, ఆ చెల్లి ప్రక్కనే నడుస్తున్న ఒక యువకుడూ ఒకరివేపు ఒకరు చూసి నవ్వుకోవటం చూశాడు. అవును. ఆ నవ్వులో వలపు వుట్టిపడుతోంది. నా చెల్లెలికి పెళ్లయిందా ? సందేహం లేదు. నా చెల్లెలి భర్త. అదిగో నా రుక్కు—నా అర్ధాంగి—నుదుట కుంకుమరేఖ తళతళ మెరుస్తోంది. 'రుక్కూ ! నీవు దేవతవే!' అదిగో నా మోహనుడు. వాడిని యీ హస్తాలతో యెత్తుకొని ఒక్క క్షణం విడిచిపెట్టేవాడిని కానే. నా కూతురు సరళ—నా కొడుకు రామం. నా చిన్నారి చిట్టిబాబు ఆనందుడు. వారంతా నావారు. నా పిల్లలు నన్ను 'నాన్నా' అని పిలవరే! నా చెల్లి నన్ను అన్నయ్యా అని పిలవదే ? నా రుక్కు నవ్వుతూ...... నా కెందుకీ సన్యాసం ? పిలుస్తాను. నా పిల్లలను యెత్తుకొని ముద్దులాడతాను. ఇదిగో నా పెదిమలు తొందర పడుతున్నాయి. నా కంఠంలో మాటలు దొర్లుకుపోతున్నాయి. నా కళ్ల వెంబడి ఆనంద బాష్పాలు రాలిపోతున్నాయి. పిలుస్తాను. ...అయ్యో! చాలా దూరం వెళ్ళిపోయారు.

నేను పిచ్చివాణ్ణి. యీ సంసారం అంతా ఒక బొంతకుట్టు. దారం తెగిపోతుంటే రుక్కు క్రొత్త దారంతో ధైర్యంగా కుట్టోంది. నా రుక్కు మోములో పూర్వపు కళాకాంతులు లేవే ? ఔను, యెలా వుంటాయి ? నాలాంటి భర్తను కట్టుకొని గొప్పగా సుఖించింది!'

లేచాడు. రెండు అడుగులు ముందుకు వేశాడు; మరల వెనుకకు. 'నాకు గుండె వుంది. అందుచేత డబ్ డబ్ మని కొట్టుకొంటోంది! ఆరాటమే కాని కార్యశూరత్వం లేదు. రుక్మిణి యెంత శాంతంగా...యెంత ధైర్యంగా...అవును. శాంతం, సహనం, ప్రేమలతో యెంతటి క్లిష్టకార్యాన్నైనా పరిష్కరించవచ్చు. మన బాపూజీ చెప్పింది యిదే—నాన్న చెప్పిందీ యిదే! భిన్న మార్గాన్ని త్రొక్కి నేను నా భార్యాబిడ్డలకు దూరమయ్యాను. నా రుక్కు ఆ మార్గాన్ని త్రొక్కి జయం పొందింది. ఆమె దేవతా స్వరూపిణి. ఆమెను పూజించాలి.'

కూర్చున్నాడు. తన తెలివితక్కువకు యేడ్చుకున్నాడు. తన భార్యతో 'నేను నీ భర్త'నని యే ముఖంతో చెప్పగలుగుతాడు ? తన పిల్లలు తన వేషాన్ని చూసి తనదరి చేరుతారా! తన చెల్లి తన్ను క్షమిస్తుందా ? పశ్చాత్తాపంతో క్రుంగిపోయాడు.

యెండ చల్లారింది. తన కొడుకు మోహన్ మారిపోయాడు. జుత్తు దేవునికి అప్పగించాడు. మెట్లు దిగుతున్నారు—తన పిల్లలూ, తన భార్యా, తన చెల్లీ, చెల్లిభర్తా. పిల్లలను యెంత శుభ్రంగా వుంచింది! తను వస్త్రాన్ని కప్పుకొని తల దించాడు.

అదిగో తన భార్యపాదాలు. పాదాలపై పడి మొక్కరాదా మనుకున్నాడు. భిక్షు—చేరెడు బియ్యం తన యెదుట పోస్తోంది. జలజల బియ్యం ఆమె చేతిలోనుంచి రాలుతుంటే ఆయనకళ్ల వెంబడి కన్నీరు బొలబొలా కారుతోంది. సిగ్గు, పశ్చాత్తాపం, ఆవేదనా ఆయనను నమిలి మ్రింగి వేస్తున్నాయి.

పాదాలు మాయమైపోయాయి. తలెత్తాడు. యింకా తన చెల్లి వెనుకనే వుంది. ఆ యువకుడు ఆమెను పిలుస్తున్నాడు. 'అమ్మా! కమలం!' గట్టిగా పిలిచాననుకున్నాడు. కాని ఆ మాటలు ఆయన గుండెలలోనే ప్రతిధ్వనించాయి. వెనుకబడిన కమలం తన యెదురుగానే వుంది. యెవరో తన్ను పిలిచారని చుట్టూ చూసింది. వెక్కి వెక్కి తల దించి యేడుస్తున్న వైరాగిని చూసింది.

'యేం బాబూ! యీ పవిత్రస్థలంలో యేడుస్తున్నారు ?'

'....................'

'తలదించి యేడవకండి. తప్పు. తమ పేరు?'

ఆయన మాట్లాడలేదు. గాలి వీచింది. కప్పుకున్న కాషాయవస్త్రం యెగిరింది. 'యీ శరీరచ్ఛాయ—యీ యేడుపు—అదిగో మెడమీది మచ్చ—యెవరు ? అన్నయ్యా! సంశయం లేదు. అన్నయ్యను బసకు తీసుకుపోయి ఆయనకాళ్లమీద పడాలి. యిక్కడ గోల చేస్తే లాభం లేదు...' కమలం మనసులో ఆలోచనలు పరుగెత్తాయి.

'బాబూ ! ఒక్కసారి మావూరు దయ చేయండి. మీ పాదపూజ చేసుకుంటాం...'

'....................'

'రండి బాబూ, రండి...యేడవకండి. దేవుని నమ్మినవారికి నాశనం లేదు.' అంటూ కమలం తనయెదురుగా నున్న భిక్షకై పరచిన వస్త్రాన్ని చుట్టి ఆయనచేయి పట్టుకొని లేవనెత్తింది. తనవేపు తిరిగి వస్తున్న మధు వింతగా చూస్తున్నాడు. వూరుకోమని రుక్మిణికి, మధుకూ సైగచేసింది. రెండు నిమిషాలలో మెట్లు దిగారు. ఆయన తల దించే వున్నాడు. గజగజ వణికిపోతున్నాడు.

వారు సామానులుంచిన ధర్మసత్రపు గది చేరుకున్నారు. ఆయన మాట్లాడలేదు. తల దించేవున్నాడు. గాఢమైన నిట్టూర్పులు విడుస్తున్నాడు.

'యీవిడ మా వదిన. యీయన నా భర్త. యీ పిల్లలు మా అన్నయ్య బిడ్డలు. మా అన్నయ్య నా పెండ్లికై పరితపించి వైరాగులలో కలిసిపోయారు. నాకిప్పుడు పెండ్లయింది. నేను ప్రయివేట్లు చెప్పి డబ్బు తెస్తున్నా. పిల్లలూ, వదినా, నేనూ అంతా సుఖంగా కాలం గడుపుతున్నాం. మా వదిన మా అన్నయ్య సాధించలేని కార్యాలను ధైర్యంతో ధర్మంగా సాధించగలిగింది. మాకున్న విచారం ఒక్కటే—మా అన్నయ్య మాలో చేరలేదని. మా అన్నయ్యకోసమే నేం బ్రతికున్నాం. మా అన్నయ్యను పూజించాలనే నేం బ్రతికున్నాం.—మా అన్నయ్య మా యింట్లో వుంటే చాలు. మా యిల్లు వెలుగుతుంది......' అని కమలం మాటలతో ఆయనమనస్సు మార్చుదామని యింకా ప్రయత్నిస్తోంది. రుక్మిణి యింకెంత సేపూ ఆగలేకపోయింది. కమలంమాట వినలేదు. ఆయనపాదాలపై వాలిపోయింది కన్నీటితో. ఆమెను చూచి పిల్లలు అమ్మపై వాలిపోయారు. కమలం 'అన్నయ్యా' అంటూ ఆయన కాళ్లపై పడింది.

ఆయన రాల్చిన కన్నీటిబొట్లు వారందరిపైనా పడ్డాయి. వారి కన్నీటితో కలిశాయి. 'నా రక్తంలో రక్తం—నా పిల్లలు. నాలో అర్ధభాగం—కాని భిన్నహృదయం. కష్టాలను యెదుర్కొంది నా రుక్కు. నా చెల్లి నా పిల్లలను పోషించింది.' ఆయన గోల పెట్టాడు. పిల్లలను యెత్తుకొని యేడ్చాడు. భార్యనూ, కమలాన్నీ లేవనెత్తాడు. రుక్మిణిని క్షమించమని వేడుకున్నాడు. కారే కన్నీటిని ఆమె తుడిచింది. అనుగ్రహించమని ఆయనను వేడుకుంది.

కాషాయవస్త్రాలు మాయమయ్యాయి. ఆయన కమలానంద స్వామి కాడు—కిష్టయ్య. లోకం యిప్పుడు ఆయన నేమన్నా బాధలేదు. తనకు కావలసింది—తన భార్యాపిల్లలు, తన చెల్లి బాగు, తన ఆనందం!

# ప్రపంచంలో నాణ్యతకు మొదటి తరగతి

# తాజ్ మహాల్ బీడీలు

బాలకాలం నుంచీ




అద్వితీయంగా ప్రసిద్ధిపొందినవి.

—: వ్యాపార వివరములకు :—

## మెస్సర్సు. సయ్యద్‌ఖాదర్, తాజ్‌మహాల్ బీడీఫ్యాక్టరీ,

## వాషర్‌మన్‌పేట, మదరాసు 21.

---

మా ఖాతాదార్లకు, అభిమానులకు ఉగాది శుభసమయమున

# మా అభినందనలు

## నవీనమైన ఉత్తమతరగతి గడియారములు



చేతి గడియారములు : *వెస్టెండ్ & శీవర్ లూశా రు. 130 మొదలు రు 150 వరకు ఖరీదులలో కలవు.

ఇతర రకములు : *ఫ్రూత్రి రోల్డుగోల్డు 7¾ క్యార్సు, 15 రాళ్ళు కలది 10 సం॥ల గ్యారంటీ ఇవ్వబడినది. ఫుల్ మూలకు రు 75/-లు * రోల్డుగోల్డు, స్టీల్ బాక్, 1¾ స్క్వేర్ అట్టిక్ గ్లాసుతో, 15 రాళ్ళు కలది, 10 సం॥ గ్యారంటీ ఇవ్వబడినది రు. 85/-లు *గోల్డుఫిల్డు క్రోంబాక్ 6¾&7¾ క్యార్సు 5 సం॥ల గ్యారంటీ ఇవ్వబడినది రు. 55/-లు. అమెరికా ఇంగర్సాల్; అలారం టైంపీసు : రు. 28/-లు * ఇంగ్లీషు కర్లు స్టాండర్డుస్మిత్ అలారం టైంపీసు రు. 20/-లు. ప్యాకింగు, పోస్టేజి రు 2/-లు అదనము. గోడ గడియారములు ; కర్లు స్టాండర్డు 12 అం॥ల డయల్, గంటలు కొట్టని ఇంగ్లీషు స్మిత్ రు 95/-లు. గంటలు కొట్టేది రు. 110/- పోస్టేజి, ప్యాకింగు రు 5/-లు అదనము. ఆర్డర్లన్నియు 25% అడ్వాన్సుతో పంపవలెను. గడియారముల మరమ్మతు మా ప్రత్యేకత.



# రిజ్వాన్ అండ్ బ్రదర్సు,

ప్రొప్రయిటరు : ఫజులుల్లా

217, చైనా బజార్, జి. టి. మద్రాసు.

# రాష్ట్రసంపాదన-నిర్మాణము

(ఒక ఆంధ్రుడు)

సర్వధారి ఎలా ఉంటుందోగాని సర్వజిత్తుమాత్రం మనకు ఏమీ అనుకూలంగా లేదు. అనుకూలంగా లేకపోవడమే గాదు, మనకు అన్ని విధాలా అనిష్టంగానే ఉండిపోయింది. ఆ ఉగాదినాడు ఆంధ్రుడు ప్రధానిగా ఉన్న రాష్ట్రమంత్రివర్గం పోయి తమిళుల మంత్రివర్గం వచ్చింది. సంవత్సరాదినాడు ఏమి జరుగుతుందో ఇంక ఆ సంవత్సరమంతా అలాగే జరుగుతుం దంటారు. పోయిన సంవత్సరమంతా మనకు అలాగే ఉంది. వచ్చిం దనుకున్న రాష్ట్రం ఏమైనదో, ఏమవుతుందో తెలియకుండా పోయింది. "ఈ ఆంధ్రులకు 'రాష్ట్రం రాష్ట్రం' అని కేకలు వేయడంతప్ప మరొక పనిలేదా ఏమిటి?" అని భారతఅధినేత ప్రధానామాత్యులైన పండిత జవహర్‌లాల్ నెహ్రూ విశాఖపట్నంలో మందలించి వెళ్లారు. సర్వజిత్తు పోతూపోతూ మరొకసారి తన శక్తిని ఆంధ్రులకు జ్ఞాపకం చేసింది. ఆంధ్రనాయకుడు రాష్ట్రనాయకత్వానికి పోటీచేయగా, ఆంధ్రుల బలంతో అరవనాయకుడు ఎన్నికఅయినాడు. గతసంవత్సరం ఆద్యంతాలు రెండూకూడా ఆంధ్రులకు చాలా అననుకూలముగానే ఉన్నవి. "ఆంధ్రజాతిజాతకమే పట్టి నష్టజాతకమా" అనే అనుమానం కలిగింది. రానురాను "అసలు మనం ఎవరు? ఆంధ్రులమా, అంధులమా?" అన్న మీమాంసకూడా బయల్దేరింది. ఇంతవరకూ మనం ఎవరమో తెలుసుకోక, మన సంగతి ఏమిటో గ్రహించుకోక "ఇది కావాలి, అది కావాలి" అని ఆందోళన చేస్తూ వచ్చామా? కావచ్చు. అందుకే భారత ప్రధానామాత్యుని మందలింపులకు ఆంధ్రనాయకులు కిక్కురుమనలేదు. వేదాంతులు బోధించినట్లు మన సంగతి మనం తెలుసుకోవడమే జీవితలక్ష్యం! అది గ్రహిస్తే మనం ముక్తి పొందినట్లే!

ఈనాడు మన రాష్ట్రరాజకీయాలు గమనిస్తే, మన నాయకుల నడవడి పరిశీలిస్తే "ఆంధ్రులకు ఇంటిలో మోక్షం లేదు." అని స్పష్టంగా తెలిపోతుంది. పేరుకుమాత్రం మనకు నలుగురైదుగురు నాయకు లున్నారు—అంటే నామమాత్రపు నాయకు లని గాదు; ఎవరైనా అడిగితే చెప్పుకోడానికి. వీరిలో ఏ ఇద్దరూ ఒక మార్గాన్ని అనుసరించడం లేదు. అందరికీ రాష్ట్రవాంఛ గాఢంగానే ఉంది. ఆంధ్రప్రజానీకంకూడా బాగా చైతన్యం కలిగే ఉంది. సామాన్య ప్రజలుకూడా రాష్ట్రం కావాలనే అంటున్నారు. ఆరంభదశలో వలె ప్రత్యేకరాష్ట్రవాంఛ ఉన్నతోద్యోగాలూ, అధికార పదవుల కొరకు పరితపించే ఏ కొద్దిమందో జరిపిన ఆందోళన కాదు ఈనాడు. నాయకులుమాత్రం వెనకటి స్థితిలోనే ఉన్నారు. వీరికి రాష్ట్రం కావాలి. కాని వీరు రాష్ట్రసంపాదనపై దృష్టిని కేంద్రీకరింపక, రాష్ట్రం వచ్చిన తరువాత తమ సంగతి ఏమిటి అనే విషయంమీదనే తమ దృష్టిని కేంద్రీకరిస్తున్నారు. వీరందరికీ ప్రత్యేకరాష్ట్రంకాక రాష్ట్రంలోని ఉన్నతపదవులే లక్ష్యాలు. ఈ విధముగా లక్ష్యాలు వేరైనందువల్ల లక్ష్యసిద్ధికి వారు అనుసరించు మార్గాలూ వేరుగా ఉంటూ నాయకులలో ఐకమత్యం అనేది లేకుండా పోయింది. తాత్కాలిక ప్రయోజనాలకొరకు కొందరు నాయకులు కలిసి ఉండవచ్చు. అయితే అది ఐక్యము కాదు. నలుగురు నాయకులు కలిసి పనిచేయలేనప్పుడు దాదాపు నాలుగు కోట్లుగా ఉన్న ఆంధ్రులు ఏకం కావడం సాధ్యమా? మనకు రాష్ట్రం రావడం సంభవమా?

రాష్ట్రసంపాదనకు మనం ఆంధ్రోద్యమం ప్రారంభించి నలభై సంవత్సరాలు కావచ్చినది. అప్పటికీ, ఇప్పటికీ మన స్థితి ఒకేవిధంగా ఉన్నది. కొంతకాలం రాష్ట్రం కావాలని ఆందోళన చేశాము. ఇప్పుడు రాష్ట్రం రాలేదని ఆందోళన చెందుతున్నాం. అంతకుమించి ఈ మూడుపుష్కరాల్లో కలిగిన పరిణామం ఏమీ లేదు. మన సంస్కృతి నిజంగా మంటగలిసిపోయింది. మన చరిత్ర మట్టిపాలయింది. మనసంప్రదాయం ఏమిటో ఎరుగని స్థితికి వచ్చాము. ఆంధ్ర సంస్కృతిని, ఆంధ్రసంప్రదాయమును పునరుద్ధరించుటకు, పునరుజ్జీవింపజేయుటకు ఏ ఆంధ్రసంస్థా పనిచేయుటలేదు. "త్యాగబ్రహ్మ తెనుగువాడు. తంజావూరును తెనుగునాయకులు ఏలినారు. పాశ్చాత్య భాషలలో ఇటాలియన్ భాష ఎలాంటిదో ప్రాచ్యభాషలలో తెనుగుభాష అట్టిది. భారతీయులలో ఖండాంతరముల వ్యాపారము సాగించినవారు ఆంధ్రులు. తురుష్కుల విధ్వంసకలాపము

నుండి భారతీయసంస్కృతిని సంరక్షించినవారు దాక్షిణాత్యులు. తల్లి రాజ్యంనుండి తరిమివేస్తే శ్రీరామునికి ఆశ్రయ మిచ్చినవి ఆంధ్ర అరణ్యములు. అజంతా, ఎల్లోరా, అమరావతీశిల్పచాతుర్యము ఆంధ్ర యశస్సును జగద్విఖ్యాతము చేసినది." ఆంధ్రత్వము పై కుబికినప్పుడు ఈవిధముగా కవితాగానము చేయుటకు అలవాటుపడితిమేగాని, ఆనాటి ప్రాభవమును పునరార్జించుటకు ఇప్పటికి ఎట్టి ప్రయత్నములూ చేయుటలేదు.

రాష్ట్రం రావచ్చును; రాకపోవచ్చును. కాని జరుగవలసినది ఆంధ్రసంస్కృతి, ఆంధ్రసంప్రదాయముల పునరుద్ధరణ. ప్రత్యేక రాష్ట్రముకూడా ఈ కార్యక్రమనిర్వహణ కొరకు సాధనే. అందుకే మనము రాష్ట్రము కావాలని ఆందోళన చేశాము; రాలేదని ఆందోళన చెందుతున్నాము. మన నాయకులు గవర్నరులు కావలెనని, మన ఉపనాయకులు మంత్రులు కావాలని, మన 'వినాయకులు' దండధరులు కావాలనీ మనం రాష్ట్రం కావాలనడం లేదు. ధనికవర్గాలప్రతినిధి మన రాబోవు రాష్ట్రపారిశ్రామికాభివృద్ధికి పథకాలు తయారుచేయవలసి వస్తే, నిన్నమొన్నటివరకు కాంగ్రెసుకు ప్రతికూలపక్షంలో ఉండి జాతీయశక్తుల నణచివేయడానికి పనిచేసినవారే నాడు 'గాంధీజాతీయస్మారకనిధి' నిర్వాహకులు కావలసిన దుస్థితి ఏర్పడితే, మనకు రాష్ట్రం వచ్చిమాత్రం ప్రయోజన మేమి? అగ్ర నాయకులు తమ ఆశ్రితులకు పదవులూ, అధికారం పంపకం చేసుకొనుటకు కాదుగదా నలభైసంవత్సరములూ మనం ఆంధ్రోద్యమాన్ని నిర్వహించినది! మన నాయకులకు చిత్తశుద్ధి, లక్ష్యశుద్ధి ఏర్పడినగాని, మనకు రాష్ట్రం వచ్చి ప్రయోజనం లేదు. మన నాయకులు రాష్ట్రంకొరకు ఒకే విధానమును అనుసరించి పనిచేసినగాని మనకు రాష్ట్రం రానూరాదు. పరిస్థితులు ఇదేవిధంగా ఉండే పక్షంలో రాష్ట్రం రాకపోవడమే మంచిది! రాష్ట్రం రాకపోవచ్చునుకూడా!

అయితే అసలు రాష్ట్రం రాగల ఆశ, అవకాశం ఏమైనా ఉన్నవా? రాష్ట్రం వచ్చినట్లే అని మన పెద్దలు ప్రజలను ఊరడిస్తున్నారు. "ఆంధ్రరాష్ట్రంగురించి వేరే ఆలోచనే అనవసరం. నూత్న రాజ్యాంగాన్ని రాజ్యాంగపరిషత్తు ఆమోదించినవెంటనే రాష్ట్రనిర్మాణానికి అవసరమైన చర్యలు తీసుకుంటాం" అని అధినివేశప్రధానామాత్యుడు హామీ ఇచ్చారు. అసలు రాష్ట్రముల జాబితాలో 'ఆంధ్ర'ను కూడా చేర్చవలసినదిగా వీరు రాజ్యాంగరచనా సంఘాన్ని ముందు ఆదేశించారు. ఆఖరు క్షణంలో తొలగించమని కూడా వీరే ఆదేశించారు. చేర్చడం, తీసివేయడంకూడా జరిగినవి. అయితే అందుకు ఇతరభాషాప్రాంతాల ఆందోళనే కారణం అనీ, ఇప్పటికైనా సరే ఆంధ్రులు సరిహద్దుల విషయంలో ఇరుగుపొరుగు వారితో ఒక సమాధానానికి వచ్చి, తమ రాష్ట్రం అన్నివిధాలా సమగ్రంగానూ, స్వయంపోషకంగానూ, స్వయంసమృద్ధంగానూ ఉంటుందని రాజ్యాంగపరిషత్తు అధ్యక్షునకూ, సభ్యులకూ, అధినివేశప్రభుత్వమునకూ ఒక విజ్ఞాపనను సమర్పిస్తే, ఆంధ్రులకు ఈ క్షణం ప్రత్యేకరాష్ట్రం లభిస్తుందని రాజ్యాంగరచనాసంఘ అధ్యక్షుడు, అధినివేశప్రభుత్వన్యాయశాస్త్రశాఖామాత్యుడు డాక్టరు భీమారావు, అంబేద్కర్ గారు ఆంధ్రపత్రిక బొంబయివిలేఖరిద్వారా ఇప్పటికి రెండు దఫాలు స్పష్టంగా ప్రకటించారు. ఆంధ్రరాష్ట్రసంపాదనే ఏకైకలక్ష్యంగా కల ఆంధ్రమహాసభగాని, ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘంగాని ఇప్పటివరకూ విషయసేకరణకు, ఇలాంటి నివేదికను తయారుచేయించుటకు ఎట్టి ప్రయత్నమూ చేసియుండలేదు. ఆంధ్రమహాసభ న్యూఢిల్లీకార్యాలయం స్థాపించింది. ఒక సరిహద్దువిషయసేకరణసంఘాన్ని స్థాపించింది. ఇంక రాష్ట్రకాంగ్రెసు రెండు సరిహద్దుసంఘాలను స్థాపించినది. డాక్టరు మారేమండ రామారావు గారిచే 'ఆంధ్రరాష్ట్రవాదం' అని రాజ్యాంగపరిషత్సభ్యులకు ఒక విజ్ఞాపనను వ్రాయించి ప్రచురించినది. ఈ పాలిక పేజీల విజ్ఞాపనమూ అసంపూర్తిగ నున్నది. ఆంధ్రరాష్ట్రము స్వయం సమృద్ధముగ నుండగల దని సహేతుకముగ నిరూపింపలేదు. ఆంధ్రరాష్ట్రనిర్మాణము సుసాధ్యమని బుజువు చేయలేదు. లోగడ శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారు ఒక సమగ్రమైన మెమోరాండమును తయారు చేసిరి. చెన్నరాష్ట్ర ౧౯౩౮-౩౯ ఆయవ్యయఅంచనాల నాధారముగా తీసుకొని ఆంధ్రప్రాంతముల ఆర్థికస్థితి సంతృప్తికరముగా నుండగల దని నిరూపించిరి. కాని ఈ పదిసంవత్సరములలో పరిస్థితులు పూర్తిగ మార్పుచెందినవి. కనుక తిరిగి అవే పద్ధతులపై వేరొక మెమోరాండమును తయారుచేయుట అవసరమైనది. ౧౯౩౭ వ సంవత్సరములో ఆంధ్రమహాసభస్థాయిసంఘముకూడా ఒక నివేదికను తయారుచేసియుండెను. వీటి నన్నింటిని అనుసరించి ఆంధ్రమహాసభగాని, ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘముగాని వెంటనే ఒక సమగ్రనివేదికను తయారుచేయించవలెను.

అప్పటికైనా ఆంధ్రరాష్ట్రం రాగల దనే నమ్మకము ఏమున్నదని ప్రశ్నించవచ్చును. ఆంధ్రోద్యమచరిత్రను ఒక్కసారి పరిశీలిస్తే ఎవరికైనా ఇలాంటి అనుమానం కలగడం సహజమే ననిపిస్తుంది. ౧౯౧౭ వ సంవత్సరములో ఎడ్విన్ మాంటేగోకు ఆంధ్రులు తమ రాష్ట్రంగురించి ఒక విజ్ఞాపన సమర్పింపగా ఆంధ్రుల రాష్ట్రవాంఛ సబబైనదే ననీ, భాషారాష్ట్రనిర్మాణము జరుగవలసినదేననీ ఆయన అంగీకరించారు. భారతరాజ్యాంగరచనాసంఘముకూడా ఇదే అభిప్రాయమును వెల్లడించెను. తదనుగుణముగా నూత్నరాష్ట్రముల నిర్మాణమునకు దోహదము చేయుటకు ౧౯౧౯ భారతరాజ్యాంగ శాసనములో ౫౨-ఎ సెక్షను ఏర్పరచిరి. నూత్న రాష్ట్ర నిర్మాణముతో సంబంధము గల రాష్ట్రశాసనసభల సమ్మతిని పొంది భారతీయ గవర్నరు జనరల్ ఇండియా కార్యదర్శిఆమోదముతో నూత్న రాష్ట్రములను ఏర్పాటుచేయవచ్చునని ఈ సెక్షన్ సూచించెను. అయితే ఈ సెక్షన్ప్రకారము నూత్నరాష్ట్రములు ఏర్పాటు కాలేదు.

తరువాత సైమన్ కమీషన్ వచ్చినది. రౌండ్ టేబిల్ సభలు జరిగినవి. జాయింటు పార్లమెంటరీ కమిటీ సమావేశములు జరిగినవి. ఆంధ్రులు ప్రత్యేకముగా లండనుకు ఒక రాయబారవర్గమునుకూడ పంపిరి. రౌండ్ టేబిల్ సభకు హాజరైన బొబ్బిలి రాజాగారు ఆంధ్ర రాష్ట్రమునుగురించి ఒక నివేదికను సమర్పించిరి. గాంధీమహాత్ముడు లండన్ వెళ్లనున్న సమయములో అఖిలభారత కాంగ్రెసుసంఘము నందలి ఆంధ్రసభ్యులు మహాత్మునకు ఒక విజ్ఞాపనము సమర్పించి, తమ రాష్ట్ర నిర్మాణమునకు తోడ్పడవలసినదిగా కోరియుండిరి. గాంధీజీ అందుకు అంగీకరించెను. కాని రౌండ్ టేబిల్ సభలో గాంధీజీ ఏమియు సాధింపజాలక రిక్తహస్తములతో భారతదేశము తిరిగి రావలసి వచ్చెను.

అయినప్పటికీ ౧౯౩౫ వ సంవత్సరపు భారతరాజ్యాంగశాసనంలో సింధు, ఒరిస్సా రాష్ట్రములను ఏర్పాటుచేస్తూ ఇతరరాష్ట్రముల నిర్మాణమునకు ౨౯౦ సెక్షనును చేర్చెను. కాని ఈ రాజ్యాంగము ప్రకారముకూడ ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగలేదు. చెన్నరాష్ట్రశాసనసభలు ఇప్పటికి నాలుగుదఫాలు రాజధానిని భాషాప్రయుక్తరాష్ట్రములుగా విభజింపవలసిన ఆవశ్యకతను తెలుపుచు తీర్మానములు చేసియుండెను. ౧౯౩౭ వ సంవత్సరములో, కాంగ్రెసు మంత్రివర్గ మేర్పడిన తరువాత, ఆంధ్రరాష్ట్రమునుగురించి శాసనసభలు తీర్మానముచేయుటయు, మంత్రివర్గ మాప్రకారము ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగవలసినదేనని భారత కార్యదర్శికి సిఫార్సుచేయుటయు జరిగినది. ఆసమయమున భారతకార్యదర్శితో సంప్రదించుటకు ఆంధ్రమహాసభ తరఫున కొంత ప్రయత్నము జరిగెను. భారత కార్యదర్శికి సలహాదారుగా వెళ్లిన కీ. శే. ఈమ్మగంటి రాఘవేంద్ర రావుగారీ విషయమై కొంత కృషిచేసినట్లును, కాని లోగడ చెన్న రాష్ట్రమంత్రివర్గము చేసిన సిఫార్సు మెతకగ నున్న దని ఆకారణముగ రాష్ట్రనిర్మాణము దుస్సాధ్య మైనట్లును కొంత ప్రచారము జరిగినది. ఆఖరు క్షణములో ఒక దుష్టశక్తి అడ్డుపడినదని ౧౯౪౦ వ సంవత్సరమున విశాఖపట్నములో జరిగిన ఆంధ్రమహాసభ సమావేశమున కొందరు నాయకులు ప్రకటించిరి. వారు రాష్ట్రఅధిపతి యైనతరువాత రాష్ట్రనిర్మాణమునకు కాదుగదా, ఆంధ్రప్రాంతముల అభివృద్ధికైనను ఏమియు జరుగలేదు. కొందరు ఆంధ్రులకు లాభించియుండవచ్చును కాని మొత్తముగ ఆంధ్రజిల్లాలకు కలిగిన విశేషప్రయోజనమేమియు లేదు.

అతఃపూర్వము ఆంధ్రజిల్లాలకు బడ్జెటును వేరుచేయవలెనని ఆందోళన జరిగెను. ఆ పనికూడ జరిగియుండలేదు. ఆదినుండియు ఆంధ్రనాయకుల రాష్ట్రసంపాదనాదీక్షా, స్వజాతిఅభిమానమూ ఇట్లే ఉంటూవచ్చెను. అధికారసంపాదనప్రయత్నములప్పుడు ఆంధ్రైక్యత, ఆంధ్రరాష్ట్రం ప్రధానాంశములుగా ఉండి అప్పటి లక్ష్యములు సిద్ధింపగనే ఇవి అప్రధానము లగుచున్నవి. ఇటీవల రాష్ట్ర నాయకత్వమునకు జరిగిన ఎన్నికల సందర్భమునకూడ మన నాయకుల ధోరణి ఇదేవిధముగ నుండెను. ఎన్నికలపూర్వము ఆంధ్రైక్యత, సరిహద్దులసమస్యను సమాధానమార్గమున పరిష్కరించుకొనుట అత్యంతముఖ్యవిషయము లయ్యెను. అనంతరము రాష్ట్రసంపాదన ప్రధానాంశ మయ్యెను. ఏదైనను విమర్శకులకు కాటువలెనే ఉంటున్నది.

గత సంవత్సరము జూనుమాసమున భారతదేశమునకు అధినివేశ ప్రతిపత్తిని ప్రసాదించుచు నూత్నస్థాయికి తగినట్లుగా ౧౯౩౫ రాజ్యాంగమును సవరించిరి. ఈ సవరణలో ౨౯౦ వ సెక్షన్ రద్దు చేసెదో అని ఆంధ్రనాయకులు భయపడిరి. కాని ఆ సెక్షన్ రాజ్యాంగమునుండి రద్దుకాకున్నను ఆ రాజ్యాంగమును అనుసరించి ప్రత్యేకాంధ్రరాష్ట్రమేర్పడు అవకాశముమాత్రము లేకుండెను. నూత్న రాజ్యాంగపరిషత్తు ఆమోదించుటతో ౧౯౩౫ రాజ్యాంగము రద్దయిపోవును. కనుక నూత్నరాష్ట్ర నిర్మాణ మింక స్వతంత్రభారత రాజ్యాంగమును అనుసరించియే జరుగవలసియుండును. రాజ్యాంగ రచనాసంఘాధ్యక్షుడు పరిషత్తుఅధ్యక్షునకు వ్రాసిన లేఖలో ఈ విషయమునే స్పష్టము చేసెను. నూత్నరాజ్యాంగము అమలులోనికి వచ్చుటతో సమగ్రాంధ్రరాష్ట్ర మేర్పడే వ్యవహారము జరుగవలె నన్న ఇప్పటి రాజ్యాంగము ననుసరించియే ఆంధ్రరాష్ట్రనిర్మాణము జరుగవలసియున్నదనికూడ రాజ్యాంగరచనాసంఘమువారు స్పష్టము చేసిరి. అధినివేశప్రభుత్వఅభిమతముపై అంతయు ఆధారపడియున్నది.

గతసంవత్సరము అధినివేశశాసనసభలో భారతప్రధానామాత్యుడు భాషారాష్ట్రసమస్యనుగురించీ, ఆంధ్రరాష్ట్రనిర్మాణమును గురించీ చేసిన ప్రకటనవల్లను, గత మార్చి ౧౮ వ తేదీన విశాఖపట్నములో చేసిన ప్రకటనవల్లను అధినివేశప్రభుత్వఅభిమతి అంతగా వ్యక్తము కాకపోయినా, వైఖరి కొంతవరకు స్పష్టమైనది. నూత్నరాజ్యాంగమున రాష్ట్రముల జాబితాలో 'ఆంధ్ర'నుకూడా చేర్చాలనడం జరుగుతుందనీ, 'పరిషత్తు రాజ్యాంగమును అంగీకరించుట జరిగినవెంటనే ఆ నిర్ణయమును అమలుపరచుటకు ప్రభుత్వము చర్య తీసుకొను' ననీ పండిత నెహ్రూ ప్రకటించెను. ౧౯౩౫ భారత రాజ్యాంగమున సింధు, ఒరిస్సారాష్ట్రములను ముందు చేర్చాలని, అనంతరం రాష్ట్రాలను ఏర్పాటు చేసినట్లే ఆంధ్రరాష్ట్రనిర్మాణము జరుగగల దని ఆ సందర్భమున పండిట్ నెహ్రూ సూచించెను. దానిని బట్టి కొందరు ౧౯౩౫ రాజ్యాంగమునందలి ౨౯౦ సెక్షను ప్రకారమే, నూత్నరాజ్యాంగములో నిమిత్తము లేకనే జరుగు నని ఆశించిరి. అట్లయిన నూత్నరాజ్యాంగరచనకు, రాష్ట్రనిర్మాణమునకు ఎట్టి సంబంధమూ ఉండనవసరము లేదు. ౨౯౦ వ సెక్షను అనుసరించి రాష్ట్రనిర్మాణం జరిగిన రాజ్యాంగరచనాసంఘం ఇతరరాష్ట్రములతో బాటు ఆంధ్రనుకూడా మొదటి షెడ్యూలు మొదటి భాగములో చేర్చియుండును. అట్లుగాక ౧౯౩౫ రాజ్యాంగమును అనుసరించి

సింధు, ఒరిస్సాలు ఏర్పడినట్లే ఆంధ్రరాష్ట్రము ఏర్పాటగునని పండిట్ నెహ్రూ అభిప్రాయపడిఉంటే, నూత్న రాజ్యాంగమును అనుసరించి ఆంధ్రరాష్ట్రనిర్మాణము జరుగవలసియుండును. స్వతంత్ర భారతరాజ్యాంగమును అనుసరించి నూత్న రాష్ట్రముల నిర్మాణమునకు వేరొక మార్గం ఉన్నది. రాజ్యాంగరచనాసంఘఅధ్యక్షుడు పరిషత్తుఅధ్యక్షునకుకూడా ఈ విషయమును వివరించియుండెను. ఏమైనా నూత్నరాజ్యాంగమందలి రాష్ట్రముల జాబితాలో 'ఆంధ్ర' ప్రత్యేకరాష్ట్రంగా పేర్కొనడం జరిగితేనే నూత్నరాజ్యాంగం అమలుజరిగేలోపుగా గాని, జరుగుటతోగాని ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడుట జరుగగలదు.

ఈ సందర్భములో సింధు, ఒరిస్సా రాష్ట్రములు ౧౯౩౫ రాజ్యాంగమును అనుసరించి ఏవిధముగా ఏర్పడినవో పరిశీలిస్తే ఆంధ్ర రాష్ట్రనిర్మాణము ఎప్పుడు, ఏవిధంగా జరుగగలదో స్పష్టం కాగలదు. ౧౯౩౫ వ సంవత్సరం నూత్న రాజ్యాంగం తయారవడానికి పూర్వమే సరిహద్దుల విచారణసంఘం, ఆర్థికఉపసంఘం, నియోజకవర్గముల నిర్ణయసంఘములు ఏర్పడి, సింధు, ఒరిస్సా రాష్ట్రముల నైసర్గిక స్వరూపం, ఆస్తిపాస్తులు, నూత్న రాజ్యాంగమును అనుసరించి జరుగు శాసనసభల ఎన్నికలకు నియోజకవర్గములు నిర్ణయమైనవి. ౧౯౩౫లో నూత్నరాజ్యాంగము పూర్తి అయినది. ౧౯౩౬ ఏప్రెల్ ౧వ తేదీన నూత్న ఒరిస్సారాష్ట్రమును ఏర్పాటుచేయుచు, ఒక గవర్నరును, మంత్రులను, శాసనసభాసభ్యులను నియమిస్తూ ఆర్డర్-ఇన్-కౌన్సిల్ జారీ అయినది. ౧౯౩౭ లో రాజ్యాంగము అమలుజరిగి ఎన్నికల కలాపము పూర్తిఅయినది. ఆ పనిని ఒరిస్సా తాత్కాలిక ప్రభుత్వమే నిర్వహించినది. ఈ విధంగా రాజ్యాంగఆమోదానికీ, అమలుకూ మధ్యనే ప్రత్యేకఒరిస్సారాష్ట్రమూ, ఒరిస్సాప్రభుత్వమూ ఏర్పడింది. అంటే ప్రత్యేకఒరిస్సారాష్ట్రనిర్మాణకలాపము యావత్తూ ౧౯౩౫ రాజ్యాంగమును అనుసరించే జరిగినది.

అదే విధముగా ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణకలాప మంతయు నూత్నరాజ్యాంగమును అనుసరించే జరుగవలసియుండును. కాని రాష్ట్రముల జాబితాలో ఆంధ్రరాష్ట్రం లేనందువల్ల ప్రభుత్వం ఎప్పుడు ఏ పని చేస్తుంది అనే విషయం సందిగ్ధమైనది. అలాగాక జాబితాలో చేరఉంటే నూత్న రాజ్యాంగం అమలుజరిగేనాటికి రాష్ట్రం ఏర్పడితీరేది. ఈలోపుగానే, నూత్నరాజ్యాంగం ఆమోదింపబడినవెంటనే కాకపోయినా, నూత్నరాజ్యాంగం అమలుజరిగే లోపున ఆంధ్రమంత్రివర్గం ఏర్పడిఉండేది. ఇంక ఇప్పుడు రాష్ట్ర నిర్మాణం ఎలా జరుగుతుందో చెప్పలేము. నూత్నరాజ్యాంగం ఈ సంవత్సరం జూను మాసములో ఆమోదింపబడుతుంది. నూతనాంధ్ర రాష్ట్రం నూత్నరాజ్యాంగం అమలుజరుగుటతో ఏర్పడా లన్న [illegible]ములో నూత్నరాజ్యాంగం ఆమోదింపబడుటకు పూర్వమే రాష్ట్ర సరిహద్దుల నిర్ణయము, ఆస్తిపాస్తుల విభజన మున్నగు పనులు పూర్తి కావలెను. రాజ్యాంగరచనాసంఘము ఆంధ్రరాష్ట్రము విషయములో చేసిన సూచన గమనార్హము. ప్రత్యేకాంధ్రరాష్ట్రము నూత్న రాజ్యాంగారంభంనుండి వ్యవహరించాలన్న ఇప్పటి రాజ్యాంగాన్ని అనుసరించియే తక్షణం ప్రభుత్వం చర్యలు తీసుకొనవలసియుండు నని హెచ్చరించిరి. ఫిబ్రవరి ౨౧వ తేదీన ముసాయిదా ప్రకటింప బడినది. ఈ హెచ్చరికను పురస్కరించుకొని అధినివేశప్రభుత్వం ఇప్పటివరకూ ఎట్టి చర్య తీసికొనియుండలేదు. కనుక నూత్న రాజ్యాంగారంభముతో ఆంధ్రరాష్ట్రం వ్యవహరించుట సాధ్యము గాదు. అధినివేశప్రభుత్వఅభిమతియుకూడా ఇందుకు అనుగుణమైనదే అని ఇప్పుడు స్పష్టమైనది. కనుక ఇక ఆంధ్రరాష్ట్ర నిర్మాణం నూత్నరాజ్యాంగాన్ని అనుసరించే జరుగవలసియున్నదని స్పష్టమగు చున్నది. అదైనను నూత్నరాజ్యాంగము అమలుజరుగుటకు పూర్వమే పూర్తికావలెనన్న ఇందుకు సంబంధించిన ప్రాతిపదికపనులు నూత్న రాజ్యాంగము ఆమోదింపబడుటకు పూర్వమే జరుగవలసియున్నవి.

భాషారాష్ట్రనిర్మాణావకాశములను పరిశీలించి, ఏయే రాష్ట్రముల నిర్మాణము సాధ్యమో నివేదించుటకుగాను రాజ్యాంగపరిషత్తు ఒక సంఘమును నియమించునని అధినివేశప్రధానామాత్యుడు పండిట్ జవహర్లాల్ నెహ్రూ విశాఖపట్నమునందు ప్రకటించెను. ఈవిచారణ సంఘము ఆంధ్రరాష్ట్రనిర్మాణము సాధ్యమనీ, వెంటనే జరుగవచ్చు ననీ సిఫార్సుచేసిన అప్పుడు సరిహద్దునిర్ణాయకసంఘముల నియామకము జరుగు ననికూడా పండిట్ నెహ్రూ ప్రకటించెను. కనుక ఆంధ్రనాయకులు, ఆంధ్రసంఘములు ఆంధ్రరాష్ట్రవాదమును ఈసంఘముఎదుట నిరూపింపవలెను. అందుకు సమగ్రమైన, తగిన ఆధారములతో ఒక నివేదికను సమర్పించిన విచారణసంఘంపని సులభమై, వెంటనే సరిహద్దునిర్ణయసంఘమును స్థాపించుట సాధ్యమగును. అనంతరము సరిహద్దుల నిర్ణాయకసంఘముఎదుట రాష్ట్రసరిహద్దుల విషయమై ఇరుగుపొరుగువారితో సమాధానము కుదుర్చుకొన్న పక్షంలో రాష్ట్రనిర్మాణముకూడ జూలైలోపున పూర్తికాగలదు. ఇప్పటికి అనేక సరిహద్దుసంఘములు ఏర్పడినవి. కాని సరిహద్దుల విషయంలో ఒక్క సమస్యకూడా పరిష్కారముకాలేదు. చెన్న నగరమును ఆంధ్రులు వదులుకొన్న పక్షములో ఆంధ్రులకు ఈ క్షణము రాష్ట్రము రాగలదని పలువురు చెప్పినట్లు ఇటీవల కొన్ని వార్తలు ప్రచారమైనవి. మన సరిహద్దుసంఘముల క్రమబద్ధముగాని ప్రచారమే ఇందుకు కారణమని స్పష్టమగుచున్నది. ఏట్లాచ్చి చెన్న నగరమే ఆంధ్రరాష్ట్రమునకు ప్రతిబంధకమైనది. ఈ సమస్య నేడు గాకున్న రేపైనను రాజీమార్గముగనే పరిష్కారము కావలసియున్నది. మన నాయకుల ప్రవర్తన, ప్రసంగములు ఇందుకు దోహదము చేయ వలెను. ఆంధ్ర, తమిళ, కర్ణాటక, ఓఢ్ర అగ్రనాయకులు సంప్రతించుకొని సరిహద్దుల విషయమున ఒక సమాధానమునకు వచ్చుతే

అందరికిని అనుకూలమైన మార్గము. అందుకు నాయకులందరు కలిసి పనిచేయవలెను. కర్నాటకరాష్ట్రకాంగ్రెసుసంఘము సరిహద్దురాయబారసంఘమును నియమించెను. ఇదే విధముగ ఆంధ్రకాంగ్రెసు సంఘముకూడ ఒక రాయబారసంఘమును వెంటనే నియమింపవలెను. ఈ ఉభయసంఘములు సంప్రతింపులు జరిపి జూన్ మాసములోపుగా తమ ఒడంబడికను అధినివేశప్రభుత్వమునకును, రాజ్యాంగపరిషత్తునకును సమర్పించిన, నూత్నరాజ్యాంగము జూన్ మాసమున ఆమోదింపబడిన వెంటనే నూత్నరాజ్యాంగమునందలి మొదటి భాగములోని ౩వ సెక్షనును అనుసరించి నూత్నపార్లమెంటు ఆంధ్రరాష్ట్రమును ఏర్పాటుచేయుచు శాసనము చేయవచ్చును. ఆప్రకారము ఆంధ్రరాష్ట్రము, ఆంధ్రప్రభుత్వము, ఆంధ్రశాసనసభ ఆగష్టునాటికి ఏర్పడ గలవు.

అయితే ఇప్పటి ఆంధ్రరాజకీయములను విచారిస్తే ఈ విధంగా ఏర్పడిన ఆంధ్రరాష్ట్రం భిన్నాభిన్నంగా ఉండగలదేగాని, నూత్నాంధ్రరాష్ట్రం సౌష్ఠవంగా ఉండదని అనుమానం కలుగుచున్నది. పై నాయకులు మొదలు క్రింది నాయకులవరకు ఉన్న విభేదాలు చాలా ఆందోళనకరంగా ఉన్నవి. రాష్ట్రం ఏర్పడిన తరువాత ఇవి ఎక్కువ అగునేగాని తగ్గగల అవకాశములు కనిపించుట లేదు. ఈ పరిస్థితులలో రాష్ట్రం రాకుండుటే మేలుకావచ్చును. ఆంధ్రరాష్ట్రం అఖండం ఇతరరాష్ట్రాలతోబాటు నిలుచుటకు ఒక దశాబ్దం నిరంతర కృషి అవసరం. అన్ని వర్గాలవారూ కలిసి పనిచేయుట అవసరం. ఆంధ్రైక్యముద్వారానే రాష్ట్రసంపాదన జరగాలి. రాష్ట్రం అభివృద్ధి చెందాలి. కనుక అందరూ అట్టి ఐక్యమునకే కృషి చేయాలి.

రాష్ట్రమునందలి వివిధ వర్గముల సమైక్యతకు కృషిచేయవలసిన బాధ్యత రాష్ట్ర కాంగ్రెసుపై గలదు. కాని రాష్ట్ర కాంగ్రెసు ఇప్పటివరకు ఈ బాధ్యతను నిర్వహింపకపోవుటేగాక, వర్గవైషమ్యముల వృద్ధికి ఒక విధముగ దోహదము చేసినదని చెప్పవలెను. రాష్ట్రమున కాంగ్రెస్ మంత్రివర్గమున్నపుడు, ఆ మంత్రివర్గమును బలపరచుట రాష్ట్రకాంగ్రెసు కనీసధర్మము. వ్యక్తులకుగాక సంస్థకు ప్రాధాన్యమివ్వవలెను. ప్రభుత్వవిధానములను విమర్శింపవచ్చును. సరియైన మార్గములను సూచింపవచ్చును. కాని ఒక వ్యక్తినే అభిమానించి, వారు ప్రధానిగనుండిననే అది కాంగ్రెస్ మంత్రివర్గము కాగలదని భావించి, ఆ వ్యక్తికి పట్టముగట్టవలెనని ప్రయత్నించుటవల్ల విభేదములు పెరిగిపోయి కాంగ్రెసులోనే రెండు విభిన్న పక్షము లేర్పడుట జరిగినది. ఎవరికివారు తమపక్షమును బలపరచుకొనుటకు ప్రయత్నము చేయుచుండిరి. రాష్ట్రమునందలి కాంగ్రెస్ సంఘము రాష్ట్రమును పాలించుచున్న ప్రభుత్వమునకు ప్రతికూలపక్షము వలె వ్యవహరించుటచేత రాష్ట్రరాజకీయములకేగాక, కాంగ్రెసు క్రమశిక్షణమునకుకూడ తీరని హానికలుగుచున్నది. రాష్ట్రమునందలి వివిధ విభిన్నవర్గములను ఏకముచేయగల శక్తి, సామర్థ్యం ఎలా ఉన్నా, ఒక రాష్ట్రకాంగ్రెసుకే కలదు. మంత్రులుకూడ రాష్ట్రకాంగ్రెసు యెడల తమ వైఖరిని మార్చుకొనవలసియున్నది. దీక్షతో పనిచేసిన ఇది అసాధ్యమగు విషయముకూడ కాదు. ఈ సంవత్సరము ఇది సాధ్యము కాగలదనీ, తద్వారా రాష్ట్రసిద్ధి సన్నిహితము కాగలదనీ ఆశించుటకు సర్వత్ర సంధ్యాసమయమున దిక్చక్రమున చిన్నెలు గోచరించుచున్నవి.

ఆంధ్రైక్యతతోబాటు సాధింపవలసిన విషయము—రాష్ట్రసంపాదనకు అత్యంత ప్రధానమైన విషయము వేరొకటి ఉన్నది. రాయలసీమ, ప్రజల వైఖరి ఎట్లున్నను, నాయకులు తీవ్రముగ అసంతృప్తి చెందియుండిరి. గత మంత్రివర్గమున, ఈ మంత్రివర్గమునకూడ వారికి తగినంత ప్రాతినిధ్యము లేనందున 'సర్కార్ ప్రజల' సదుద్దేశ్యములయెడ వారి శంకలు హెచ్చినవి. శ్రీబాగు ఒడంబడికను గౌరవింతురా యనుసందేహము కలిగెను. రాష్ట్రనాయకత్వమునుకూడ కోస్తాజిల్లాలవారే గుత్తకు తీసుకొనిన ట్లయ్యెను. రాష్ట్రకాంగ్రెస్ నాయకత్వమువైనను వారి కొసవట్ల ఉంచిరను. నాయకత్వము దానికది రావలసినదే కావచ్చును. కాని రాష్ట్రకాంగ్రెస్ పెత్తనము అట్లు కాదుగదా? రాయలసీమ కళాశాలలు ఇప్పటికిని మద్రాసువిశ్వవిద్యాలయమునందే యుండుటకు కూడ రాయలసీమనాయకుల శంకలే కారణము. మంత్రివర్గమునందలి ఆంధ్రమంత్రులయినను వీరి సందేహనివృత్తి కేమియు చేయలేకుండిరి. అయినను ఆంధ్రమంత్రులు ప్రస్తుత మంత్రివర్గమునందున్నను ఆంధ్రప్రజలకుగాని, ఆంధ్రప్రాంతములకుగాని జరుగుచున్న, జరుగగల ప్రయోజనము శూన్యము. దేశసర్వతోముఖాభివృద్ధి! వర్గాభిమానముగాక, రాష్ట్రాభిమానము, రాష్ట్రక్షేమాభివృద్ధిరయిన ఆసక్తి గల మంత్రివర్గ మేర్పడుట అత్యంతావశ్యకము. ప్రధానామాత్యపదవి లభించినను, భాషాప్రయుక్తముగా చెన్నరాజధాని పునర్నిర్మాణము జరిగినగాని రాష్ట్రమునకు కించిత్తూ ప్రయోజనము ఉండదు. కనుక ప్రధానామాత్యపదవిని సంపాదించుటపై శక్తిని, ధనమును, కాలమును వృథాచేయుటకంటె ఆంధ్ర ఐక్యతకూ, తద్వారా ఆంధ్రనాయకత్వ నిర్మాణమునకూ, రాష్ట్రసంపాదనకూ కృషిచేయుట వాంఛనీయము; అత్యవసరము; ఎక్కువప్రయోజనకరము.

సర్వధారిలో ఆంధ్రులు ఇద్దరు ఆంధ్రమహాపురుషుల సంస్మరణోత్సవములను జరుపుకొనుచున్నారు. వారు ఉభయులు ఆంధ్ర సంస్కృతి, భాషా, సంప్రదాయసముద్ధరణకు జీవితమును ధారపోసినారు. ఈ సంస్మరణోత్సవములనాడు వారి జీవితాశయసాధనకు కృషి చేయుదుము. యావదాంధ్రము ప్రతిన బూని పని చేయుగాక!

# స్వాగతము

(శ్రీ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి)

స్వస్తి సమస్తభూవలయశాసనకర్తకు; సర్వపాప వి
ధ్వస్తకు; సర్వసస్యసముదాయవిభాసితభూతధాత్రివి
న్యస్తకు; 'సర్వజి'న్మహిమ హర్తకు; మంగళనూత్నవైభవా
భ్యస్తకు; 'సర్వధారి'కిఁ బ్రభావచరిత్రమనోవిహారికిన్.

సర్వసర్వంసహాచక్ర మేలెడు ధర్మచక్రానుసారి మా సర్వధారి
సర్వసస్యవిశేషసంపద్విధాత్రయౌ జనమనోహారి మా సర్వధారి
సర్వదేశాచారసంఘవిధ్వంసకసమదారివైరి మా సర్వధారి
సర్వమానవభ్రాతృసౌహార్దపరిపూతసంపద్విహారి మా సర్వధారి
జననిదాస్యదారి మా సర్వధారి - సంపదలకెల్ల దారి మా సర్వధారి
సకలశుభకామ్యానుకారి మా సర్వధారి - స్వాగతం బిదె కొను మహో! సర్వధారి!

---

# సవ్యమైన వ్యవసాయ విధానావశ్యకత

శ్రీ మోచర్ల దత్తాత్రేయులు

వ్యవసాయమే ప్రధానజీవనాధారముగా గల భారతభూమి వంటి దేశములో ప్రభుత్వమువారొక 'వ్యవసాయాభివృద్ధి విధానము'ను నిర్ణయించి అనుసరించవలెనని ప్రత్యేకముగా నొక్కి వక్కాణింపవలసిన యగత్య మేర్పడుట వింత విపరీతవిషయముగా తోచవచ్చును. వ్యవసాయదారుని దారిద్ర్యావస్థను తొలగించుటయు, వ్యవసాయోత్పత్తియొక్క హీనస్థితిని తొలగించుటయును ప్రధాన సమస్యలై యున్నవి. ఈ సమస్యలను సమర్థముగా పరిష్కరించవలెనంటే, సర్వవిషయసమన్వయకరమైన, సవ్యమైన వ్యవసాయాభివృద్ధివిధానమును నిర్ణయించుట అత్యంతావశ్యకము. ఇతర సమస్యలన్నింటికంటె దీనికి ప్రథమస్థానము, అగ్రస్థానము యివ్వక తప్పదు. ఇంతవరకును ఈ వ్యవసాయాభివృద్ధివిషయములో ఎప్పటికేది తోచితే ఆ ప్రకారముగా వ్యవహరించుచు, వెర్రివాని చేతి రాయివలె కొన్ని పథకములను అమలుజరుపుచున్నారు. కాని, యీ యనుచిత సమయస్ఫూర్తిపద్ధతిని విరమించవలెను. నిజపరిస్థితులను గూర్చిన విషయవివరములను సమగ్రముగా, శాస్త్రీయముగా పరిశోధించి కార్యక్రమమును ఉపక్రమించవలెను.

ఇప్పుడు ఏ లక్ష్యముతో, ఏ వ్యవహారవిధానమును అనుసరించవలసినదిగా మనము ప్రభుత్వమువారిని కోరవలసియున్నది! ప్రజల కోరికలనుబట్టియే ప్రభుత్వవ్యవహార విధానములు ఎప్పటికైనను ఎట్టకేలకు నిర్ధారణ కాగలవు. నిత్యకృత్యపరిపాలనానుభవములోను, శాసన నిర్మాణకాండలోను క్రమక్రమముగా, సవిస్తరమైన విషయవివరములతో కూడి వ్యవహారవిధానమునకొక ఆకారస్వరూపము ఏర్పడుచుండును. కాని, చిట్టచివరకు యీ విధముగా తయారయిన వ్యవహార పథకములోని కొన్ని చిల్లర అంశములను ప్రజలు స్వీకరించుట గాని, నిరాకరించుటగాని జరుగును. కాబట్టి వ్యవహారవిధానమనునది ప్రజాభీష్టమనెడి ప్రాతిపదిక మీదనే నిర్మాణము కావలసియున్నది. ప్రజాభీష్టమే ప్రభుత్వ సంకల్పమునందు ప్రతిబింబితమగుచుండెడియెడల, ప్రజల కోరిక లెట్టివో నిర్ణయించి నిరూపించుటయే ప్రశస్తమైన పరిశోధనమార్గము. గ్రామవాసియైన రైతుకోరికలను, పట్టణములలోను, నగరములలోను నివసించు బస్తీప్రజల కోరికలను ఎట్లున్నవో, తమకు ప్రభుత్వమువారు ఏ విధమైన మేలు చేయవలెనని వారు కోరుచున్నారో పరిశీలించవలసియున్నది.

రైతుల కోరికల నిర్దేశ్యటకు ఆయా కాలములందు ప్రభుత్వమువారు ఏ రీతిగా, ఏ విధమైన ప్రయత్నము చేసియుండిరో మనము పరిశోధించుటవల్ల రైతులు కోరిన కోరిక లెట్టివో మనకు బోధపడగలవు. ౧౯౪౭ ఆగస్టు ౧౫ తేదీని బ్రిటిష్‌వారు మన దేశమును మనకే విడిచిపెట్టి వెళ్లినప్పుడు వారి తాపత్రయావస్థలోనే మనలను కూడ నిమగ్నులను చేసి వెళ్లిరి. బ్రిటిష్‌వారు తమ వలసరాజ్యాల సంపదను స్వలాభప్రయోజనములకై వినియోగించుకొనుటకై సర్వదా తాపత్రయపడుచుండిరి. దేశములో శాంతిభద్రతలను కాపాడి ప్రజలలో అశాంతిని అణచివేయుటకై తాపత్రయపడుచుండిరి. అందువల్లనే ప్రజలు తమ ఆర్థికాభ్యున్నతికై సాగించుచుండిన ఉద్యమములను బ్రిటిషువారు అణచివేయుచుండిరి.

అట్టి పరిస్థితిలోకూడా భూస్వామ్యసంస్కరణమునకును, ఋణవిమోచనమునకును సంబంధించిన కొన్ని శాసనములు అమలులోనికి వచ్చుటయును, అప్పటప్పటికి పరిపాలనయందు యీ సంస్కరణభావములు పరిస్ఫుటమగుటయును సంభవించెను. ఈ రాష్ట్రములోని అమరకపు పద్ధతిలో కొన్ని మార్పులు వచ్చినవి. ఇంకా కొన్ని మార్పులు సంకల్పింపబడియున్నవి. ఆర్థిక మాంద్య దినములలో ఋణవిమోచనచట్టమొకటి చేయబడెను. వ్యవసాయఫలసాయవస్తువులకు స్థిరమైన ధరలను నిర్ణయించుటకు కొన్ని ప్రయత్నములు జరిగెను. ఇవన్నియును పరిశీలింపదగిన అంశములే. అన్యదేశీయుల ప్రభుత్వములో ప్రజల మాట సహజంగా చెలామణీ కాదు. మన భవిష్యత్తును నిర్ణయించగల స్వపరిపాలనయందు చెలామణీ ఐనట్లుగా పరరాజుల ప్రభుత్వములో కాదు. అందువల్ల ౧౯౪౭ ఆగస్టు ౧౫ తేదీ వరకును పరిష్కారము కాకుండా ఉన్నటువంటి అనేకసమస్యలు ఇప్పుడు ప్రధానాంశములుగా పైకి వచ్చినవి. జమీందారీలు రద్దు కావలెననియు, భూమికమతపద్ధతిని క్రమబద్ధ మొనర్పవలెననియు, పంటసరకుల ధరలను హెచ్చుస్థాయిలో నుంచుటకు

భూస్వాములు బాధ్యత వహింపవలె ననియు, గ్రామజీవితమును సుఖప్రదముగా, శ్రేయస్కరముగా సౌకర్యవృద్ధిలోనికి తీసికొనిరావలె ననియు జరుగుచుండిన ఆందోళన అంతకంతకు ఎక్కువై యీ కోరికలు వెంటనే సిద్ధింపవలె నను పట్టుదల ప్రబలమగుచున్నది. ఈవిధమైన ఆందోళన లన్నింటియొక్క ముఖ్యోద్దేశ మేమనగా, గ్రామంలో జీవించేవానికి జీవితము సుకరముగా ఉండవలెననియే. గ్రామము వాసయోగ్యముగా ఉండవలెను. జీవితానికి ముఖ్యముగా మూడు ప్రధానావసరములు కలవు—అన్నము, వస్త్రము, ఆవాసము. ఈ మూడింటిని ప్రజావసరములకు చాలినంతగా సమకూర్చుటయే ప్రభుత్వకర్తవ్యము. జీవితమునకు ముఖ్యమైన యీ మూడు అవసరములను సమకూర్చుకొనుటకై పాటుపడుటకు సిద్ధముగా నున్న ప్రజలకు కూడా వాటిని లభింపజేయలేకపోవుట అతివిషాదకరమైన దేశదౌర్భాగ్యము. ఈ జీవితావసరములను ప్రజలకు లభింపజేయుట కొరకై ప్రభుత్వమున్ను, ప్రజలున్ను సకలవిధముల కృషి చేయవలసి యున్నారు.

పైచెప్పిన ప్రధానజీవితావసరత్రయముమాత్రమేగాక, ఇతర అవసరములనుకూడా మరికొన్నింటిని తీర్చవలెను. మన దేశప్రజానీకమునకు వైద్యసహాయము అత్యంతావశ్యకమైయున్నది. వైద్యశాస్త్రశిక్షణ పొందిన వైద్యులు గ్రామములలో కరువైయున్నారు. ప్రజారోగ్యశాఖవారు వ్యాధినివారణకార్యములకై నియమించెడి సిబ్బంది దేశమునకు తగినంత లేదు. అందువల్లనే అంటువ్యాధులు తరచు ప్రబలి వేలకొలదిగా జనులు మరణించుచున్నారు. కాబట్టి సవ్యమైన వ్యవసాయాభివృద్ధిపథకములో వైద్యసహాయము ప్రధానాంశముగా పరిగణింపదగియున్నది.

గ్రామస్థులకు గ్రామములను ఆవాసయోగ్యములుగా చేయు నిమిత్తమై చక్కని రస్తాలు, రాకపోకలకు, వార్తలకు సౌకర్యములు ఎక్కువగా చేయవలెను. అందువల్ల గ్రామస్థుడు పండించెడి పంటసరకులకు ప్రక్కబస్తీలలో మంచి ధర లభించును. తద్వారా అతని ఆర్థికస్థితి బాగుపడును. అదిన్నిగాక బస్తీలలో నివసించే వారికి చక్కని రోడ్లు, బండ్లు వగైరా సౌకర్యము లుండుటవల్ల, గ్రామస్థునకు అవి లేకపోవుటవల్ల గ్రామస్థుడు తన దుస్థితిని చూచుకొని నిరుత్సాహి యగుచున్నాడు.

మానవునకు కావలసినది భుక్తిమాత్రమే కాదు. భుక్తి లభించిన తర్వాత జ్ఞానపిపాస కలుగుచుండును. మన దేశములో నూటికి ౮౫ వంతుమంది గ్రామాలలో నివసిస్తున్నారు. ప్రభుత్వమునకు వసూలయ్యెడి శిస్తుల ఆదాయమంతా గ్రామాలవల్లనే లభించుచున్నది. అటువంటి గ్రామాలలో పాఠశాలలు అత్యల్పముగా నున్నవి. ఉన్న పాఠశాలలైనను అధ్వాన్నముగా ఉన్నవి. గ్రామస్థులు తమ పిల్లలు తమ వ్యవసాయకార్యములకును, యితర వృత్తివ్యాపారములకును అక్కరకు వచ్చి ప్రయోజకులు కావలెనని కోరుచుందురు. రాజకీయవ్యవహారజ్ఞానము, సంఘసంప్రదాయజ్ఞానము కలిగి వృద్ధిలోనికి రావలెనని కోరుచుందురు. పల్లెలలోని ప్రజలు తమ నిత్యకృత్యవ్యాపారాలు చేసికొనుచు ఇతరలోకవ్యవహారాలు, అనేకసద్విషయములు తెలిసికొనవలె నని కుతూహల పడుచుందురు. అందుకొరకైన గ్రంథములను లభింపజేయగల గ్రంథాగారములు—స్థావరంగా ఉండేవి, జంగమంగా (సంచారం చేస్తూ) ఉండేవి చాలా అవసరము.

పల్లెవాసుల సుఖజీవితమును వర్ణించుచు మనోహరముగా కవులు కథ లల్లవచ్చును. కాని, నగరవాసుల జీవితములో గల హుషారుగాని, ఉత్సాహముగాని గ్రామవాసులకు లేదు. గ్రామస్థులకు చక్కని వినోదప్రదర్శనములను, సత్కాలక్షేపములను ఏర్పాటు చేయవలెను. రేడియోలు దేశంలో వ్యాప్తిలోనికి వచ్చినవి. గ్రామాలలో కూడ విశేషంగా వెలసినవి. కాని, గ్రామస్థులకు సహజానందకరములైన జానపదగేయములను, కోలాటములు వగయిరా సాముదాయిక బృందగాన నృత్యములను ఎక్కువగా ప్రోత్సహించవలెను. అట్టివి గ్రామస్థుల సహజప్రకృతిని వ్యక్తీకరింప జేయగల్గి వారికి ఎక్కువ ఆకర్షణీయమైనవి. ఇట్టి వినోదకాలక్షేపముల మూలముగా గ్రామజీవితములో కళావికాస మేర్పడగలదు.

మరొక ముఖ్యవిషయ మేమనగా, తమ కొక హోదా వహించగల తాహతున్ను, జీవితములో ఉన్నతస్థాయియున్నూ కలదనే భావము ఏర్పడినతప్ప వారిలో ఆత్మగౌరవము వృద్ధికాదు. గ్రామస్థుడైనవాడు తాను కూడా దేశమునకు అక్కరకు రాగలనని గ్రహించవలెను. అట్టి ఆత్మపరిజ్ఞానాభివృద్ధివల్ల దేశమునకు అక్కరకు రాగల పౌరుడై, నాయకవీరుడై పెంపొందగలడు. తానొక వర్గమునకు నాయకత్వము వహించి, పెద్దరికము సంపాదించవలె ననే కుతూహలము గ్రామస్థునకుకూడా కలుగును. అట్టి వ్యవహారాధిపత్యావకాశములను గ్రామస్థులకు కల్పించుట కూడా వ్యవసాయాభివృద్ధివిధానమునకు అవసరము.

పైచెప్పిన సదుపాయాభివృద్ధుల నన్నింటిని గవర్నమెంటువారే పూనుకొని చేయవలెనని వాదింపజాలము. ప్రజలకు ఎక్కువ ద్రవ్యార్జనావకాశములను, ఎక్కువ తీరికకాలమును లభింపజేయవలెను. ప్రభుత్వమువారీ పనిని నెరవేర్చిన చాలును. ప్రజలు తమ జీవితసౌఖ్యమును పెంపొందజేసికొనుటకు తగిన అవకాశములను కల్పింపవలెను. ఈ పనిని ప్రభుత్వమే నెరవేర్చవచ్చును. లేదా అన్యథా నెరవేరునట్లు చేయవచ్చును. అట్టి గ్రామాభ్యుదయకరఉద్యమములో ప్రజలే పాల్గొనుటకు అవకాశమును కల్పించినను కల్పించవచ్చును.

హాలికుని జీవితము హాయియైన దని సత్కవు లెంత పసందుగా వర్ణించి చిత్రించినప్పటికీ, దుర్భరదారిద్ర్యఋణబాధలవల్ల రైతు జీవితము విషాదభరిత మగుచున్న దను మాట ప్రత్యక్షనిదర్శనముగా

నున్నది. గ్రాసవాసోదైన్యంబు లతనిని వెంటాడుచున్నవి. అన్న వస్త్రములకుకూడా తగినంత జీవనాధారము లేని రైతు తన పశువులతోబాటు ఒక్కచే పాకలో కాపురము చేయుచున్నాడు. అశుభ్రతకు, మాలిన్యమునకు నిలయమైన గ్రామవాసము అనేకఅంటు వ్యాధులకు ఆటపట్టగుచున్నది. అవి నివారింపదగిన వ్యాధులే యైనను వైద్యసహాయము లేనికారణమున ప్రజలు విపరీతముగా మరణించుచున్నారు. బస్తీలకు, గ్రామాలకు మధ్య రాకపోకల కనువైన రహదారీలు లేవు. వర్షాకాలంలో ఒక్కొక్క పల్లెటూరు చేరుటకు వారములకొలది అవస్థపడి ప్రయాణం చెయ్యాలి. అందువల్ల పల్లెలకు, పట్టణములకు సన్నిహితసంబంధము ఏర్పడుట లేదు. బయటిలోకంలో ఎన్నిమార్పులు వచ్చినప్పటికీ, రైతు అజ్ఞానావస్థలోనే ఉంటున్నాడు. అక్షరజ్ఞానం లేక, లోకజ్ఞానంలేక రైతు తన దురవస్థ తనకు తప్పనది కాదని విరక్తి చెందుచుండును.

వ్యవసాయాభివృద్ధి విధానమునకు ప్రాతిపదికావసరములనుగూర్చి ఇంతవరకు మనము విమర్శించితిమి. అయితే, వ్యవసాయదారును యీరీతిగా ఉద్ధరించుటవల్ల దేశానికి, జాతికి ఏవిధమైన లాభ ప్రయోజనములు కలవో యోచించవలెను. గ్రామసుధుకూడా భారతదేశపారుడేగనుక వృద్ధిలోనికి రావలెననే విషయ మట్లుండగా, వృద్ధిలోనికి వచ్చిన ప్రసిద్ధపరిశ్రమలతో సమానముగా మన వ్యవసాయముకూడా ఉచ్చదశలోనికి రావలెను. వ్యవసాయం హీనస్థితిలో ఉన్నట్లయితే మన జాతికి అటువంటి దౌర్భాగ్యవ్యవసాయం మెడ కొక బండ కట్టినట్లుగా ఉంటుంది. మన వ్యవసాయం వృద్ధిలోకి వస్తే మనజాతి వృద్ధిలోకివస్తుంది. ఈ ధర్మసూత్రమును ముందువెనుకలుగా త్రిప్పిచెప్పుటకు వీలులేదు. కనుక గ్రామాలలోని జనసామాన్యజీవితాభ్యుదయము జాతీయపురోభివృద్ధికి కీలకమై యున్నది. కనుక పైజెప్పిన సదుపాయసౌకర్యములు గ్రామస్థులకు లభ్యము లగునట్టు ఏ పరిస్థితులు కల్పింపబడెనో పరిశీలించవలసి యున్నది.

౧౯౪౧ సం. జనాభా లెక్కలనుబట్టి మద్రాసురాష్ట్రిజన సంఖ్య ౪,౯౦,౦౦,౦౦౦ పైగా ఉన్నది. వీరిలో ౬౨,౭౫,౦౦౦ మంది పట్టణవాసులు. ౪,౧౪,౬౭,౦౦౦ మంది గ్రామవాసులు. సాలీనా ౫ లక్షలు చొప్పున ఈసంఖ్య వృద్ధియగుచున్నది. ఈ జనాభా లెక్కలను పరిశీలించిచూడగా, వెయ్యింటికి ౪౪౫ మంది జనులకు సొంతవృత్తివ్యాపారములు లేవు. జీవనోపాధి కలిగిన తదితరులమీద వీరు ఆధారపడియున్నారు. వెయ్యింటిలో మిగిలిన ౫౫౫ మందిలో ౨౬౦ మంది వ్యవసాయము చేసుకొని జీవించుచున్నారు. ౮౮ మంది యంత్రాగారపరిశ్రమలలోను, వర్తకవ్యాపారములలోను, రహదారీ బండ్లమీదను పనిచేసి జీవించుచున్నారు. ౧౧ మంది ఉద్యోగాలవల్ల జీవించుచున్నారు. మిగిలిన ౧౯౬ మంది యితరవృత్తులవల్ల జీవించుచున్నారు. ౧౯౩౧ సం.పు లెక్కలను బట్టి నూటికి ౬౧ మంది చొప్పున వ్యవసాయమే జీవనాధారముగా కలవారుండిరి. ౧౯౪౧ సం. లో యీసంఖ్య నూటికి ౭౪ వంతులకు హెచ్చెను. ఈ వ్యవసాయవృత్తిలో కూడా వెయ్యిమందిలో ౪౩౯ మంది వ్యవసాయకూలీలుగా నున్నారు. ౩౯౦ మంది స్వంతసాగుబడి చేసికొనే భూఖామందులుగా నున్నారు. ౧౨౦ మంది కవులుదార్లుగా నున్నారు. ౩౪ మంది సొంతసాగు చేయని ఖామందులుగా నున్నారు. ౧౭ మంది సొంత సాగు చేయని కవులుదార్లుగా ఉన్నారు. కాబట్టి వ్యవసాయకూలీల సంఖ్య అత్యధికముగా కన్పించుచున్నది. సొంతసాగు చేసెడి భూఖామందులను కూడా చేర్చి లెక్కించేయెడల నూటికి ౭౦ వంతులకుపైగా వ్యవసాయములో నిమగ్నులైయున్నారని లెక్క తేలుచున్నది. చాలామట్టుకు భూఖామందులే సొంతసాగు చేసికొనుచున్నారు. అట్టివారి భూవసతులు చిన్నవై యున్నవి. సగటున ఒక్కొక్క ఆసామి భూవసతికి ఇద్దరు చొప్పున వ్యవసాయము చేయుచున్నారు. భూఖామందున్నూ, ఒక వ్యవసాయకూలీయున్నూ కలిసి ఇద్దరు చొప్పున సాగుచేయుచున్నారని అర్థము. ఈ లెక్కలనుబట్టి చూడగా సొంత సాగు చేయక గైరుహాజరైయుండు భూస్వాముల మూలముగా అనర్థము లేవో విపరీతముగా ఉన్నవని ఊహించుచున్నంతగా అవి లేవని బుజువగుచున్నది. డెల్టాజిల్లాలలో గైరుహాజరు భూస్వాములు కొందరు కలరు. రాష్ట్రమంతటను అనేకప్రాంతాలలో అనేక ఉద్యోగవ్యాపారములందు విస్తరించి యున్నటువంటి వ్యవహారవేత్త లందరును యీ డెల్టాజిల్లాలనుండి వచ్చినవారే. అదిన్నీగాక డెల్టాజిల్లాలలోని భూములను కొని ద్రవ్యమును పెట్టుబడి పెట్టేవానికి అది చాలా భద్రకరమైన పెట్టుబడిగా ఉంటున్నది.

మద్రాసు రాష్ట్రమునందు గల రైత్వారీ ప్రాంతమంతటిలో ౨,౬౭,౩౯,౫౦౪ యకరములు సాగు అగుచున్నవి. ఈ భూమి ౭౨, ౬౫,౧౦౩ పట్టాదారులకు విభాజ్యమైయున్నది. మొత్తము పట్టాలు ౭౭,౮౯,౮౨౪ కలవు. కనుక యీ పట్టాదారులలో నూటికి ౯౪ వంతు పట్టాదారులకే మొత్తం సాగుబడి భూమిలో మూడింట రెండు వంతుల వరకు చెందియున్నది. వీరిలో ఒక్కొక్కరు రూ. 30 లకంటె తక్కువ శిస్తు చెల్లించువారైయున్నారు. వీరిలో ఒక్కొక్కరికి ఉండే భూవసతి ౭౩ సెంట్లు మొదలుకొని ౭ యకరముల ౫౭ సెంట్లవరకు కలదు. కాబట్టి యీ రాష్ట్రములో చాలామంది ఆసాములకు గల భూవసతులు చాలా చిన్నవగుటవలన అవి లాభదాయకమైనవి కావు. అట్టి భూవసతులవల్ల వచ్చే ఫలసాయము ఆ భూస్వామి కుటుంబపోషణకే చాలదు. అతని పశుగ్రాసానికిన్నీ చాలదు.

గత పదేండ్లలోను మొత్తము భూవసతులలో ౧౯,౨౨,౫౪౭ ఎక్కువైనవి. వాటిని బట్టి చూడగా ఇదివరకున్న భూవసతులే మరింత చిన్న ఖండములుగా విభాగమైనవని తెలియుచున్నది. ఈ

రీతిగా భూవసతులు చిన్న చిన్నవిగా చీలిపోవుట నిరంతరముగా సాగుచున్నది. రూ. ౧౦౦ లకు పైగా భూమిశిస్తును చెల్లించెడి భూవసతులు ౫౯,౬౪౦ వరకు గలవు. మొత్తము సాగుబడిభూమిలో నూటికి ౧ వంతు మాత్రమే ఇట్టి భూవసతులు కలవు. అట్టి భూవసతుల వైశాల్యము ౪౦ యకరముల మొదలు ౩౦౫ యకరముల వరకు ఉండును. అట్టి భూవసతుల సగటు వైశాల్యము ౬౩ యకరములు మాత్రమే. వీరే మనరాష్ట్రములోని పెద్ద భూస్వాములు.

మన దేశములోని అనేక ప్రాంతములలో పైజెప్పినరీతిగా భూవసతుల విభాగము జరుగకుండా నిరోధించుటకు అనేక విధములుగా ప్రయత్నింపబడెను. కాని, అందువల్ల విశేషఫలిత ప్రయోజనములు కల్పించలేదు. ప్రజలకు యితరవిధములైన ద్రవ్యసంపాదనమార్గములను మనము చూపించలేనంత కాలము యీ వ్యవసాయ భూవసతుల విభాగమును అడ్డగింపజాలము. కనుక, భూమిమీద ఆధారపడియుండెడి జనసంఖ్యాభారమును తగ్గించగల్గునట్లుగా మన ఆర్థిక విధానమును నిర్ణయించవలెను. భూస్వామికి గిట్టుబాటుగా ఉండేటటువంటి వైశాల్య పరిమితిలో అతని భూవసతి యుండునట్లుగా చేయవలెను. భూవసతుల వైశాల్యపరిమితిని ఆ రీతిగా వృద్ధిచేయవలెను. రాష్ట్రములోని ఏ ప్రాంతములో ఎంత భూవసతి ఉన్నట్లయితే గిట్టుబాటుగా ఉండునో ఆయా ప్రాంతపరిస్థితులనుబట్టి నిర్ణయించవలెను. పెద్ద పెద్ద వ్యవసాయఖండములను ఏర్పాటుచేసినట్లయితే, అందుమూలముగా వ్యవసాయకూలీలలో చాలామందికి పని లేకుండాపోవును. వ్యవసాయంలో ఎంతమంది జనానికి మాత్రమే సవ్యంగా పని కల్పించవలెనో అంతమందికిమాత్రమే మనము పని కల్పించే యెడల ౧,౫౫,౦౦,౦౦౦ మందికి ఇంకా మనము పని చూపవలసియుండునని ప్రొఫెసరు తార్లోక సింగుగారు "దారిద్ర్యము-సంఘపరివర్తనము" అనే గ్రంథములో వ్రాసిరి. ఇప్పుడు వ్యవసాయకార్మికులుగానున్న మొగవారిలో నూటికి ౭౫ వంతు మందికి ఇతరత్రా పనిపాటలను చూపవలసి యుండును. ఇది చాలా బ్రహ్మాండమైన పని.

ఇంతమంది జనాన్ని వ్యవసాయసంబంధమైన పనిపాటలలో నుండి తొలగించుటవలన వారినందరిని నిర్వ్యాపారులనుగా చేయుచున్నామనే భయము మనకు ఉండనక్కరలేదు. ఇంతమంది జనం యీ వ్యవసాయపు పనులలో ఉండుటవల్లనే వారికి ఆర్జన తక్కువగా ఉంది. వారిలోనే చాలామందికి చేతినిండా పని లభించుటలేదు. కనుక ఆవిషయమై మనము భయపడనక్కరలేదు. ఒకవైపున వ్యవసాయవిధానాభివృద్ధికై మనము కృషిచేయుచు, మరొకవైపున యంత్రాగారపరిశ్రమల అభివృద్ధికి కూడా కృషిచేయవలెను. భారీ ప్రమాణంలోగాని, కొద్ది ప్రమాణంలోగాని వస్తూత్పత్తి చేయగల పరిశ్రమలయందును, రోడ్లు వేయుట, కాల్వలు త్రవ్వుట మొదలైన పనులలోను, విద్యాలయములలోను యీ జనానికి పని కల్పించవలెను.

మన దేశమునకు కావలసిన ముఖ్యావసరములయిన వస్తువులన్నియూ మనకు లోటుగానే యున్నవి. కనుక వ్యవసాయాభివృద్ధినీ, పరిశ్రమాభివృద్ధినీ పరస్పరాశ్రయముగా కొనసాగించిన యెడల, కొన్ని సంవత్సరముల వరకును, కొన్ని దశాబ్దముల వరకును మన దేశములో నిర్వ్యాపారత్వము ఉండజాలదు. మీదు మిక్కిలి మన కృషి వాణిజ్య పరిశ్రమలలో పనిచేయుటకు తగినంత మంది మనుష్యులు లేరనెడి కొరత కన్పింపగలదు. సోవియట్ రష్యాలో విప్లవము మొదలుకొని ౧౯౪౦ సం. వరకు గడచిన చరిత్రను చదివి చూచినట్లయితే పై జెప్పిన విషయమును నిర్భయముగా నమ్మవచ్చును.

౧౯౧౭ సం.లో రష్యాలో జరిగిన దేశాభ్యుదయముకంటె ఎక్కువ పురోభివృద్ధి మనదేశములో జరుగవలసియున్నది. ప్రజలకు కావలసిన ఇండ్లుగాని, రోడ్లుగాని మన గ్రామాలలో చాలా తక్కువగా ఉన్నవి. గ్రామాలకు కావలసిన రస్తాలను, జనవాసములను నిర్మించుటకు ఎంతమంది ఇంజనీర్లు, ప్రవీణులు కావలెనో, ఎంత కట్టడపు సామాను కావలెనో, ఎన్ని పరిశ్రమాగారములకు పని కల్పింపబడునో లెక్కవేసి చూడండి. కాబట్టి వ్యవసాయకార్యములలో నిమగ్నులైయున్న జనులను యితర కార్యములలోనికి మరల్చుటవల్ల ప్రజాదాయము అపారముగా వృద్ధికాగలదు. అమెరికాసంయుక్తరాష్ట్ర ప్రభుత్వము యొక్క బడ్జెటువ్యవహారమండలికి చెందిన ప్రొఫెసరు లూయీబీన్ గారు యిటీవల ప్రకటించిన ఒక రచనలో యిట్లు వ్రాసిరి:

"చైనాలోను, ఇండియాలోను ఆహారపదార్థములను ఉత్పత్తి చేయుటయందు నిమగ్నులైయున్న కార్మికజనంలో నూటికి ౧౫ వంతుమందికైనను ఇతరవృత్తివ్యాపారములలోనికి మరల్చినట్లయితే, ఆ దేశాలలో సగటున మనిషి ౧-కి లెక్కతేలుచున్న ద్రవ్యసంపాదన రెండింతలుగా వృద్ధికాగలదు. దేశములోని జనాంగబలమున్ను, సమాజవస్తుసంపదయున్ను అందువల్ల ఎక్కువ సద్వినియోగము కాగలవు."

వ్యవసాయవిధానముయొక్క అంతర్భాగంగా పరిశ్రమాభివృద్ధికూడా కొనసాగినట్లయితే, వ్యవసాయములో అదనముగానున్న జనమును పరిశ్రమలలోనికి ఆకర్షింపవచ్చును. అప్పుడు ఆసాములకు ఉండదగిన వ్యవసాయభూవసతుల గరిష్ఠ కనిష్ఠ పరిమితులను మనము నిర్ణయింపవచ్చును. వ్యవసాయములో నిమగ్నులైయున్న జనములో మితిమీరియున్న వారిని పరిశ్రమలలోనికి మరల్చుట ముందుగా జరుగవలెను. ఆ పని జరుగక పూర్వమే భూస్వామికీ, రైతుకూ ఉండేటటువంటి పరస్పర హక్కుస్వాతంత్ర్యములను సవరించి పరిష్కరింపబూనుకొనుట తరుణమురానికే తొందరపడి చేసెడి పని యగును. ఆహారధాన్యములకు ఎంతభూమి సాగుకావలెనో, వ్యాపారార్థమైన పంటలకు ఎంత భూమి సాగుకావలెనో మనము నిర్ణయించవలసియున్నది.

విదేశీయులు మన దేశమును పరిపాలించినంతకాలమును తమ వ్యాపారావసరములకు కావలసిన పంటసరకులను ఎక్కువగా యీ దేశములో ప్రోత్సహించుచుండిరి. అందుమూలముగా యీ దేశములో గతదశాబ్దములో ౭౦ లక్షల యకరములు ఆహారధాన్యముల సాగుబడిలోనుంచి వ్యాపారసరకుల పంటల సాగుకై మార్చబడెను. ఈరీతిగా వ్యాపారసరకు సరకులను ఎక్కువగా పండించుటవల్ల దేశములో ప్రజలకు చాలినంత ఆహారధాన్యములు లభించుటలేదు. తినుటకు తగినంత ధాన్యం లేదు. వాటిని కొనుక్కొనుటకు తగినంత ద్రవ్యంకూడా ప్రజలకు లేదు. మన వ్యాపారసరకు పంటసరకులను పండించుట తగ్గించేయెడల ఇతరదేశాలకు రవాణాచేసి మనము సంపాదించగల ద్రవ్యమున్నూ, ఆ ద్రవ్యముతో విదేశాలనుండి తిరిగి మనకు కావలసిన సరకులను దిగుమతి చేసికొనుటయున్నూ ఉండదు. ముఖ్యముగా విదేశాలనుంచి యంత్రసామగ్రులను మనము తెప్పించుకొనుటకు కావలసిన రొక్కము విదేశీయద్రవ్యమారకంలో లభించదు. కాబట్టి ఏ రకపు పంటసరకులలో ఎవరెంత పంట పండించుట అవసరమో, ప్రస్తుతము ఎంత పండించుచున్నామో, ఎక్కువగాని, తక్కువగాని ఎంత ఉన్నదో లెక్కలు చూచి ఆయా పంటల విషయములో మనము సవ్యమైన పరిమితులను నిర్ణయించవలెను. మన దేశములోని పంటలనుగూర్చి సరియైన, నికరమైన లెక్కవివరములు మనకు లేనందువల్ల పైరీతిగా ఆయా పంటల సాగుబడిని గ్రహించుటకు నిర్ణయములు చేయుట మన కంతగా సులభమైన పని కాదు. ఆయా డిపార్టుమెంట్లవారు మనకు సమర్పించెడి లెక్కలు ఎంత మాత్రమూ మనకు ఆధారప్రమాణములుగా లేవు. అన్నింటికన్న ముఖ్యముగా కొంతమంది సమర్థులైన యువకులను తగిన సాధనసంపత్తితో గ్రామాలలో మెండలుపెట్టి లెక్కల జాబితాల నన్నింటిని తయారు చేయుటకు ముఖ్యముగా జరూరుగా సంఖ్యాసేకరణడిపార్టుమెంటు నొకదానిని చక్కగా ఏర్పాటు చేయవలసియున్నది. వ్యవసాయ ఆర్థికవ్యవహారశాఖకూడా ఒకటి ఏర్పాటుకావలెను. పైచెప్పిన సంఖ్యాసేకరణశాఖతో అది సహకరించి పనిచేయవలెను. ఈ వ్యవసాయార్థికశాఖవారు పంటసరకుల ఉత్పత్తినిగూర్చియు, వాటి విక్రయవ్యాపారపరిస్థితులనుగూర్చియు, వ్యవసాయదారుల యొక్కయు కార్మికులయొక్కయు ఆర్థికపరిస్థితినిగూర్చియు, వీరు ఉభయులకుగల సంబంధముల గూర్చియు, మొత్తముమీద గ్రామజీవితమును గూర్చియు పనిచేయవలెను. ఆయా పంటసరకులకుతగిన వ్యాపారరంగములను గూర్చియు, వాటి సరఫరాలనగూర్చియు లెక్కవివరములను పోగుచేసి క్రోడీకరించి సమన్వయించి ప్రచారము చేయవలెను, పంటలనుగూర్చియు, పశుసంపదనుగూర్చియు లెక్కలుతయారుచేయవలెను. ఒక్కొక్క పంటసరకులో ఎన్నెన్నిరకము లున్నవో నిర్ణయించి వాటికి స్థిరప్రమాణము లేర్పరచవలెను. రవాణా సౌకర్యములనుగూర్చియు, ద్రవ్యపరపతి సౌకర్యములనుగూర్చియు, గిడ్డంగులలో నిలవచేయుటకు తగిన సౌకర్యములనుగూర్చియు, ఆయా పంటసరకులకు గల నూతనావకాశములనుగూర్చియు శ్రద్ధగా పరిశీలించవలెను.

పైచెప్పిన రీతిగా ఉత్పత్తిని నిగ్రహించుటమాత్రమే గాక, ఆయా పంటసరకుల వ్యాపారరంగములనుకూడా కంట్రోలుచేయవలెను. కొనుగోలుదారు చెల్లించెడి ప్రతిరూపాయలోను ఒక అర్ధరూపాయకంటె ఎక్కువగా పంట పండించినవానికి చేరుట లేదు. పంట పండించేవానికి ఈవిధమైన ద్రవ్యప్రాప్తి న్యాయముగా లేదు. కాని, మధ్యవ్యాపారులందరు చాలా ఐశ్వర్యవంతు లగుచున్నారని అర్థము కాదు. ఏమైనప్పటికీ, పంటసరకుల వ్యాపారావకాశములను, రవాణాసౌకర్యాభివృద్ధులనుగూర్చి శ్రద్ధగా పరిశీలించి చేయదగిన అభివృద్ధులను నిర్ణయించవలసియున్నది. చాలవరకు పంట పండించువాడే పంటసరకులను రవాణా చేసి, సరఫరాచేయగలుగునట్లు అవకాశములను కల్పించవలెను. అట్టి సందర్భములోనే అతనికి ఎక్కువ ద్రవ్యప్రాప్తి యుండగలదు.

అటుపిమ్మట పరిష్కరింపవలసిన సమస్య ద్రవ్యపరపతి. భూముల కిమ్మతులు, వ్యవసాయాదాయవ్యయసంబంధము, ఈతి బాధలవల్ల పంటనష్టములు మున్నగు విషయములు చాలా క్లిష్టమైన సమస్యను కల్పించుచున్నవి. వ్యవసాయములో నున్న గొప్ప ప్రమాద మేమనగా, గాలివానలకు నిధపడి పండె మొడ్డి జాడమాడవలసియుండును. మన నదులలో పెక్కింటికి ఇంకను ఆనకట్టలను నిర్మించి, ఆ ప్రవాహజలమును వ్యవసాయమునకై వినియోగించవలసియున్నది. ఇటువంటి ప్రాజెక్టు లనేకములు సంకల్పింపబడియున్నవి. దూరదృష్టిలేని రాజకీయవేత్తలు యీ ప్రాజెక్టులకు అడ్డు తగలకుండా ఉండేటట్లయితే, వ్యవసాయదారులకు సంభవించెడి పెద్ద ప్రమాదాలలో ఒకటి తొలగిపోయినట్లగును. వరదలవల్లగాక అతివృష్టి, అనావృష్టి బాధలవల్లను, పైరులకు సంభవించెడి క్రిమికీటకాదుల పీడలవల్లను, ధరలు పడిపోవుటవల్లను అనేకనష్టములు కలుగుచుండును. పాశ్చాత్యదేశాలలో పంటల నష్టప్రమాదముకు భీమాచేయు పద్ధతి కలదు. అటువంటి భీమావిధానమును ప్రభుత్వమువారే ఏర్పాటుచేసి నిర్వహించవచ్చును. ఈ భీమాపద్ధతిని పదేండ్లపాటు సాగించి చూచినయెడల, అట్టి భీమాను గవర్నమెంటు ఏర్పాటుచేసి నిర్వహించినందువలన గవర్నమెంటుకు నష్టము కలుగదు. పైగా మిక్కిలి దాని మూలముగా వ్యవసాయమునకు చేకూరెడి లాభములు విశేషముగా నుండగలవు. స్వల్పవాయిదా ఋణములు, దీర్ఘవాయిదా ఋణములు వ్యవసాయకార్యములకు కావలెను. ఆవిషయమై వ్యవసాయదారులు నిరంతరము ఘోషించుచునేయున్నారు.

మన దేశములో వడ్డీవ్యాపారస్థులకడ్డ ఋణములు చేయుటవలన చిరకాలమునుండియు వ్యవసాయదార్లు అనేక యిక్కట్ల పాలగుచుండిరి. వడ్డీవ్యాపారము ఎక్కువ గిట్టుబాటుగా నుండుటవల్లనే ధనవంతులు తమ ద్రవ్యమును పరిశ్రమలలోను, బ్యాంకుల

లోను పెట్టుబడి పెట్టుటకు సిద్ధపడుటలేదు. ఏ విధమైన నష్టప్రమాద భయమూ లేకుండా వ్యవసాయదారుకు అప్పు ఇచ్చేవానికి ఎక్కువ వడ్డీలాభము గిట్టుబడి యగుచుండగా, ఇంతకంటె తక్కువ వడ్డీ వచ్చెడు (లాభ సంస్థల) గల వ్యాపారపు కంపెనీలలో పెట్టుబడిదారులు తమ ద్రవ్యమును ఎందుకు వినియోగించవలెను? బ్యాంకులలో తమ ద్రవ్యమును దాచుకొన్నట్లయితే, అతనికి వచ్చేది చాలా స్వల్పమైన వడ్డీమాత్రమే. కనుక బ్యాంకులలో ఎందుకు దాచుకోవలెను? పరిశ్రమలను భారీ ప్రమాణంలో వృద్ధిచేసేయెడలను, బ్యాంకులలో ద్రవ్యమును నిల్వచేసికొను అభ్యాసమును ప్రజలలో సాంప్రదాయముచేయదలచిన ప్రయివేటు అసాముల వడ్డీవ్యాపారము అక్రమవ్యాపార మని శాసింపవలసియుండును. దేశంలో ధరలు విపరీతంగా తగ్గిపోయి ఆర్థిక మాంద్యము ఏర్పడిన రోజులలో ప్రయివేటు అసాములు కాకుండా పబ్లిక్ సంస్థలే ప్రజలకు అప్పు ఇచ్చియుండినట్లయితే ఆ రోజులలో పరిస్థితులు అధ్వాన్నంగా, యథేష్టంగా పరిణమించియుండెడివి కావు. వ్యవసాయమును, వ్యవసాయదారుని కాపాడుటకై పరిస్థితులు విషమించక పూర్వమే ప్రభుత్వమువారు కొన్ని వ్యవహారపద్ధతులను విధిగా అవలంబించి అమలుపరచి యుండెడివారు, వ్యవసాయదారులకు కావలసిన అప్పుల నిచ్చి యితర అవసరములను తీర్చుటకు సహకారసంఘములద్వారా పనిజరుగుటయే ప్రశస్తమని అనుభవమువల్ల బోధపడినది. కాబట్టి వ్యవసాయాభివృద్ధి విధానమునందు యీ సహకారసంఘములు సహజముగా చాలా ప్రాముఖ్యమును వహింపగలవు. మన మెరిగియున్నంతలో భూములకు, పంటసరకులకు ధరలు మందగించుట, ధరలు హెచ్చుట, ధరలు విపరీతముగా పెరిగి మిన్నుముట్టుట జరిగినది. ధరలు పెరుగుచున్నప్పుడు ముందు వెనుకలు చూచుకొనకుండ కేవలం సరిగా హెచ్చుధరలకు వ్యవసాయదారులు భూములను కొనుట ప్రారంభించెదరు. ఆటుతర్వాత ధరలు పడిపోయినప్పుడు, కొత్తభూములను కొనుటకై తెచ్చిన అప్పులను తీర్చునిమిత్తము పూర్వార్జితభూములనుకూడా అమ్మివేయవలసివచ్చినారు. వ్యవసాయదారులకు కేవలమైన పరపతి సంఘములు అవలంబించవలె వ్యవహారపద్ధతులనుబట్టి భూముల కిమ్మతులవిషయములో కొన్ని స్థిరప్రమాణము లేర్పడగలవు. వ్యవసాయభూముల యొక్క పంటఫలసాయమునుబట్టియు, పంటధరలను బట్టియు సదరుభూముల కిమ్మతును నిర్ణయించేయెడలను, తాత్కాలికంగా అమలులో నున్న ధరలను బట్టి కొత్తభూములను కొనుకోవలెనని దలచినవారికి అప్పుల నిచ్చుటకు నిరాకరించేయెడలను భూముల కిమ్మతులకు స్థిరప్రమాణము లేర్పడగలవు. కాని, యీ పని అంతయును ప్రయివేటుఅసాముల వడ్డీవ్యాపారము నిషేధింపబడినప్పుడు కేవలంకటా భారీప్రమాణంలో నెరవేరగలదు.

సర్వతోముఖ సర్వవిషయసమన్వితమైన వ్యవసాయాభివృద్ధి విధానమును ఏవిధముగా కొనసాగింపవలెనో ఇదమిత్థముగా నెవరూ సూచింపగలిగితిరి. ప్రభుత్వమువారికి యీవిషయములో మితిమీరిన కార్యభారమును కల్పించుచున్నామని కొందరు తలంపవచ్చును. కాని, పైనచెప్పినవానిలో పెక్కింటిని ఇదివరకే ప్రభుత్వము నిర్వహించుచున్నది. ప్రభుత్వమనునది ప్రతివానిని ఉద్ధరించునని ఖండితముగా చెప్పుటకు వీలులేదు. ప్రతివానికి వృద్ధిలోనికి వచ్చుటకై సమమైన అవకాశములనుమాత్రమే ప్రభుత్వము కల్పించగలుగును. మానవులకు గల సహజసామర్థ్యములను వికసింపజేయుటకు ప్రభుత్వమువారు అవకాశములను కల్పించి తోడ్పడినయెడల ప్రభుత్వము తన ధర్మమును తాను చాలవరకు నిర్వర్తించినదగును.



Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.